హిళా ఉద్యమ కరదీపిక

# చైతన్య మానవి



త్రైమాసపత్రిక

జనవరి - మార్చి 2016

# ఐద్వా కార్యక్రమాలు



ఐద్వా నగర మహాసభ - నెల్లూరు



డ్వాక్రా సమస్యలపై తహశీల్దార్‌కు వినతిపత్రం - విజయనగరం





సంక్రాంతి సంబరాలు - తూర్పుగోదావరి



సావిత్రిబాయి పూలే జయంతి సభ - తిరుపతి




కొవ్వొత్తుల ర్యాలీ - తిరుపతి



ముగ్గుల పోటీలు - తిరుపతి



మహిళా దినోత్సవ సభ - ప్రకాశం

సంపాదకీయం

చైతన్య మానవి

# అణచివేతను ప్రతిఘటిస్తున్న యువత

**అబద్ధాలు! అతిశయాలు! గోబెల్స్ ప్రచారాలు! ఆంక్షలు! వేధింపులు! నిర్బంధాలు! హత్యలు!**
**మనువాదులారా! వీరంగాలాపండి!**

కేంద్ర విశ్వవిద్యాలయాలు రగులుతున్నాయి. పూనా, మద్రాసు ఐఐటి, హైదరాబాదు సెంట్రల్ యూనివర్శిటీ నేడు జెఎన్‌యూ. యువరక్తం సలసల మరుగుతున్నది. ఇంత అన్యాయమా? చెయ్యని నేరానికి జైలు ఊచలా? దాడిచేయడం పద్ధతి కాదని నచ్చచెప్పటానికి వెళ్ళిన నాయకుడిపైనే నేరమా? తప్పుడు జాతీయ వాదంతో సాటి విద్యార్థుల మీద దాడికి పూనుకోవడమే కాక జాతిద్రోహులని అసత్యాల శిఖరాలని నిర్మిస్తారా?

ముజఫర్‌నగర్‌లో 50 వేలమంది ముస్లిం స్త్రీ, పురుషులు ఎందుకు నిరాశ్రయులయ్యారు? 50 మందికి పైగా ముస్లిం యువకులను హత్య చేసిందెవరు? పునరావాస శిబిరాల్లో సైతం అత్యాచారాలకు గురైనా పట్టించుకోని స్థితి ఎందుకేర్పడింది? ముజఫర్‌నగర్ బాధితుల సమస్యలను చిత్రీకరించిన డాక్యుమెంటరీని చూడటం కూడా నేరమేనా? కాశ్మీర్ యువకులు ఎందుకు అదృశ్యమవుతున్నారు? విచారణ పేరిట పోలీసులు తీసికెళ్ళిన యువకులు ఏమయ్యారో సమాధానం చెప్పేవారేరి? ఈశాన్య రాష్ట్రాల విద్యార్థులపై ఢిల్లీలోనే దాడులు జరుగుతుంటే చూస్తూ ఊరుకుంటున్నారా? ప్రభుత్వమే ప్రోత్సహిస్తుందా? మణిపూర్‌లో 12 ఏళ్ళ బాలికను సైన్యమే గ్యాంగ్‌రేప్ చేసి చంపేస్తే పోలీసుల ముందు నగ్నంగా నిలబడిన తల్లుల ఆవేదనకు ఎవరు కారణము? ఏది సమాధానము? హింస ఎవరిది? వేళ్ళూనుకున్న కులవ్యవస్థను పెంచిపోషిస్తున్నవారెవరు? జాతి విద్వేషాలెందుకు పెరుగుతున్నాయి? ప్రశ్నించే రోహిత్‌లను, కన్హయ్యలను భరించలేరు!

యత్రనార్యస్తు..... అంటూనే నస్త్రీ స్వాతంత్ర్య మర్హతి అనే ఆర్ఎస్ఎస్ వారు భరతమాతంటూనే పట్టరాని బూతులు మాట్లాడతారు. ఆడపిల్లలెవరైనా ఇదేమని ప్రశ్నిస్తే రేప్ చేస్తామంటారు.

ఈదేశ ప్రజల సంస్కృతి, విశ్వాసాలు, హక్కులు ఆర్ఎస్ఎస్ అడుగుజాడలలో ఉండాలి. ఆడవాళ్ళు హక్కులు అడిగితే సంస్కృతిని నాశనం చేస్తున్నారంటారు. సమానుల్లం కాదా? అంటే 5 వేళ్ళు సమానంగా ఉన్నాయా అంటారు? సేవ చేయటమే దళితుల, మహిళల విధి అంటారు? ఉద్యమిస్తే మీకన్నా వ్యభిచారిణులు నయం అంటారు? కనిపెంచటం వరకే తల్లి తప్ప హక్కులు తండ్రివేనంటారు. కుల నిర్మూలన జరగాలని అంబేద్కర్ ఆశిస్తే కులాంతర వివాహాలు చేసుకున్న వారిని హత్యలు చేస్తారు. హిందూ అమ్మాయిలను ముస్లిం అబ్బాయిలు పెళ్ళి పేరిట మతం మారుస్తున్నారని తప్పుడు కేసులు పెట్టిస్తారు. పునఃసృష్టికి కారణమయ్యే ఋతుచక్రం 'అంటు' అంటారు. దైవాన్ని తాకితే, గుడిలోకి వెళ్తే అపవిత్రం అంటారు. వీటిని ప్రశ్నిస్తే ఉగ్రవాదులు, జాతి వ్యతిరేకులవుతారు. ఈ ప్రశ్నలు వేస్తున్న విద్యార్థుల ధైర్యం, విశ్వాసం వారికి వెర్రి పుట్టిస్తుంది.

బొంబాయి దాడులకు సూత్రధారి హెడ్లీ. హెడ్లీని అప్రూవర్‌గా అంగీకరిస్తారు. నమ్మి మనదేశం వచ్చిన యాకుబ్ మెమన్‌ను ఉరితీస్తారు! ఇష్రాత్ జహాన్‌ని ఎన్‌కౌంటర్ చేసినా తప్పులేదని హెడ్లీ నుండి సర్టిఫికెట్ తెచ్చుకుంటారు. సాధ్వి ప్రజ్ఞాసింగ్, కల్నల్ పురోహిత్‌లు మాలెగావ్, మక్కా మసీదులలో, బాంబు దాడులతో ప్రజలను బలిగొన్నవారు వీరి దృష్టిలో దేశభక్తులు.

శరీరాలపై బాంబులు కట్టుకుని హత్యలు చేయడానికి సిద్ధపడ్తున్న పరిస్థితులను చర్చించమంటే జాతి వ్యతిరేకులుగా ముద్రవేస్తారు. చచ్చేదాక వేధిస్తారు. కులమే ఈ జాతిని నిర్వీర్యం చేసిందన్నాడు వివేకానందుడు. రాజ్యాంగంలో సమానహక్కులు రాజకీయంగానే ఉన్నాయని సామాజిక, సాంస్కృతిక సమానత సాధించలేకపోతే ఈ రాజ్యాంగం మీదనే తిరగబడ్తారన్నారు డా॥ బి.ఆర్.అంబేద్కర్. మేం కూడా జాతి వ్యతిరేకులమంటూ నేడు వేల గొంతుకలు నినదిస్తున్నాయి.

రోహిత్ మరణం ఓ ప్లాన్డ్ మర్డర్. కొట్టారని తప్పుడు కేసు. జాతివ్యతిరేకమని దత్తాత్రేయ లేఖ. చర్య తీసుకునేవరకు ఒత్తిడి. భీష్మ సహాని "తమస్" లో మతనాయకులు అమాయకులను ఎలా రెచ్చగొట్టారో నేడు అదేవిధంగా పాకిస్తాన్ జిందాబాద్ అంటూ నినదించిన ద్రోహులే. కన్హయ్య మీద, ఉమర్ మీద తప్పుడు కథలు సృష్టించారు, వీడియోలు తయారుచేశారు. వాటిని "మనుస్మృతి" రాణి నటనా వైదుష్యంతో పండించడం వంచనకు పరాకాష్ట.

ఏమి తినాలో! ఏమి తాగాలో! ఏమి దుస్తులు వేసుకోవాలో! ఎవరిని పెళ్ళి చేసుకోవాలో! ఏమిమాట్లాడాలో! ఎక్కడికి వెళ్ళరాదో నిర్దేశించే హిట్లర్‌లు రాజ్యమేలుతున్నారు. ధిక్కరిస్తే యూదుల గతేనంటున్నారు.

మహిళలు, దళితులు, ముస్లిమ్‌లు, క్రిష్టియన్‌లు, నాస్తికులు, కమ్యూనిస్టులు, ప్రశ్నించే మేధావులు మనువాదానికి శత్రువులే! ఆధిపత్యాన్ని నిలబెట్టుకునేందుకు, జాతి పేర కాలం చెల్లిన హిందూత్వాన్ని రుద్దటానికి నానా హంగామా చేస్తున్నారు. ఇల్లెక్కి రంకెలు వేస్తున్నారు. ఈ దాడిని తిప్పికొడదాం! ఐక్యంగా అడుగులేద్దాం? భారతీయ తార్కిక విధానమే ప్రాతిపదికగా ఆధిపత్యాన్ని, రక్తదాహాన్ని నిలవరిద్దాం. జాతులు, మతములన్నియు మాసిపోవును జ్ఞానమొక్కటే నిలిచి వెలుగునన్న గురజాడ స్ఫూర్తితో జాతికంటె, మతం కంటె మానవత గొప్పదని స్వేచ్ఛా సమానత్వం, సౌభ్రాతృత్వం అత్యున్నత మానవ విలువలని అందుకోసం దేనినైనా ఎదిరిస్తామన్న యువత నూతన ప్రపంచానికి వేగుచుక్కలా జ్వలిస్తుంది.

# చైతన్య మానవి

## ఈ సంచికలో






**అఖిల భారత ప్రజాతంత్ర మహిళా సంఘం ఎ.పి. రాష్ట్ర కమిటీ**

చిరునామా :
ఐద్వా రాష్ట్ర కార్యాలయం,
కల్పన ప్రింట్స్ రోడ్, కృష్ణలంక,
విజయవాడ.
ఫోన్, 9490098620, 9490098022
E-mail : Chaitanyamanavi@gmail.com

సంపాదకులు
**డి. రమాదేవి**

సంపాదక వర్గం
**కె. స్వరూపరాణి**
**బి. ప్రభావతి**

మేనేజర్
**ఎం. సుధ**

**విరాళం రూ : 10/-**

ప్రజాశక్తి డైలీ ప్రింటింగ్ ప్రెస్,
కృష్ణనగర్, తాడేపల్లి మండలం, గుంటూరు జిల్లా

# 2015 హర్యానా పంచాయతీ రాజ్ (సవరణ) చట్టం- ప్రజాస్వామ్యానికి విఘాతం

> ఆర్డినెన్స్ "వేద్వంతి" అనే వ్యక్తి పంజాబ్ అండ్ హర్యానా హైకోర్టులో పిటీషన్ వేసారు. ఆగస్టు 21-2015న హైకోర్టు ఒక మధ్యంతర ఉత్తర్వుల ద్వారా ఈ ఆర్డినెన్సును నిలిపివేసింది. ఈ ఆదేశాలే జారీ చేస్తూ, ప్రజల్లో ఎంత శాతం మెట్రిక్ చదివినవారో, ఎంత శాతం మధ్యతరగతికి చెందినవారో, అనే సర్వే సమగ్రంగా జరపలేదని, ఈ ఆర్డినెన్సు పెద్ద సంఖ్యలో ప్రజలని ఎన్నికల ప్రక్రియనుంచి బయటికి నెట్టివేస్తుందని తేల్చి చెప్పింది. ఈ ఆర్డినెన్స్ రాజ్యాంగం ఆర్టికల్ 14 ప్రకారం ఎన్నికల్లో పోటీ చేసే సమాన అవకాశం అన్న హక్కుకు ఉల్లంఘన కల్గిస్తుందని చెప్పింది.

డిసెంబర్ 10, మానవ హక్కుల రోజునాడే సుప్రీం కోర్టు ఇచ్చిన తిరోగమన తీర్పు ప్రకారం, దళితులు, మహిళలు, వెనుకబడిన ప్రజలు, హర్యానా పంచాయతీ ఎన్నికలలో పోటీ చేయడానికి అనర్హులు. హర్యానా జనాభాలో కనీసం 2/3 ప్రజలకి ఎన్నికలలో పోటీ చేసే అవకాశం ఉండదు. ఈ తీర్పు సమాజంలో అణగారిన వర్గాల ప్రాథమిక హక్కులకు భంగం కలిగిస్తుంది. ఐద్వా ప్రధాన కార్యదర్శి జగమతి సాంగ్వాన్ సుప్రీంకోర్టు వాస్తవ పరిస్థితులు చూడకుండా, హర్యానా ప్రభుత్వం ఇచ్చిన అరకొర, అసంపూర్ణ సమాచారం ఆధారంగా ఈ తీర్పునిచ్చిందని, దీనిపై ఐద్వా ఒక రివ్యూ పిటీషను దాఖలు చేయనున్నదని, ప్రజలను సమీకరించి ఈ తీర్పు వల్ల పంచాయతీ ఎన్నికలలో నష్టాలు వివరించి పోరాటానికి సంసిద్ధత వర్చేందుకు క్యాంపెయిన్ చేయనున్నదని పేర్కొన్నారు.

హర్యానా ప్రభుత్వం ఆగస్టు 14, 2015న ఒకఆర్డినన్స్ ద్వారా హర్యానా పంచాయితీరాజ్ చట్టంలో మార్పులు తీసుకొని వచ్చింది. ఈ ఆర్డినెన్స్ వల్ల సాధారణ ప్రజలు సర్పంచ్‌గా గాని, మెంబర్‌గా గాని నిలబడాలంటే:

1.కనీస విద్యార్హతలు కల్గి ఉండాలి.

2. జిల్లా సహకార బ్యాంకులకు గాని, లేదా, ఇతర వ్యవసాయ బ్యాంకులకు గాని బకాయిలు చెల్లించని వారు ఎన్నికలలో పోటీ చేయడానికి అర్హులు కారు.

3. విద్యుత్ బిల్లులు బకాయిలు చెల్లించనివారు;

4. తమ ఇంట్లో మరుగుదొడ్డి ఉన్నదని ధ్రువీకరణ ఇవ్వని వారు; ఎన్నికల్లో పోటీ చేయడానకి అర్హులు కారు.

ఈ ఆర్డినెన్స్‌పై "వేద్వంతి" అనే వ్యక్తి పంజాబ్ అండ్ హర్యానా హైకోర్టులో పిటీషన్ వేసారు. ఆగస్టు 21-2015న హైకోర్టు ఒక మధ్యంతర ఉత్తర్వుల ద్వారా ఈ ఆర్డినెన్సును నిలిపివేసింది. కోర్టు ఆదేశాలు జారీ చేస్తూ, ప్రజల్లో ఎంత శాతం మెట్రిక్ చదివినవారో, ఎంత శాతం మధ్యతరగతికి చెందినవారో, అనే సర్వే సమగ్రంగా జరపలేదని, ఈ ఆర్డినెన్సు పెద్ద నంఖ్యలో ప్రజలని ఎన్నికల ప్రక్రియనుంచి బయటికి నెట్టివేస్తుందని తేల్చి చెప్పింది. ఈ ఆర్డినెన్స్ రాజ్యాంగం ఆర్టికల్ 14 ప్రకారం ఎన్నికల్లో పోటీ చేసే సమాన అవకాశం అన్న హక్కుకు ఉల్లంఘన

> **ఆర్డినెన్స్ ఫలితం**
>
> **హర్యానా ప్రభుత్వం ఆగస్టు 14, 2015న ఒకఆర్డినన్స్ ద్వారా హర్యానా పంచాయితీరాజ్ చట్టంలో తీసుకువచ్చిన మార్పులు వలన కలిగిన తీవ్ర పరిణామాన్ని గమనిద్దాం! 2010లో జరిగిన పంచాయితీ ఎన్నికల్లో 1,70,504మంది పోటీ చేయగా 2015 ఎన్నికల్లో అది 41,264మంది మాత్రమే పోటీ చేయగలిగారు. 54.4% స్థానాలు పోటీ లేకుండా ఏకగ్రీవం అయ్యాయి. 19.5% సీట్లకు పోటీ చేసేందుకు అర్హులైన అభ్యర్థులే లేరు. హర్యానాలోని 'తోసం' అను బ్లాక్‌స్థాయి సమావేశంలో ఒక్క మహిళా సభ్యురాలు కూడా లేని పరిస్థితి. 2010లో 374 స్థానాల్లో 119మంది పట్టభద్రులు ఎన్నికల్లో పోటీచేస్తే ఈసారి 95మంది మాత్రమే పట్టబద్రులు పోటీ చేశారు. అర్హతల పేరుతో ఎన్నికల ప్రక్రియను ప్రహసనం చేశారు.**

కల్గిస్తుందని చెప్పింది.

కానీ హర్యానా ప్రభుత్వం ఈ ఆర్డినెన్సు స్థానంలో 7.9.15న చట్ట సవరణ చేసింది. ఈ చట్టాన్ని అమలు పరుస్తూ హర్యానా రాష్ట్ర ఎన్నికల సంఘం నామినేషన్ వేయుటకు కేవలం 5రోజులు మాత్రమే అవకాశం ఇస్తూ (15నుంచి19) నోటిఫికేషన్ జారీ చేసింది.

14.9.15న ఐద్వా దీనిపై రిట్ దరఖాస్తు దాఖలు చేసింది. 1.హర్యానా ప్రభుత్వం తెచ్చిన చట్టం ప్రజాస్వామ్యానికే విఘాతమని, చట్ట విరుద్ధమని తెలిపింది.

2. రాజ్యాంగం కల్పించిన ఆర్టికల్ 14 ప్రకారం, ప్రాథమిక హక్కులను ప్రజలు కోల్పోతున్నారు.

3. ఈ సవరణ, రాజ్యాంగానికి విరుద్ధంగా మెజారిటీ పౌరులను ఎన్నికల ప్రక్రియ నుంచి దూరంగా ఉంచుతుంది.

4. ఇది 73వ రాజ్యాంగ సవరణకు కూడ విరుద్ధం.

5. ప్రజల ప్రాతినిధ్య చట్టంలో రాజ్యాంగం ప్రకారం పొందుపరిచిన సారాంశాన్ని ఉల్లంఘిస్తున్నది.

**అధికార దుర్వినియోగం :**

హర్యానా హైకోర్టు స్టే విధించినప్పటికీ, ప్రభుత్వం మాత్రం ఈ ఆర్డినెన్స్‌లో పొందు పరిచిన అంశాలను అమలు చేసింది. ఆర్డినెన్స్‌పై స్టే అంటే ఆ అంశం చట్ట ప్రకారం కూడా అమలు చేయకూడదు. 8వ తేదీన వ్యవధి లేకుండా నోటిఫికేషన్ జారీ చేసింది.. ఇంత తక్కువ గడువు ఇవ్వడంలోనే ప్రభుత్వ అధికార దుర్వినియోగం తేటతెల్లం అవుతుంది.

ఈ చట్టం తేవడంలో ప్రభుత్వ దురుద్దేశం వ్యక్తమవుతుంది. చాలా మంది ప్రజలను ఈ ఎన్నికల ప్రక్రియలోంచి తొలగించడమే వారి ఉద్దేశ్యం. హైకోర్టు ఆదేశాలను నిరాకరించి, ప్రభుత్వం హుటాహుటిన ఈ చట్టం చేసింది.

ఆర్టికల్ 14 ప్రకారం రాజ్యాంగం ప్రతి పౌరుడికి సమాన అవకాశాలు కల్పించింది. ఈ సమానత్వాన్ని హర్యానా ప్రభుత్వం ఉల్లంఘించింది. ప్రజాప్రతినిధుల విధుల నిర్వహణకు కనీస విద్యార్హతలు తప్పనిసరి కాదని, అనేక ఉదాహరణలున్నాయి.

ఆర్టికల్ 21ఎ మరియు 45 ప్రకారం, పౌరులకు ఉచిత ప్రాథమిక విద్య అందించే బాధ్యత ప్రభుత్వానిది. విద్యార్హతలు లేవన్న కారణంగా పోటీకి అనర్హులుగా పరిగణించడ

**రాజస్థాన్ హైకోర్టు ఆదేశాలు: ఇదే అంశం మీద హర్యానా పొరుగునే వున్న రాజస్థాన్ రాష్ట్ర ప్రభుత్వం ఇటువంటి ఉత్తర్వులనే గతంలో ఇచ్చింది. రాజస్థాన్ హైకోర్టు 15.1.2015న తన తీర్పులో ఆ ఉత్తర్వులు చెల్లవని తీర్పునిచ్చింది. రాజ్యాంగంలోని 14వ అధికరణకు ఇది విరుద్ధమని చెప్పింది. ఈ అధికరణ ప్రకారం కుల,మత, లింగ వివక్షత లేకుండా రాజ్యాంగంలో అందరికి సమాన అవకాశాలు ఉంటాయి. ప్రాధమిక స్థాయిలో తమను తామే పరిపాలించుకునే లక్ష్యాన్ని ఇది దెబ్బతీస్తుందని రాజస్థాన్ హైకోర్టు చెప్పింది. కనీస విద్యార్హతలు విధించడం రాజ్యాంగంలో పేర్కొన్న లక్ష్యాలకే విరుద్ధమని పేద, బలహీన వర్గాల ప్రజలు ముఖ్యంగా మహిళలు దీనివలన హక్కులు కోల్పోతారని కోర్టు భావించింది.**

మంటే ప్రభుత్వ వైఫల్యానికి ప్రజల్ని శిక్షించ డమే. ఇతర తరహా ప్రమాణాలు కూడా ఆర్టికల్ 14కి విరుద్ధంగా ఉన్నాయి. ఉదా: గ్రామీణ/ వ్యవసాయ ఋణాలు తీర్చలేకపోతే పోటీ చేయకూడదని పెట్టిన షరతు, కేవలం పేద రైతులను మరియు వ్యవసాయ కార్మికులను ఎన్నికల ప్రక్రియ నుంచి తొలగించడానికే. ఈరోజు వ్యవసాయం తీవ్ర సంక్షోభంలో వుంది.

విద్యుత్ బిల్లులు చెల్లించనివారిని తొలగించడం కూడ ఈ కోవకే వస్తుంది. 2011 జనాభా లెక్కల ప్రకారం 74.5% గ్రామీణ కుటుంబాలలో ఆదాయం రూ.5000/- కన్నా తక్కువ. హర్యానాలో ఈ శాతం 58.96% ఎస్.సిలలో 79.89% ఇంత పేదరికానికి కారణం ప్రభుత్వ విధానాలే. ఇంట్లో మరుగుదొడ్డి లేదని నామినేషన్ నిరాకరించడం కూడా అన్యాయం. ప్రజలకు కనీస వసతులు కల్పించవలసిన బాధ్యత ప్రభుత్వానిది. ఎన్.ఎస్.ఎస్ సర్వే ప్రకారం, హర్యానాలో 25.4% ఇళ్ళల్లో మరుగుదొడ్లు లేవు. ఈ షరతులు విధించడం ద్వారా ప్రజల కు అవసరమైన ప్రోత్సాహం అందించవలసి నది పోయి, ప్రభుత్వం సమాన అవకాశాలను నిరాకరిస్తున్నది. ఐద్వా న్యాయవాది కీర్తిసింగ్ తన వాదనలో సుప్రీంకోర్టు చెప్పిన తీర్పును ప్రస్తావించారు. ప్రజాప్రతినిధులుగా విధులు సక్రమంగా నిర్వహించడానికి, విద్యార్హతలకు ఎటువంటి సంబంధం లేదని సుప్రీమ్‌కోర్టు చెప్తూ, అవకాశాలు నిరాకరించడం ప్రజా స్వామ్యానికి గండి కొట్టడమేనని చెప్పింది.

**రాజస్థాన్ హైకోర్టు ఆదేశాలు:** ఇదే అంశం మీద హర్యానా పొరుగునే వున్న రాజస్థాన్ రాష్ట్ర ప్రభుత్వం ఇటువంటి ఉత్తర్వులనే గతంలో ఇచ్చింది. రాజస్థాన్ హైకోర్టు 15.1.2015న తన తీర్పులో ఆ ఉత్తర్వులు చెల్లవని తీర్పునిచ్చింది. రాజ్యాం గంలోని 14వ అధికరణకు ఇది విరుద్ధమని చెప్పింది. ఈ అధికరణ ప్రకారం కుల,మత, లింగ వివక్షత లేకుండా రాజ్యాంగంలో అందరికి సమాన అవకాశాలు ఉంటాయి. ప్రాధమిక స్థాయిలో తమను తామే పరిపాలిం చుకునే లక్ష్యాన్ని ఇది దెబ్బతీస్తుందని రాజస్థాన్ హైకోర్టు చెప్పింది. కనీస విద్యార్హతలు విధించడం రాజ్యాంగంలో పేర్కొన్న లక్ష్యాలకే విరుద్ధమని పేద, బలహీన వర్గాల ప్రజలు ముఖ్యంగా మహిళలు దీనివలన హక్కులు కోల్పోతారని కోర్టు భావించింది. తమకు ప్రతినిధిగా ఉండే వ్యక్తి యొక్క సమర్ధతని అంచనా వేసే శక్తి ప్రజలకు ఉంటుందని కోర్టు స్పష్టం చేసింది. కనీస విద్యార్హత లేదు అన్న పేరుతో ఎక్కువ శాతం గ్రామీణ పేదలని ముఖ్యంగా, మహిళలను అనర్హులుగా ప్రకటించడం ఏకపక్షమైనదని, అర్ధం లేనిదని, రాజస్థాన్ హైకోర్టు తన తీర్పులో చెప్పింది, కానీ ఈ తీర్పుని పట్టించుకోకుండా హర్యానా ప్రభుత్వం వ్యవహరించడం, దానికి అక్కడి హైకోర్టు మరియు సుప్రీంకోర్టు మద్దతు తెల్పడం చాలా అన్యాయం.

2011 జనాభా లెక్కల ప్రకారం హర్యానాలో 20 సం॥లు పైబడినవారు 10వ తరగతి విద్యార్హత లేనివారు దళితేతరుల జనాభాలో 56.8 శాతం. అందులో మగవారు 47.4 శాతం కాగా మహిళలు 67.00%. దళితులలో 8వ తరగతి విద్యార్హత వుండాలని హర్యానా ప్రభుత్వం నిర్దేశించింది. ఆ లెక్కన చూస్తే 83% దళితులు అనర్హులు అవుతారు. దీనిని బట్టి ఎంత హెచ్చు మోతాదులో పేదలు అందునా మహిళలు అందులో దళిత మహిళలు అనర్హులు అవుతారో స్పష్టం అవుతుంది. 73వ రాజ్యాంగ సవరణ చట్టం ప్రకారం స్థానిక సంస్థలలో 33 శాతం మహిళలకు రిజర్వేషన్ వుంది. అదే చట్టంలో స్థానిక సంస్థలకు నిధులు, విధులు బదలా యించాలని కూడా నిర్దేశించారు. అధికార వికేంద్రీకరణ, పునాది స్థాయిలో ప్రజాస్వామ్యం, లైంగిక సమానత్వం, సామాజిక న్యాయం ఈ రాజ్యాంగ సవరణ చట్టం యొక్క లక్ష్యాలు. ఈ చట్టంలో ఎక్కడా కనీస విద్యార్హత ప్రస్తావన లేదు. గ్రామీణ ప్రాంతాలలో భూస్వామ్య శక్తుల యొక్క పట్టు బలంగా ఉందని, పంచాయతీలలో వారి పెత్తనమే కొనసాగు తున్నదని 73వ రాజ్యాంగ సవరణ వలన ఆ భూస్వామ్య పెత్తనానికి గండి పడుతుందని ప్రజాస్వామ్యం విస్తరిస్తుందని సుప్రీంకోర్టు గతంలో తెల్పింది.

1951 ప్రజాప్రాతినిధ్య చట్టం ఎమ్ఎల్ఏ లకి ఎటువంటి కనీస విద్యార్హతలను నిర్ణయించలేదు. ఏమాత్రం చదువులేని వ్యక్తి కూడ ఎన్నికై, మంత్రిగా, ప్రధానమంత్రిగా చివరకు దేశాధ్యక్షునిగా కూడ వ్యవహరించ వచ్చును. శాసన మండలి ఉపాధ్యాయ నియోజకవర్గ అభ్యర్ధికిగాని, పట్టభద్ర నియోజక అభ్యర్ధికి గాని కనీస విద్యార్హత అంటూ ఏమీ లేదు. ప్రభుత్వం చేసిన చట్టం ప్రకారం పంచాయతీలో, వార్డు మెంబరుగా వుండాలన్నా కూడా 10వ తరగతి పాసయి వుండాలి. అంటే పెద్ద పదవులు నిర్వహించడానికి అక్కరలేని విద్యార్హత పంచాయతీ స్థాయిలో కావాలన్న మాట. పెద్ద పెద్ద వాళ్ళు, ధనవంతులు పెద్ద పదవులు నిర్వహించాలనుకుంటే వారికి చదువు విషయంలో ఎటువంటి నిబంధన లేదు. చిన్నవారు, పేదవారు, అందున మహిళలు గ్రామస్థాయిలో చిన్నపాటి పదవులు నిర్వహించాలన్నా చదువు అవసరమని హర్యానా ప్రభుత్వం చెబుతున్నది. ఇంతటి వివక్షాపూరితమైన చట్టాన్ని రద్దు చేయాలని ప్రజాతంత్ర వాదులందరూ కోరాలి. పురుషాధిక్యత, కులతత్వం ఈ చట్టం వెనుక పని చేస్తున్నాయని స్పష్టం అవుతున్నది. ఈ జబ్బులు బి.జె.పి తదితర రాష్ట్రాలలో ప్రకోపి ంచడం, ఆ పార్టీకి చెందిన జాతీయ నేతలు ఎవ్వరూ ఈ హర్యానా చట్టాన్ని వ్యతిరేకించక పోవడం మనం ముఖ్యంగా గమనించాలి. మనం మౌనంగా ఉంటే ఈ జాడ్యం దేశంలో అన్ని ప్రాంతాలకు వ్యాపించే ప్రమాదం ఉంది.

**స్వేచ్ఛానువాదం : ఎమ్.పద్మజ**

**మూలం: ఉమెన్స్ ఈక్వాలిటీ.**

వివక్ష

# ఏది పవిత్రత? ఏదపవిత్రత?

- వడ్లమూడి పద్మ




శరీరంలోని ఏ అవయం నుంచి రక్త స్రావమైనా అది అపవిత్రం కానపుడు బహిష్టు సమయం అపవిత్రమెలా అవుతుంది? స్రావమయ్యే అవయవాన్ని బట్టి దానికి అపవిత్రత ఆపాదించేట్లయితే మనిషి జన్మే అపవిత్రం కాదా! లేదు ఆ రక్తమే అపవిత్ర మంటారా? అయితే ఆ రక్తం పంచుకు పుట్టిన మీరూ అపవిత్రులు కారా! ఇదీ ఆధునిక మహిళలు సనాతన ఛాందసవాదులకు వేస్తున్న సూటి ప్రశ్న.

మూఢ భావాలను జనం మెదళ్లలోకి పంపి, ఏదో ఒక పేరుతో స్త్రీలను మళ్లీ వెనక్కు నెట్టే ప్రయత్నం చేస్తున్న నాయనలారా! ఈ భూమ్మీదకు మీరెలా వచ్చారు? సృష్టికి ప్రాణం పోసే బహిష్టు క్రమానికి అపవిత్రత ఆపాదిస్తే ఈ సృష్టే మిమ్మల్ని అసహ్యించుకుంటుందని మరువద్దు. స్త్రీల బహిష్టు లేకుంటే మీరు లేరు. మేమూ లేము. ఈ మానవ సమాజమే లేదు.

కొన్ని వందల వేల ఏళ్లుగా ప్రకృతి ధర్మం నిర్వర్తించే క్రమమే మహిళలను అణచివేసేందుకు మనువాదులకు దొరికిన ఆయుధం. ఆ ఆయుధాన్ని వాళ్లు మళ్లీ వెలికి తీశారు. కనుక సోదరీమణులారా! ఇది మనం మళ్లీ అప్రమత్తం కావాల్సిన తరుణం. లేకుంటే మళ్లీ మన జీవితాలు.. ఈ సమాజంలో సగ భాగం తెరవెనక్కు నెట్టబడ తాయి. ఎందరో మహిళా మణుల, సంఘ సంస్కర్తల పోరాటాల ఫలితంగా మనకు దక్కిన హక్కులు నీరుగార్చే ప్రయత్నాలు సాగుతున్నాయి. మన శరీరాలపైన, మన మనసులపైన పితృస్వామిక ఆధిపత్యం బలంగా ముందుకొస్తోంది.

**అసలేం జరుగుతోంది?**

ఒక ఛాందస భావజాలమే మళ్లీ కొత్తగా తెరపైకి వస్తోంది. 2015 నవంబరు 15 శబరిమలైకు చెందిన ట్రావెన్‌కోర్ దేవ స్థానానికి కొత్తగా బోర్డు అధ్యక్షునిగా బాధ్య తలు చేపట్టిన ప్రయర్ గోపాలకృష్ణన్ ఓ వివాదాస్పద వ్యాఖ్య చేశాడు. 'ఆడవాళ్లు ఆలయానికి వచ్చేటపుడు వారు పవిత్రులో కాదో (బహిష్టులో ఉన్నారో లేదో) తెలుసుకు నేందుకు ఓ యంత్రాన్ని కనుగొనాలన్నదే ఆయన వ్యాఖ్య. శబరిమలై అయ్యప్ప ఆలయంలోకి పది నుంచి 50 ఏళ్ల మధ్య వయస్సులైన మహిళలకు ప్రవేశం నిషిద్ధం. ఆ వయసు ఆడవాళ్లు బహిష్టు క్రమంలో ఉంటారని, అయ్యప్ప బ్రహ్మచారి అని, అందుకే ఈ నిబంధన అన్నది వారి వాదన. ఎవరి నమ్మకాలు వారివి. కానీ ఇక్కడ గోపాలకృష్ణన్ చేసిన వ్యాఖ్యలే అభ్యంతర కరమైనవి. 'నేను ఆడవాళ్లను ఆలయంలోకి రానిస్తాను. కానీ వారు పవిత్రులో లేదో గుర్తించే యంత్రాన్ని కనుగొన్నాక మాత్రమే' అంటారు ఆయన. ఎవరి వద్ద అయినా ఆయుధాలు ఉన్నదీ లేనిదీ తెలుసు కునేందుకు యంత్రాలు ఉన్నట్లే స్త్రీలు బహిష్టులో ఉన్నారో లేదో తెలుసుకునే యంత్రాలు రావాలంటాడు ఆయన.

ఇదే మహిళల ఆగ్రహానికి కారణ మయింది. "మాకు మాత్రమే పరిమితమైన మా నెలసరి సంగతి నలుగురికీ తెలి యాల్సిన అవసరమేమిటి?" అంటూ పంజాబ్‌లోని పాటియాలాకు చెందిన నిఖిత అజాద్ అనే యువతి ప్రశ్నించింది. ఆమె ఈ అంశంపై ఫేస్‌బుక్ కేంద్రంగా బహిరంగ చర్చకు దిగారు. ఎందరో యువతీ యువ కులు ప్రత్యేకించి అర్బన్ యువత ఆమెతో గళం కలిపారు. 'హ్యాపీ టు బ్లీడ్' క్యాంపైన్‌కు ఆమె పిలుపునిస్తే ఎందరో స్పందించారు. ప్లకార్డుపై గానీ, శానిటరీ ప్యాడ్స్‌పై గానీ 'హ్యాపీ టు బ్లీడ్'అని హ్యాష్ ట్యాగ్ చేయాలని నిఖిత పిలుపునిచ్చిందే తడువుగా ఎందరో యువతులు స్పందించి అలాగే చేశారు. నవంబర్ 21న ఆమె ఈ పిలుపునిస్తే వేలాది మంది యువతులు ఫేస్‌బుక్‌లో ఆ మేరకు పోస్టులు పెట్టారు. ట్విట్టర్‌లో ట్వీట్ చేశారు. ఇపుడు 'ప్యూరిటీ (పవిత్రత) అంటే ఏమిటి?' అనే అంశంపై ఓపెన్ డిబేట్‌కు తెరలేచింది. ఇది మహిళల భౌతికమైన అంశానికి సంబంధించిన జరుగుతున్న ఒక ఉద్యమంగా రూపుదాల్చింది. 'నగం ప్రపంచాన్ని అపవిత్రంగా పరిగణించే ఏ మతాన్నీ మేము విశ్వసించం'అంటున్నారు ఈ యువతులు.

'మా ఈ ఉద్యమం ఆలయాల్లో ప్రవేశం కోసం కాదు. మొత్తం పితృస్వామిక సమాజంపైన, సమాజంలో పెరుగుతున్న

## శబరిమలలో మహిళలను అనుమతించాల్సిందే

శబరిమల ఆలయంలోకి మహిళల ప్రవేశంపై అనాదిగా వస్తున్న సంప్రదాయంలో జోక్యం చేసుకోవడం సరికాదన్న కాంగ్రెస్ అభిప్రాయం తప్పు. ఆలయంలోకి మహిళలకు ప్రవేశం కల్పించాలిందే. ఇది నా వ్యక్తిగత అభిప్రాయం. ఆచారాలు సంప్రదాయాలు మనుషులు సృష్టించుకున్నవే. శబరిమల ఆలయంలోకి మొదట్లో దళితులను అనుమతిం చలేదు. 1930లో ఆ సంప్రదాయానికి స్వస్తి చెప్పి, వారినీ అనుమతిస్తున్నారు. కాబట్టి, సామాజిక వ్యవహారాల్లో అంటూముట్టుకు తావే లేదు. అయినా, మనుషుల సాంగత్యంతో భగవంతుని విశిష్టత తగ్గిపోతుందని నేను అనుకోను.



- శశిథరూర్, కాంగ్రెస్ ఎంపీ

లింగ వివక్షకు వ్యతిరేకంగా మేము ఉద్యమిస్తాం. బూజుపట్టిన ఛాందస ఆచారాలపైనే మా ఈ ఉద్యమం. కోరుకున్న చోటకు వెళ్లే హక్కు మాకు ఉంది. దానిని అడ్డుకునే హక్కు ఎవరికీ లేదు' అంటున్న నిఖితతో ఎందరో గళం కలిపారు. 'హ్యాపీ టు బ్లీడ్' అంటూ ఫేస్‌బుక్‌లో వేలాదిమంది పోస్టులు పెట్టారు. పెడుతున్నారు. ఎందరో పురుషులు కూడా వీరికి మద్దతు నిచ్చారు.

దీనిపై పెద్ద చర్చ కూడా నడుస్తోంది. బాధతో కూడుకున్న బహిష్టును 'హ్యాపీ టు బ్లీడ్ అని ఎలాగ అనగలము' సహజంగా జరిగే ఒక శరీర ధర్మానికి ఆచారం పేరిట అపవిత్రత అంటగట్టే వారిని ఉద్దేశించి వాడిన పదం ఇది' అని నిఖిత వివరణ ఇచ్చారు. 'హ్యాపీ అంటే ఇక్కడ సంతోషమని అర్థం కాదు. సహజంగా జరిగే ఈ ప్రక్రియతో మేము ఎలా అపవిత్రం అవుతాం అని ప్రశ్నిస్తూ బహిష్టు లేకపోతే ఈ సమాజమే లేదు కదా. దీనికి అపవిత్రతను ఎలా ఆపాదిస్తారు?'అని ప్రశ్నిస్తున్నారు వీరు.

'పవిత్రత' పేరుతో చేస్తున్న వ్యాఖ్య ఎవరు చేసినా ఆచారాల పేరిట, తెలియనితనంతో చేస్తున్నవి కాదు. అది తేలిగ్గా తీసుకునే అంశం అంతకంటే కాదు. ఇటీవల కాలంలో పితృస్వామిక సమాజం మహిళలపై వివిధ రూపాల్లో అణచివేత ప్రయత్నాలను తీవ్రతరం చేసింది. పిల్లలను కనడమే మహిళల పని అని, వంట ఇంటికి పరిమితమై, సేవ చేయడమే ఆమె ధర్మమని ప్రబోధిస్తూ ఇటీవల కొందరు మనువాదులు ముందుకొస్తున్నారు. ఇటువంటి వారు ఉద్దేశ్యపూర్వకంగా ముందుకు తెస్తున్న వాదనల్లో భాగమే ఇది కూడా. బహిష్టు సమయంలో మహిళలు ఇబ్బందులు పడతారని సానుభూతిని ఒలకబోస్తూ ఉంటారు మరికొందరు. ఈ అంశంపైనే ఇపుడు బహిరంగ చర్చ జరుగుతోంది.

**మళ్లీ వెనక్కా?**

ఆచారాల పేరిట ఒకనాడు బహిష్టులో ఉన్న మహిళలను ఇంటి వెలుపలే అందరికీ దూరంగా, ఎవరికీ కనిపించకుండా ఉంచేవారు. క్రమంగా వారిని ఇంట్లోనికి రానిచ్చారు. మెల్లగా కుటుంబ అవసరాల

**బాధతో కూడుకున్న బహిష్టును 'హ్యాపీ టు బ్లీడ్ అని ఎలాగ అనగలము' సహజంగా జరిగే ఒక శరీర ధర్మానికి ఆచారం పేరిట అపవిత్రత అంటగట్టే వారిని ఉద్దేశించి వాడిన పదం ఇది' అని నిఖిత వివరణ ఇచ్చారు. 'హ్యాపీ అంటే ఇక్కడ సంతోషమని అర్థం కాదు. సహజంగా జరిగే ఈ ప్రక్రియతో మేము ఎలా అపవిత్రం అవుతాం అని ప్రశ్నిస్తూ బహిష్టు లేకపోతే ఈ సమాజమే లేదు కదా. దీనికి అపవిత్రతను ఎలా ఆపాదిస్తారు?'అని ప్రశ్నిస్తున్నారు వీరు.**

రీత్యా ఆ ఆచారాలు సడలుతూ వచ్చాయి. ఇప్పుడు సామాజిక ఉత్పత్తిలో భాగమైన మహిళల బహిష్టును అపవిత్రంగా చూడడమనే భావనే చాలా వరకు తొలగి పోయింది. ఎక్కడో ఇంకా వెనుకబడిన కొన్ని మారుమూల ప్రాంతాల్లో మాత్రమే ఇది కొనసాగుతోంది. అయితే ఇంకా కొందరు శుభకార్యాల సమయంలో దీనిని పట్టింపుగా చూస్తూనే ఉన్నారు. ఆ సమ యంలో బహిష్టు క్రమాన్ని వాయిదా వేసేందుకు ఔషధాలను వినియోగించడం ద్వారా ఆరోగ్యాన్ని కూడా దెబ్బ తీసుకుంటున్నారు. ఇటువంటి నిర్ణయాలు కేవలం వారికున్న విశ్వాసాలపై ఆధారపడి ఉంటాయి. కానీ వీటిని అడ్డుపెట్టుకుని మహిళలను మరింత అజ్ఞానాంధకారాలవైపు నెట్టడమే నేరమవుతుంది. అలా నెట్టే ప్రయత్నాలు రోజు రోజుకూ బలపడుతున్నాయి. అడుగులు శాస్త్ర విజ్ఞానంవైపు పడుతున్నా, కొందరి ఆలోచ నలు ఇంకా ఆచారాల పేరిట, అజ్ఞానం దిశగా నడిపిస్తూనే ఉన్నాయి. మనువాదులు రాజ్యాన్ని తన గుప్పెట్లోకి తీసుకున్నాక మళ్లీ ఈ ధోరణులు పెరుగుతున్నాయి. కాలగర్భంలో కలిసిపోయిన ఛాందస భావాలను తవ్వి తీసి మహిళలను ఏదో ఒక పేరుతో నాలుగు గోడల మధ్యకు నెట్టే ప్రయత్నాలను కొందరు ఉద్దేశ్యపూర్వకంగా తీవ్రతరం చేశారు.

**మన అడుగులు ఎటు?**

మనం ఏ బాటలో నడవాలో ఆలోచించుకోవలసిన తరుణం ఇదే. ఒకనాడు ప్రకృతిని జయించడంతో అగ్రగామిగా నిలిచింది మహిళలే. వ్యవసాయాన్ని ఆవిష్కరించిందీ మహిళలే. ప్రకృతి ధర్మాన్ని నిర్వర్తించే క్రమంలో ఉత్పత్తిలో వచ్చిన మార్పులతో ఆమె ఇంటికి పరిమితమయింది. క్రమంగా ప్రకృతిపైనే కాదు..తనపై కూడా తాను ఆధిపత్యాన్ని కోల్పోయింది. పితృస్వామిక వ్యవస్థ బలపడింది. మళ్లీ మహిళలను కోలుకోనీయలేదు. వందల వేల ఏళ్ల పరిణామ చరిత్ర ఇది. మహిళలను పిల్లలు కనే యంత్రాలుగా మార్చేశారు. ఆచారాల పేరిట గడపదాట నివ్వకుండా చేశారు. వారికి విద్యే అనవసరమన్నారు. భర్త మరణిస్తే అతనితో చితిమంటలకు ఆహుతి కావలసిందే నన్నారు. లేదంటే వితంతువులను చేసి వారి ముఖం చూడకూడదని మూలకు నెట్టారు. దీనిని నిరసిస్తూ ఎందరో సంఘ సంస్కర్తలు ముందుకొచ్చారు. ఈ దురాచారాలపై పోరాడారు. ఫలితంగా మహిళలు విద్యావకాశాలు సాధించుకోగలిగారు. జీవించే హక్కునూ పొందారు. అది పూర్తి స్వేచ్ఛ కాకపోవచ్చు. కానీ చదువుకున్నారు. సమాజ ఉత్పత్తిలో భాగస్వాములయ్యారు. అంతరిక్షం లోకీ అడుగుపెట్టారు. అడుగుపెట్టిన ప్రతి చోటా విజయం సాధించారు. తమ సత్తా చాటుతున్నారు. 'మీరు అబలలు.. ఏమీ చేయలేరు' అని అన్నవారి నోళ్లు మూయించారు. తమ వల్ల సాధ్యం కానిదేమీ లేదని నిరూపించారు. ఇదే.. ఖచ్చితంగా ఈ విజయమే మళ్లీ పితృస్వామిక వాదులు, మనువాదుల అసహనానికి కారణ మయింది. ఏదో ఒక ఆచారం పేరిట మహిళలను వంటగదికి పరిమితం చేసే ప్రయత్నం చేస్తున్నారు. ఇదే జరిగాక గుండెలు బాదుకున్నా ప్రయోజనం ఉండదు. ముందుగా మేల్కొంటేనే మహిళల ఉనికికీ, ఈ సమాజ అభ్యున్నతికీ మంచిది. లిఖిత అజాద్ లాంటి అమ్మాయిలు స్వేచ్ఛ వైపు వేస్తున్న అడుగులలో అడుగువేద్దాం.



కథ

# కథలు చెప్పకు!

**గురజాడ శతవర్ధంతి సందర్భంగా గురజాడ స్ఫూర్తితో నిర్వహించిన కథల పోటీలో కన్సొలేషన్ బహుమతి పొందిన కథ**

- బులుసు సరోజిని

మధుర పెదవుల మీద నవ్వు నర్తి స్తోంది. లేత చిగురాకుల కొమ్మల కొన రెమ్మల్లోంచి కోయిల పలికే రాగాల మధ్య సమయాన్ని మనసు తీయగా నర్తిస్తుంటే ఆనందంతో కేరింతలు కొట్టే పసిపాప నవ్వది. ఆ రోజు వేకువనే మెలకువ వచ్చి భర్తా, మరిది, అత్తగార్లకు ఏ మాత్రం నిద్రా భంగం కాకూడదని అడుగులో అడుగువేస్తూ నెమ్మదిగా పెరటివైపు వచ్చి మారే ప్రకృతిని తనివితీరా చూస్తూ చెట్టురాల్చిన ఎండు టాకుల్ని ఓ ప్రక్కగా నెట్టి అగ్గిపుల్ల వెలిగించింది. మంట రాజుకునేలోపు పొగలు పైపైకి సాగుతూ వలయాలుగా ఏర్పడి దాన్లో నుంచి చక్కని ఆకృతులుగా చుట్టు వక్కలకి వ్యాపిస్తున్నాయి. ఆకులన్నీ కాలి బూడిదయ్యే టప్పటికి సూర్యకిరణాలు చెట్ల నీడల సందుల్లోంచి భూమ్మీదకి దూసుకొస్తున్నాయి. పిట్టలు ఇంకా తీయని పాటలు పాడుతూనే వున్నాయి. అక్కడున్న గోడకి ఆనుకుని ఆ ప్రశాంతత వర్ణింప శక్యం కానట్టుగా కళ్ళుమూసుకుంది. ఆ తన్మయత్వాన్ని చెదర గొడుతూ -"ఏయ్!" అనే పిలుపు వినబడి ఉలిక్కిపడింది. పిలుపుతోపాటే వడివడిగా దూసుకొచ్చిన రామక్రిష్ణ నివురుగప్పిన నిప్పు పోగుమీద కాలేసి 'అమ్మా'! అంటూ వెనక్కి లాక్కున్నాడు. "అరరే! కాలేదు కద? 'ఒకింత గాభరాగా ఆత్రుతతో ముందుకి ఓ రెండు అడుగులు వేసిందో లేదో అక్కడే ఆగమన్నట్టు చెయ్యి ముందుకి చాచి ఆపై ఇంకో చేత్తో కాలు పైకి లాక్కుని చూసి ఏం కాలేదని నిర్ధారించుకున్నాక-

"నీకు బుర్రుందా?" అని గట్టిగా అరిచాడు.

"చెత్త పేరుకుపోతోందని తుడిచి"... మధుర రీజన్ చెప్పబోతుంటే 'కథలు చెప్పకు' అన్నాడు కటువుగా మాటలు పూర్తి చెయ్యనివ్వకుండా. కొన్ని నెలలుగా తను అత్తవారింట అడుగు పెట్టిందగ్గర్నుంచీ వింటోందా మాట భర్త నోటనుంచి. ఏం చెప్పబోయినా కథలంటాడు. ఎవరో అంటించిన ఊతపదమేమో అనుకుంది మొదట. కానీ రోజూ పొద్దున్నే తాగే కాఫీలా అలవాటయిపోయిందనీ, అలా అనకుండా ఉండలేడనీ అర్థమయింది. మధుర పెదాల మీద నవ్వు తొంగి చూచి అంతలోనే మాయమవడం కనిపెట్టేసాడు రామక్రృష్ణ. వెక్కిరింతో, వెటకారమో, ఇంకేదో అయి వుంటుందనిపించిదతడికి. అసహనంతో "ఏంటానవ్వు? ఎవడన్నా ఉన్నాడా గోడక వతల? నువ్వు పోరంబోకువైతే నాకేం నష్టం లేదు. కానీ నన్ను చేతకాని వెధవ, వాజమ్మ అంటారే! లోపలికి నడువ్" అన్నాడు దురుసుగా, మంటగా.

గంభీరమైపోయిందామె.

అతడి మాటలు అలాగే వుంటాయి. పదునెక్కువ. అతడి వెనుకే లోపలికొస్తుంటే అన్నాడు.

"మీ బాబు ఫోన్ చేశాడు. నెలలు దాటి సంవత్సరం వచ్చేస్తున్నా వారం క్రితమే పెళ్ళయినట్టు -ఎవ్విరి సండే నిన్ను బీచ్‌కి తీసుకెళ్ళమని సలహా. పైగా విశాఖ బీచ్‌కి 'రామక్రిష్ణా బీచ్' అని నా పేరే పెట్టారని పొగడ్త" వెనక్కి తిరిగి చూసాడు వింటోందా? లేదా? అని చురుక్కుగా చూసిందతనివైపు చురకేసినట్టయి తల ముందుకు తిప్పేసి.

"నాకూ సబబే అనిపించింది. ఎంత తాడుకట్టేసినా పెంపుడు జంతువునైనా సరే తిప్పక తప్పదు. లేకపోతే తాడు తెంచుకు పోతుంది. తిరిగొచ్చాక ఆవో, గేదో అయితే తిరిగి కొయ్యకట్టెయొచ్చుగానీ ఆడదాన్నెలా"? అన్నాడు. గతుక్కుమంది మధుర. ఊహ తెలిసిన తర్వాత పరుషమైన పదజాలానికి, సౌమ్యంగా పలికే విధానానికి తేడా తెలిసాక కఠినమైన మాటల్ని, జలదరించినట్టయి తల గట్టిగా విదిల్చింది. ఆ వెంటనే అతణ్ణి పరికించి చూసింది. అతడి వాగుడుకీ, ఆ వాలకానికీ, ఎగశ్వాసకీ ఆపుకోలేనంత నవ్వొచ్చేస్తోందామెకి.

కొద్దిసేపటి తర్వాత టిఫిను తింటూ అన్నాడు రామక్రిష్ణ. "మీ నాన్న అన్నీ ప్రామిస్‌లు చేసేస్తాడు. అదిస్తా, ఇదిస్తా అని నేనే అడిగినట్టు పిట్టకథలు చెప్తాడు. నా సంపాదన, ఉన్న పొలం చాలవా నాకు? నిన్ను నేను బాగా చూసుకోవాలనే తాపత్రయం కూడా ఉండడం సహజమే. నేనర్థం చేసుకోగల్ను. . ఓ... కనపడిందగ్గ ర్నుంచి అతి మర్యాదలు చేసేస్తూ వుంటాడు. పోన్లే... దర్జాగానే వుంది కదా అని మాట కలుపుతూ 'ఇది బావుంది కదా మామగారూ' అని దేన్నైనా చూపిస్తే 'మనం కొనుక్కుందాం' అంటాడు. పోనీ కొంటాడా అంటే పైసా తియ్యడు. ఏం మాట్టాడనీ, కథ మొదలెట్టేస్తాడు. 'బాబూ! ఒక్కగానొక్క ఆడపిల్ల గారాబంగా పెంచాను. ఇక మీ ఇష్టం అంటాడు. మాటి మాటికీ మాకు అక్కడో ఎకరం భూముందీ, ఆ మూలెక్కడో ఓ ఇల్లుంది అని పూటపూటకో కథ సాగతీసి మరీ చెప్తాడు. విన్న కథ అయినా పోన్లే పెద్దవాడని గౌరవం కొద్దీ వింటామా? ఇంకంతే బుక్ అయిపోయినట్టే. మరో కథ మొదలెట్టేస్తాడు. పేకబెత్తం ఎప్పుడు ఝళిపిస్తాడో తెలియని మాష్టారు దగ్గర నోరెత్తలేని పిల్లాడిలా భయంభయంగా నించోలేను నేనింక కథలన్నీ కట్టిపెట్టి అసలు విషయంలోకి ఎప్పుడొస్తాడా? అని ఎదురు చూపులు చూడలేను నేను. ఎప్పుడో ఆయన పోయాక నీకు చెందే ఆస్తికోసం ఇప్పటినుంచీ చేతులు కట్టుకుని కూర్చొని ఆ కథలు విన్లేను నేను" అన్నాడు. కిసిక్కిన నవ్వింది అత్తగారు సుందరలక్ష్మి. కొడుకేం మాట్లాడినా ప్రతీది హాస్యమే ఆవిడకి. ఆవిడ నవ్వడమే తరువాయి ఆకాశం నుంచి పూల వర్షం ఉత్తుత్తినే కురిసినట్టు- తన గదిలో కూర్చుని

తాను పనిచేసే కంపెనీకి తనే హెడ్డు కాబట్టి, మొట్టమొదటి ఇంటర్వ్యూలోనే తానా ఛాన్స్ కొట్టేశాడు గనుక తనెంతో గొప్పవాడిననే ఫీల్ రామక్రిష్ణకి. రూపం కాస్త ఆకర్షణీయంగా ఉండడంతోపాటు మాంచి డ్రస్‌సెన్స్ వుందని అందరూ మెచ్చుకుంటుంటే అందలం ఎక్కి కూర్చునట్టుగా ఉంటుందతడికి. ఇంట్లో సభ్యులు, పనిమనిషి, కంపెనీలో సబార్డినేంట్స్ తాను పరిపాలించే ప్రజల్లా, కుక్కిన పేనుల్లా కన్పిస్తారు.

బుద్ధిగా చదువుకుంటున్నట్లు కనపడే ఇంజనీరింగ్ వెలగబెడుతున్న రామక్రిష్ణ తమ్ముడు సర్రున హాల్లోకొచ్చేస్తాడు. చదువుకి ఎగనామం పెట్టే ఏ కొద్దిపాటి టైమూ వదులుకోడతడు. అలాంటప్పుడే రామక్రిష్ణ ఇంకా గంగవెర్రులెత్తిపోతాడు. తమ్ముడ్ని 'చదువుకోరా' అని తెగ విసుక్కుంటాడు. బట్టీ కొట్టడం, మాంచి ఉద్యోగం సంపాదించడం కోసమే చదువని రామక్రిష్ణ ఘంటాపథంగా చెప్తాడు తమ్ముడికి.

"కాస్సేపు ఉండనీరా! నే ఊరుకుంటానేంటి చదవప్పోతే" అని వత్తాసు పలికింది సుందరలక్ష్మి ఎప్పటిలాగే. ఆకలేస్తుంది కాబట్టి వండుకు తినడం, నిద్రొస్తుంది కాబట్టి నిద్రోవడం, సంపాదన కోసమే చదువు... ఇలాంటివే తెలుసావిడకి. పెద్దకొడుకు ప్రైం మినిష్టర్‌లా కనపడతావిడ కళ్ళకి.

తాను పనిచేసే కంపెనీకి తనే హెడ్డు కాబట్టి, మొట్టమొదటి ఇంటర్వ్యూలోనే తానా ఛాన్స్ కొట్టేశాడు గనుక తనెంతో గొప్పవాడిననే ఫీల్ రామక్రిష్ణకి. రూపం కాస్త ఆకర్షణీయంగా ఉండడంతోపాటు మాంచి డ్రస్‌సెన్స్ వుందని అందరూ మెచ్చుకుంటుంటే అందలం ఎక్కి కూర్చునట్టుగా ఉంటుందతడికి. ఇంట్లో సభ్యులు, పనిమనిషి, కంపెనీలో సబార్డినేంట్స్ తాను పరిపాలించే ప్రజల్లా, కుక్కిన పేనుల్లా కన్పిస్తారు. సుందరలక్ష్మి పదేపదే 'నీకేంరా! మహారాజువి' అంటుండడంతో ఒక్కోసారి భుజకీర్తులు పెరిగి పెరిగి వీరావేశం వచ్చేస్తుంటుందతడికి.

మానవత్వానికి సన్నిహితంగా రావాలంటే రామక్రిష్ణకి జీవితకాలం పట్టొచ్చు. రాత్రంతా ఇవే ఆలోచనలతో, అలజడులతో సతమతమవుతూ ఎప్పటికో నిద్ర పట్టిన మధుర ఆ శనివారం ఎనిమిదిన్నర దాటితేగానీ లేవలేకపోయింది. అప్పటిదాకా గది బయటే కాచుక్కూర్చుని హాలుహాలంతా కాలుగాలిన పిల్లిలా తిరిగాడు రామక్రిష్ణ. రూంలోంచి బయటికి వచ్చిన మధురని చూడగానే గబగబా దగ్గరకొచ్చి "బారెడు పొద్దెక్కాక మేల్కొన్న యువరాణీ వారికి జయము. జయము సుప్రభాతం" అన్నాడు. భళ్ళున నవ్వింది సుందరలక్ష్మి . చటుక్కున వచ్చేసాడు మరిది.

"మా కంపెనీకి శనివారం శలవులేదండీ" అన్నాడు వ్యంగ్యంగా. ఓ క్షణం గాప్ ఇచ్చి మళ్ళీ అందుకున్నాడు.

"ఏంటన్నాడు మీ నాన్న పెళ్ళి చూపుల్నాడు? మాసిట్టి తల్లి పొద్దుగల్లే లేచి అన్ని పన్లూ చకచకా చేసేసి, నువ్వాఫీసుకెళ్ళే టైముకి కళకళ్ళాడుతూ, పెళపెళ్ళాడే పట్టుచీర కట్టేసుకుని, ముసి ముసి నవ్వుల్తో నీకు లంచ్ బాక్స్ అందిస్తుందని అందరూ అవాక్కయే సూపర్ డూపర్ కథ చెప్పలే మీ నాన్న?" అంత పెద్ద ఆఫీసరూ చేతులు వరవరా తిప్పేసుకుంటూ లొడలొడా వాగేస్తుంటే నిద్రమత్తు వదలని మధుర బిత్తర పోయి చూసింది. నిముషం తర్వాత తెప్పరిల్లి గబగబా వాష్‌రూం వైపు నడిచింది.

.....

మరో రెండు నెలలు గడిచాయి. రామక్రిష్ణ మాటలు కోటదాటిపోయేంత తీవ్రత, వ్యంగ్యార్థాలు దాటి శాపనార్థాలదాకా వచ్చాయి. తొందరపడకూడదనే భావనతో ఊపిరి బిగపెట్టుకు బతుకుతోంది మధుర. ఆ సాయంత్రం ఇంక తాళలేక చనిపోయిన తల్లి పదే పదే గుర్తొచ్చి ఎవ్వరూ లేనప్పుడు ఫోన్ చేసింది తండ్రికి.

"బాగున్నావా తల్లీ?" అన్నాడు తండ్రి ఆప్యాయంగా. "నాన్నా" పిలిచింది గాద్గదికంగా. ఇద్దరికీ మాటలు పెగల్లేదు. నిజానికి మనిషికి హృదయాన్నుంచి వచ్చే చిన్న పలకరింపు చాలు. కాసేపటి నిశ్శబ్దం తర్వాత–

'తెలుసు నాకు నీ బాధలేవీ చెప్పవని కానీ తల్లీ రేపు రాకపోతుందా? పరిస్థితులన్నీ చక్కబడకపోతాయా?' అన్నాడు. చిన్నగా నవ్విన ధ్వని అతడి చెవులని తాకి కళ్ళు మూత పడి పెదవులు బిగపట్టేలా చేసి "నాన్నా! అమ్మ కోసం" నేను పరితపిస్తుంటే నా దు:ఖం చూడలేక ఆనందమనేది రేపులో వుండదని, ఈ క్షణాల్లోనే వుంటుందని నమ్మబలికే వాడివి. నీ ఓదార్పుతో, నీ భరోసాతో నేను హాయిగా వుండేదాన్ని. అమ్మయినా, నాన్నయినా నువ్వేనని! ఇప్పుడు... నువ్వు సర్దుబాటు చేసుకోమని చెప్తున్నావ్ కదూ?" అంది.

"అబ్బెబ్బె! మా మధుర బంగారు తల్లి. పెళ్ళంటే నూరేళ్ళపంట అనీ, ఓర్పు కాస్తంతే పట్టాలని కదా చెప్తున్నది? "అన్నాడాయన "ఆరోగ్యం జాగ్రత్త నాన్నా" అని ఫోన్ పెట్టేసి నిట్టూర్చింది.

"ఎవరికి ఫోను?" రామక్రిష్ణ గొంతు వినిపించింది. ఎప్పుడొచ్చాడో? "నాన్నకి" అంది.

"నాకు ఒళ్ళంతా కళ్ళే. కథలు నడపకు. ఇట్టే పట్టేస్తాను. సరే సరే మాంచి కాఫీ పట్రా. ఇలావెళ్ళి అలా రావాలి" అన్నాడు రిలాక్స్‌డ్‌గా కూర్చుంటూ. వంటింటి వైపు వచ్చిన ఆమెతో ఆలోచనలు కూడా తోడొచ్చి పెళ్ళయిన కొత్త రోజుల్లోకి లాక్కెళ్ళాయ్!

కంప్యూటర్స్‌లో మాస్టర్స్ చేసిన తన ఆరుగురు స్నేహితులూ, తనూ తమ పల్లె చదువు పూర్తయ్యాక పై చదువులకి పట్నం వచ్చి హాస్టల్స్‌లో వుండి చదువుకున్నవాళ్ళే. పెళ్ళయిన నాలుగురోజులకి తమ ఫోటో ఆల్బమ్ సరదాగా తీసి భర్తకి చూపిస్తే మధురకి ఎడం పక్కనించున్న అబ్బాయి గురించి ఆరా తీసాడు.

"వీడా? వీడు చంద్రహాస్!" అంది సరదాగా.

"చాలా అల్లరివాడు. మా పాలేరు కొడుకని గిట్టని వాళ్ళంటారు. గానీ ఆ తేడాలు లేవు నాన్నకి " అంది.

"పెళ్ళికి రాలేనట్టుంది" అన్నాడు.

"కాంపస్ సెలక్షన్స్‌లో లక్ తగిలి మంచి ఉద్యోగం వచ్చి వెంటనే ఆర్నెల్ల ట్రయినింగ్‌కి హైద్రాబాద్ వెళ్ళాడు. పూర్తి అవగానే మనింటికి వచ్చి మనల్ని చూసే వెళ్తానన్నాడు. ఈ లోపల వాళ్ళ తాతకి జబ్బు చేసి హాస్పిటళ్ళ చుట్టూ తిరుగుతున్నాడు" అంది.

"వచ్చి పోతూండమను నీ ఫ్రెండ్స్‌ని. మిగతా అందరి గురించి కూడా చెప్పు మరి!" అన్నాడు.

'ష్యూర్!!' అంది ఉత్సాహంగా. తమ స్నేహం, చిన్ననాటి అల్లర్ల దగ్గర్నుంచి చదువయి విడిపోయే ముందు ఎవరికి ఏ కష్టం వచ్చినా ఒకర్నొకరు ఆదుకోవాలని చేసుకున్న ప్రమాణాల దాకా చెప్పింది ఆప కుండా ఆమె కళ్ళల్లో తళ తళ చెప్తున్నప్పుడు.

"అయ్యబాబోయ్! కదిపితే కథలు చెప్తున్నావు" అన్నాడు తమాషాగా; "అరె! కథలు కావు నిజం. మేం ఒకరికొకరు తోడు. మాట తప్పని జట్టు మాది" అంది.

'ఓహో!' అన్నాడు. ఆ తర్వాత తర్వాత ఏం మాట్లాడినా "నువ్వు కథలు రాయి పైకొస్తావ్" అనే వాడు. అవే మాటల్ని అట్నుంచి ఇటూ, ఇట్నుంచి అటూ మారుస్తూ అంటుంటే వినీవిని చివరికి మూగబోయింది మధుర.

.......

ఆదివారం రామక్రిష్ణా బీచ్! అలల నురుగులాంటి చీరలో మెరిసిపోతోంది మధుర. ఆమె మెడ పొడవుగా చూడ ముచ్చటగా వుంది. ఎంత వద్దనుకున్నా దొంగ చూపుల్తో ఆమెనే చూస్తున్నాడు రామక్రిష్ణ. అక్కడున్న సిమెంటు గట్టు మీద కూర్చుని అరగంట దాటింది. ఒక్కమాట కూడా మాట్లాడకుండా ముభావంగా కూర్చుంటే పలకరిద్దామని అతడి చేతిమీద తన సున్నితమైన చేతిని సుతారంగా వేసింది. వెంటనే తన చేతిని వెనక్కి లాగేసుకున్నాడు రామక్రిష్ణ. దానిక్కారణం అంత క్రితమే ఇంటినుంచి బయల్దేరే ముందు చంద్రహాస్ ఆ వూరు వచ్చానని త్వరలో కలుస్తానని ఫోన్ చేయడమే'. మరీ బింకంగా వుండలేక ఆమెవైపు తల తిప్పాడోసారి. అల్లరిగా నవ్వింది మధుర. "మురీ మిక్చర్స్ తింటావా?" అడిగాడు. వాళ్ళకి కొద్ది దూరంలో తిష్ఠేసుకుని కూర్చున్న మురీ బండివాడు కొంటే గానీ కదిలేట్టు లేడు మరి! హుషారుగా తలూపింది,

"చెత్త తిళ్ళు!" అన్నాడు పొట్లాం అందిస్తూ. నవ్వింది మధుర. ఆ నవ్వు మల్లె పూవు. కాసేపటికి ఐస్‌క్రీం వాడొస్తే ఐస్‌క్రీమ్ కొని పెట్టాడు. తినబోతూ "ఆ చంద్రహాస్ గాడు నీకు ఒట్టి ఫ్రెండేనా?" అడిగాడు అసహనంగా. మళ్ళీ నవ్వింది మధుర. తేనెలొలికే నవ్వు.

"నీ ఫ్రెండ్స్ పేర్లేమిటన్నావ్"? మాట మార్చాడు.

"మధు, శ్రీధర్, చంద్రహాస్, సుమ, నళినీ, కామేశ్వరి మేమంతా క్లోజ్ ఫ్రెండ్స్

"క్లోజ్ అంటే"?

"చెప్పానుగా? మాలో ఎవరికి ఏ కష్టాలొచ్చినా మిగతావాళ్ళు ఆదుకొనేంత" అంది వెనిల్లా సుతారంగా చప్పరిస్తూ. తిక్కెక్కిపోతోందతడికి భర్త వేసే ప్రశ్నల్ని అతి తేలిగ్గా తీసుకుని హాయిగా ఆన్సర్లు చెప్తుంటే. అందుకే కసిగా అన్నాడు.

"ఇలా కనిపించిదల్లా మెక్కడం అలవాటయితే దిబ్బకొక్కులా తయారై ఇంటి చాకిరీ ఏం చేస్తావ్? ఆడది తిరిగి చెడింది, మగాడు తిరక్క చెడ్డాడుట. మగాళ్ళతో స్నేహాలేంటి నీకు? భ్రమల్లో బతుక్కు!" అన్నాడు. నో ఆన్సర్

"నీకే చెప్తుంట! ఆ 'చంద్రహాస్' గాడు రెక్కల గుర్రం మీదొచ్చి చుక్కల లోకం చూపిస్తాడనీ, నీ కష్టాలు తీర్చేస్తాడని ఎన్నడూ అనుకోకు!"అన్నాడు కచ్చగా "వస్తాడు" అంది ధృడంగా, శివమెత్తిపోయాడు రామక్రిష్ణ.

"పిలవ్వే! పిలువ్! రాదని ఛాలెంజ్ చేస్తాను" అన్నాడు చిటికేస్తూ. హ్యాండ్‌బాగ్ జిప్ సర్రున లాగి మొబైల్ తీసి కొన్ని నెంబర్లు ప్రెస్ చేసింది. "దీనికెంత ధైర్యం?" గట్టిగానే అని పళ్ళు పటపట లాడించాడు.

**ఎప్పుడో ఒకప్పుడు ఎవరో ఒకరు 'చెక్' చెప్పే తీరాలి. ఆగాగు. ఇప్పుడు నువ్వేం 'కథలు చెప్పకు'. ఆ ఛాన్స్ నీ కింక లేదు అంది.నీ సాధింపు చర్యలకి నీకో బహుమానం ఇప్పుడివ్వకపోతే రానున్న కాలంలో కూడా మారవు" అంది. మరుక్షణంలో చేష్టలుడిగి చూస్తున్న రామక్రిష్ణ దవడ ఫెళ్ళుమంటూ పేలిపోయింది.**

"తన కోపమె తన శత్రువు" అంది మధుర

"నోర్ముయ్! అరిచాడు. ఆమె ఆలోచనలు వాతావరణం ఉధృతంగా ఉన్నప్పుడు సముద్రం రేపే అలల్లా ఎగిసిపడుతున్నాయి. పది నిమిషాలు నిశ్శబ్ధంగా గడిచాయి. ఓ మోటార్ సైకిల్ శబ్ధం చేస్తూ వాళ్ళ ముందుకొచ్చి ఆగింది. మధుర లేచి బైక్ దగ్గరకెళ్ళి గిర్రున వెనక్కి తిరిగి రామక్రిష్ణని సమీపించి స్పష్టంగా అతడికి వినిపించేలా అంది."సంసారం అంటే ప్రగాఢమైన లోలోతుల్నించి ప్రేమని పంచడం. అప్పుడు అహం చెల్లాచెదురై ఆలుమగలు ఒక్కటవుతారు. నీలో ఆడదాన్ని చులకనగా చూడడమనే పొగరు అంచెలంచెలుగా ఎప్పట్నించో ట్రాన్స్ఫర్ అవుతూ వస్తోంది. ఎప్పుడో ఒకప్పుడు ఎవరో ఒకరు 'చెక్' చెప్పే తీరాలి. ఆగాగు. ఇప్పుడు నువ్వేం 'కథలు చెప్పకు'. ఆ ఛాన్స్ నీ కింక లేదు అంది.నీ సాధింపు చర్యలకి నీకో బహుమానం ఇప్పుడివ్వకపోతే రానున్న కాలంలో కూడా మారవు'' అంది. మరుక్షణంలో చేష్టలుడిగి చూస్తున్న రామక్రిష్ణ దవడ ఫెళ్ళుమంటూ పేలిపోయింది. నోటమాట రాకుండా కళ్ళప్పగించి చూస్తున్న అతడిని చూస్తూ ఈసారి మళ్ళీ నవ్వింది మధుర. ఆ నవ్వు గెలుపుది. ధీరత్వానిది. రుద్రానిది. రాబోయే ప్రగతిది. మోటార్ సైకిల్ ఊపందుకుంది. కళ్ళు బైర్లు కమ్మి ప్రపంచం తల్లక్రిందులవుతున్నట్లనిపిస్తున్న రామక్రిష్ణకి దూరంగా సాగిపోతూ కన్పిస్తోంది స్వేచ్ఛగా రెపరెపలాడుతూ ఎగురుతున్న మధుర కొంగు.



మణిపూసలు

# లలిత గీతాల రస ఝరి - రావు బాల సరస్వతీదేవి

## - వకుళాభరణం లలిత

"ఆ తోటలో నొకటి ఆరాధనాలయము
ఆ ఆలయములోని అందగాడెవరే,
అందగాడెవరే, అందగాడెవరే"!

ఈ పాట వినని తెలుగువారుండరు. త్యాగరాయ గానసభలోగాని, సుందరయ్య విజ్ఞాన కేంద్రంలో గాని, మరెక్కడైనా చలంగారి సభ జరిగితే ఆ సమావేశానికి ముందు ఈ పాట ఉండి తీరాలి. కొప్పరపు సుబ్బారావు గారు గుంటూరులో 'హిస్టరీ మాస్టర్ వాయిస్' ఆఫీసులో నాటకాల సెట్లు అవీ రికార్డు చేయించేవారు. ఒకసారి రావు బాల సరస్వతిని పిలిపించి భక్త కుచేల, భక్త ప్రహ్లాద సెట్లలో పాడించారు. ఆనాటికి ఆమె రావు బాలసరస్వతి కాలేదు. ఈమె పాటల రికార్డు విన్న సి.పుల్లయ్యగారు "సతీ అనసూయ"లో గంగ వేషం వేయించారు. కె.సుబ్రహ్మణ్యం గారు భక్త కుచేలకు బుక్ చేసుకొని చిన్న కృష్ణుడి వేషం వేయించారు. అపుడే ఆమె పేరుకు "బాల" అనేది ఏర్పడింది. ఆనాటి నుంచీ ఆమె బాల సరస్వతి. వివాహానంతరం భర్తగారింటి పేరయిన రావు వచ్చి చేరింది. అప్పటినుండి రావు బాల సరస్వతి అయింది.

ఆమె కంఠం విని కోలంక రాజా వారు ఆమెను వివాహం చేసుకొన్నాడు. ఆ తర్వాత కొద్ది రోజులు మాత్రమే పాటలు పాడింది. చిన్నప్పుడు "బిల్హణ, జ్యోతి మల్హార్" అనే తమిళ చిత్రాల్లోను, "చంద్రహాస" అనే కన్నడ చిత్రంలోను "రాధికా, సువర్ణమాల" అనే తెలుగు చిత్రాల్లోను నటించింది. భాగ్యలక్ష్మి అనే చిత్రంలో 'తిన్నె మీది చిన్నోడా' అనే పాట పాడింది. ఎన్ని చిత్రాల్లో నటించినా తనకు పాట పాడాలనే కోరిక ఎక్కువగా ఉండేది. భానుమతి సొంత పిక్చరైన 'లైలా-మజ్ను', 'ప్రేమ, 'కాదల్' అనే తమిళ లైలా-మజ్ను అన్నింట్లో కనీసం ఒక్క పాటైనా పాడేది. చిట్టచివరగా ప్రసాద్ తీసిన తమిళ చిత్రంలోను, విజయనిర్మల తీసిన 'సంఘం చెక్కిన శిల్పాలు' చిత్రంలోను ఆమె పాటలు పాడారు.

బాల సరస్వతికి వీణ వాయించడం కూడా వచ్చు. పిచ్చుమణి దగ్గర, ఆలత్తూరు సుబ్బరామయ్య దగ్గర గాత్రం నేర్చుకున్నారు. రాజేశ్వరరావుతో కలిసి "కలగంటి" పాట పాడటం, రాజేశ్వరరావుతో కలిసి ఆమె పాడిన పాటలు, యుగళ గీతాలు, సోలో గీతాలు అన్నీ ప్రత్యేకమైనవే. దు:ఖపూరితమైన పాటలు కూడా ఆమె పాడారు. "ఏట పగాయె", "తానే మారినా" లాంటి పాటలు పాడారు. తర్వాత జీవితంలో అటువంటి విషాద భూయిష్టమైన పాటలు పాడటానికి ఆమె అంగీకరించలేదు. "వెన్నెలలా వేళనే వేణువూదేనా, వేణు వూచిన వేళ వెన్నెలాయెనే" అనే కొత్త పల్లవి చేర్చి పాడటం ఆమెకే చెల్లు. ఆ రకంగా ఎన్నో పాటలు ముఖ్యంగా సంగీత ప్రియుల్ని ఆకర్షించిన పాటలు. ఎంతోమంది యువతీయువకులను గాయనీ గాయకులుగా తయారుచేసిన పాటలు. ఇంత గొప్ప పాటల్ని మృదుమధుర గాత్రంతో ఆలపించి వాటిని అజరామరం చేసిన గాంధర్వ గాయని శ్రీమతి రావు బాల సరస్వతీ దేవియే. వినేకొద్దీ ఆ స్వరంలో ఆ గానంలో కొత్త అందాలు స్ఫురిస్తాయి. రాజేశ్వర రావు పాట ఎప్పటికప్పుడు మనసుకు హాయినిచ్చే తీయని శ్రావ్య సంగీతంగా ఉండేదో, బాల సరస్వతి సంగీతం కూడా అదే విధంగా ఉండేది.

"మాధవా! అపరాధమా!
నీ రాధను నీవే క్షమించు"



అని బాల సరస్వతీదేవి పాడుతుంటే మనసులో మాధుర్యం తొణికసలాడుతుంది. రాజేశ్వరరావుతో కలిసి బాలసరస్వతి పాడుతుంటే బృందావనిలో వేణుగానం పొంచి వినే గోపిక లాగా అందరూ వింటుండేవారు. అట్లే "గోపాల కృష్ణుడు నల్లన", "బంగారు పాపాయి", ఇత్యాది పాటలను సంగీత ప్రియులు కంఠోపాఠం చేసిన రోజులవి. వారిద్దరి పాటలు ఇంట్లో ఉంటే ఓ సోషల్ స్టేటస్‌గా భావించేవారు. వారిద్దరూ పాడిన యుగళ గీతాలు అమరత్వాన్ని పొదుపుకొన్న మాధుర్యపు మాటలు. సాధారణంగా ఎప్పుడో గానం చేసిన పాటల్ని మరచిపోతుంటారు. కానీ, బాలసరస్వతి పాడిన పాటలు తరాల అంతరాలు లేకుండా ప్రతి ఒక్కరూ ఆమె పాడిన ఏదో ఒక పాట పల్లవినైనా గుర్తు చేసుకొంటారు. అదే బాలసరస్వతి ఘనత. ఆమె పాటలకు పరవశించని తెలుగువారు

**బాల సరస్వతికి వీణ వాయించడం కూడా వచ్చు. పిచ్చుమణి దగ్గర, ఆలత్తూరు సుబ్బరామయ్య దగ్గర గాత్రం నేర్చుకున్నారు. రాజేశ్వరరావుతో కలిసి "కలగంటి" పాట పాడటం, రాజేశ్వరరావుతో కలిసి ఆమె పాడిన పాటలు, యుగళ గీతాలు, సోలో గీతాలు అన్నీ ప్రత్యేకమైనవే. దు:ఖపూరితమైన పాటలు కూడా ఆమె పాడారు. "ఏట పగాయె", "తానే మారినా" లాంటి పాటలు పాడారు. తర్వాత జీవితంలో అటువంటి విషాద భూయిష్టమైన పాటలు పాడటానికి ఆమె అంగీకరించలేదు. "వెన్నెలలా వేళనే వేణువూదేనా, వేణు వూచిన వేళ వెన్నెలాయెనే" అనే కొత్త పల్లవి చేర్చి పాడటం ఆమెకే చెల్లు. ఆ రకంగా ఎన్నో పాటలు ముఖ్యంగా సంగీత ప్రియుల్ని ఆకర్షించిన పాటలు.**

లేరు. మాధుర్య ధోరణిని తన గొంతులో పలికించి ఒక వినూత్న శైలిని గాత్రంలో పలికించారు బాలసరస్వతి గారు. దాశరథి వ్రాసిన 'నిండు పున్నమి పండు వెన్నెల'లో గీతాన్ని మంగళంపల్లి బాల మురళీ కృష్ణ స్వరపరచి ఆకాశవాణి కేంద్రంలో చెన్నైలో పాడించారు. ఆ పాట ఆమె వెన్న ముద్ద తిన్నంత మెత్తగా పాడారని ఆయన మెచ్చుకున్నారు. ఏ పాట పాడినా, ఏ శైలిలో స్వరాన్ని ఆలపించినా, దానికి బాల సరస్వతిగారి ముద్ర ఉండనే ఉంటుంది. ఆమె మాత్రమే పాడగలిగిన పాటలు అని ఘంటాపదంగా చెప్పవచ్చు. స్వప్నసుందరిలో ఘంటసాలతో కలిసి ఆమె పాడిన పాట మనసులను కరిగించి వేసింది. శ్రోతలచే కన్నీళ్ళు కురిపింపచేశాయి. ఆమె పాటల్లో, ఆమె స్వరంలో ఎన్నో భావగీతికలు నర్తిస్తుంటాయి. ఆమెది నిజానికి కిన్నెర గాత్రం. ఇంతవరకు అలాంటి పాటలు ఎవరూ పాడలేదేమో అనిపిస్తుంది. ఘంటసాలతో కలిసి బాల సరస్వతి పాడిన అరుదైన యుగళ గీతం- 'మదిలోని మధుర భావం'. ఆమె పాడిన పాటను పరవశించి ప్రజలు వింటూనే ఉన్నారు. ఎన్నేళ్ళు పాడినా, తన స్వర మాధుర్యపు తీరే వేరు. మా గోపి- చిత్రంలో "ఓ ముద్దు పాపా, నా ముద్దు గోపీ" అని ముద్దు ముద్దుగా పాడి శ్రోతల్ని ఆనందాల అంచుల దాకా తీసుకొని పోయారు. 'మంచి మనసుకు మంచి రోజులు' చిత్రంలో బాల సరస్వతీ దేవి పాడిన "ధరణికి గిరి భారమా!" అనే పాట వీనుల విందు కలిగించే గీతం.

బాల సరస్వతి పాడిన పాటలు తెలుగు వారు ఏనాటికీ మరువలేరు. ఇప్పటికి కూడా ఆమె కంఠంలో మార్పు రాలేదు. ఆమె పాట వినటం తెలుగు ప్రజానీకానికి ఒక దివ్యానుభూతి. ఆమె గాత్రం మరపురానిది. ఇన్నేళ్ళు దాటిని ఆమె కంఠంలో కనిపించే నిండుతనం, ఆ గాంభీర్యం వీటిల్లో మార్పు లేదు. 'తుమ్మెదా! ఒకసారి మోమెత్తి చూడమని చెప్పవే నా మాట రాచిలుక తోడ' - అన్న గీతం కాని 'కలగంటి, కలగంటి'- అన్న గీతం విన్నప్పుడు మనం పూర్తిగా తాదాత్మ్యం చెందటం సహజమే. ఆమె పాటలు రసోజ్వలమైన భావ వీచిలకు. తీయ తేనియలు కురిపించే రావు బాల సరస్వతీ దేవి పాటలు వింటుంటే మనసు పాత జ్ఞాపకాలతో పరవళ్ళు తొక్కుతుంది. జిక్కిలాంటి గాయనీమణులకు కూడా రావు బాల సరస్వతి, టంగుటూరి సూర్యకుమారి గారలే స్ఫూర్తి ప్రదాతలు. ఎంతోమందికి ఆమె ఆరాధ్య గాయని. ఆమె మా కుటుంబంతో ఎంతో సన్నిహితంగా ఉన్నారంటే మాకు గర్వకారణం. ఆమె గాత్రం అజరామరం. ఈ నాటికీ ఆమె నిండు పున్నమి పండు వెన్నెల. "సంతోషమే లేని నా జన్మకికి సంగీతమేలనే" నిజానికి ఆమె ఊపిరి సంగీతం. ఆమె ఉచ్ఛ్వాస నిస్వాశాలు సంగీతమే.

* * *

# జీవం-కులం-మరణం

అమ్మ ఇచ్చింది జీవం
రాజకీయనేతలు కనిపెట్టింది కులం
ఆ కులం వలలో పడి చివరకు మిగిలేది మరణం
మరణం నుంచి జీవనానికి
రాజకీయంతో, కులంతో
మనిషి చేస్తున్నాడు సమరం
మనిషి జీవనానికి, కులానికి లేదు సంబంధం
కాళ్ళ కింద భూమిని, భూమిలోని గనులను
కనిపించని గాలిని, కనిపించే నీటిని
తాకట్టు పెట్టి, డబ్బులు తెస్తే
అందులోని చిల్లర, అక్కడక్కడ రాల్చే నాయకులను
దేవుళ్ళని కొలిచే అనామకులు
కుల భేదాన్ని వెలుగులోకి తెస్తున్నారు
వేముల వారి వంశస్థుడైన నీవు
నీ కన్నతల్లి నీ కోసం
పైసా పైసా పొదుపు చేసి
పై చదువులకు నిన్ను పంపితే
కులం పేరుతో నిన్ను దూషించారని
ఎవ్వరితో మాట్లాడకుండా వేరుచేసారని
అవమానాన్ని తట్టుకోలేక
ఆత్మహత్య చేసుకున్నావు
కనీసం ఒక్కసారి నీ కన్నతల్లి
గురించి ఆలోచించలేక పోయావు.
జీవితం గురించి ఆలోచించక
అవమానాన్ని తట్టుకోలేక
కులం పేరుతో చులకనగా చూసారని
మరణం దగ్గరకు వెళ్ళావు
జీవనానికి కావాలి జనం
కులం అనే ఆలోచనకు కావాలి మనస్సు
దాన్ని పూర్తిగా బహిష్కరించడానికి
కావాలి ప్రజల ఐకమత్యం, మేధస్సు
"మంచితనానికి మించిన పూజలేదు
మానవత్వానికి మించిన మతం లేదు.
ఈ సంఘటనతో అయినా మనం
మనిషికి కావల్సింది మనస్సు కాని,
కులం కాదని అర్థం చేసుకొని
అందరం కుల, మత బేధాలు లేకుండా
అక్క చెల్లెల్లా, అన్నదమ్ముల్లా
కలిసి ఉండాలని, ఇకపై ఇలాంటి
ఘటనలు జరగకుండా చూసుకోవాలని
కోరుకుంటూ,
ఈ సహోదరి చిన్న విజ్ఞప్తి.

ఎ.సౌమ్య
రైల్వే ఉన్నత పాఠశాల
విజయవాడ.

# రోహిత్ వేముల చివరి వుత్తరం

**నేను మొట్టమొదటి సారిగా ఇలాంటి వుత్తరం రాస్తున్నాను. ఇదే నా చివరి లేఖ కూడా. మీకు అర్థం అయ్యేలా చెప్పలేకపోయి ఉంటే నన్ను మన్నించండి. ఈ అసమాన సమాజంలో నా పుట్టుకయే ఒక పెద్ద దుర్ఘటన. ఏరకంగానూ ప్రోత్సహించబడని నా బాల్యం నా వెన్నంటే ఉంది. నా చిన్ననాటి ఒంటరితనం నుండి నేనెప్పటికీ తేరుకోలేకపోయాను. ప్రేమ, బాధ, కష్టం, జీవితం, మరణం ఇంకా ఈ సమాజాన్ని అర్థం చేసుకోవడంలో నేనెప్పుడూ ఫెయిల్ అయ్యానేమో. ఎప్పుడూ దేనికీ తొందర లేకున్నా వీటన్నిటికీ దూరంగా ఒక కొత్త జీవితం ప్రారంభించాలని చాలా ఆశ పడ్డాను. కానీ కొందరికి జీవితమే ఒక శాపం.**



**గుడ్ మార్నింగ్,**

మీరు ఈ వుత్తరం చదివేసరికి నేను బ్రతికి ఉండను. నాకు తెలుసు మీలో చాలా మంది నన్ను ఎంతో ప్రేమగా చూసుకున్నారు. నాకు అన్ని రకాలుగా సహకారం అందించారు. నేను చేసిన పనికి నా పై కోప్పడకండి.

ఈ సమయంలో నేను ఎవర్నీ విమర్శించడంలేదు. మానసికంగా నాతోనే నాకు ఎన్నో విభేదాలున్నాయి. నా మనసుకి నేనే భౌతికంగా దూరమవుతున్నానేమో అనిపిస్తుంది. నేనొక క్రూరుడిగా మారానని పిస్తుంది. కార్ల్‌సాగన్ లా నేనొక రచయితను కావాలనుకున్నాను. సైన్స్ గురించి రాయాలనుకున్నాను. నేను ఎప్పుడూ సైన్స్, నక్షత్రాలు మరియు ప్రకృతిని ప్రేమించాను. కానీ వాటి కన్నా ఎక్కువగా మనుషుల్ని ప్రేమించాను. ఎవర్నైతే నేను ప్రేమించానో వారు ఆ ప్రకృతి కే దూరం అయ్యారు. వారికే తెలియకుండా మన మనోభావాలు కూడా కులషితం అయ్యాయి. మన ప్రేమలు కల్పితం అయ్యాయి. మన నమ్మకాలు కూడా బలహీనం అయ్యాయి అనిపిస్తుంది. మన నైజాలు కూడా కృత్రిమమైనవే. నిజాయితీగా ప్రేమించడం కూడా కష్టం అయిపోతుంది.

మనిషికి ఇచ్చే విలువ అతని పుట్టుకతో వచ్చిన గుర్తింపుకు దిగజారిపోయింది. ఆ గుర్తింపు ఒక ఓటు స్థాయికి లేదా ఒక సంఖ్యగా, ఒక వస్తువు స్థితికి అణచివేయబడింది. మన సమాజంలో ఒక వ్యక్తి బుద్ధికి ఈనాడు గుర్తింపులేదు. మనం అందరం దివ్యమైన తారా ధూళి నుండి సృష్టించబడ్డవాళ్ళం. కానీ మన చదువుల్లో, రాజకీయాల్లో, వీధుల్లో, పుట్టుకలో, చావులో అత్యంత దయనీయమైన స్థితి చేరుకున్నాం.

నేను మొట్టమొదటి సారిగా ఇలాంటి వుత్తరం రాస్తున్నాను. ఇదే నా చివరి లేఖ కూడా. మీకు అర్థం అయ్యేలా చెప్పలేకపోయి ఉంటే నన్ను మన్నించండి. ఈ అసమాన సమాజంలో నా పుట్టుకయే ఒక పెద్ద దుర్ఘటన. ఏరకంగానూ ప్రోత్సహించబడని నా బాల్యం నా వెన్నంటే ఉంది. నా చిన్ననాటి ఒంటరితనం నుండి నేనెప్పటికీ తేరుకోలేకపోయాను. ప్రేమ, బాధ, కష్టం, జీవితం, మరణం ఇంకా ఈ సమాజాన్ని అర్థం చేసుకోవడంలో నేనెప్పుడూ ఫెయిల్ అయ్యానేమో. ఎప్పుడూ దేనికీ తొందర లేకున్నా వీటన్నిటికీ దూరంగా ఒక కొత్త జీవితం ప్రారంభించాలని చాలా ఆశ పడ్డాను. కానీ కొందరికి జీవితమే ఒక శాపం.

నేనిప్పుడు బాదపడ్డం లేదు. ఏ రకమైన దు:ఖంలో కూడా లేను. నా గురించి నేనే పట్టించుకోలేనంతగా మనసు శూన్యం అయ్యింది. ఇది చాలా విచారకరం. అందుకే నేను ఈ పని చేస్తున్నాను. నా తదనంతరం జనాలు నన్నొక పిరికివాడిగా, స్వార్థపరుడిగా, తెలివిలేని వాడిగా చిత్రీకరించొద్దు. నన్నేం అంటారో అనే ఆలోచన నాకు లేదు. ఆత్మహత్య తర్వాత భూత ప్రేత పిశాచాలు అవుతారనే మూఢ నమ్మకం నాకు లేదు. నేను ఈ క్షణం దేన్నైనా నమ్ముతున్నానంటే అది ఆకాశ వీధుల్లోకి పయనించి వేరే లోకాల గురించి తెలుసుకుంటాను అని.

ఈ వుత్తరం చదివి మీరు నా కోసం ఏమైనా చెయ్యాలనుకుంటే నాకు 7నెలల ఫెలోషిప్ రావల్సి ఉంది. 1,75,000 రూపాయలు. దీనిలో 40,000 నా స్నేహితుడు రాంజీకి ఇవ్వాలి ఉంది. అతను ఎప్పుడూ తిరిగి ఇవ్వమని నన్ను అడగలేదు. అతనికి ఇవ్వండి. మిగతావి నా కుటుంబానికి చేరేలా చూడండి. నా అంతిమ యాత్ర ఏ ఆటంకాలూ లేకుండా సజావుగా సాగేలా చూడండి. నేను ఒకసారి అలా కనిపించి ఇలా మాయం అయ్యాను అన్నట్టు ప్రవర్తించండి. నా కోసం కన్నీరు కార్చనవసరం లేదు. నేను బ్రతికి ఉన్నప్పటికన్నా చనిపోయాకే ఆనందంగా ఉంటానని నమ్మండి.

జీవం లేని నీడ నుండి నక్షత్రాల దాకా.

ఉమా అన్న, నీ రూమ్‌ని ఈ పని కోసం వాడుకున్నందుకు నన్ను మన్నించు.

ఎ‌ఎస్‌ఎ మిత్రులు మరియు శ్రేయోభిలాషులకు నా క్షమాపణలు. మీరు నన్ను చాలా ప్రేమించారు. మిమ్మల్ని నిరుత్సాహ పరుస్తున్నందుకు నన్ను మన్నించండి.

చివరిగా మరొక్కసారి 'జైభీమ్'

కొన్ని ఫార్మాలిటీస్ మరచిపోయాను.

నా చావుకి ఎవరూ బాధ్యులు కారు. వారి చేతల వల్ల కానీ, మాటల వల్ల కానీ ఎవరూ నన్ను రెచ్చగొట్టలేదు. ఇది నా నిర్ణయం, దీనికి పూర్తిగా నేనే బాధ్యుడ్ని. నేను మరణించాక నా స్నేహితులను గానీ, శత్రువులను గానీ ఈ విషయం పై ఇబ్బంది పెట్టకండి. **– రోహిత్ వేముల**

# రోహిత్ అమర్ రహే

- కె. సమత

రోహిత్ వేముల కొన్నిరోజుల క్రితం హైదరాబాద్ సెంట్రల్ యూనివర్శిటీలో పిహెచ్‌డి చేస్తున్న ఒక మామూలు విద్యార్థి. ఈ రోజు వివక్షతకు వ్యతిరేకంగా విద్యార్థుల ఐక్యతతో ఉప్పెనలా ఎగసిన పోరాటానికి చిహ్నం. ఎన్నో రకాల వివక్షతలు, ఎందరో మృతవీరులు, మరెన్నో వెలివేతలు. వాటిలో కొన్ని సెన్సేషనల్ వార్తలు. మిగతావి ప్రాంతీయానికే పరిమితం. అనవసరంగా వాటిని సెన్సేషనల్ చేస్తున్నారనే వాళ్లు కొంతమంది. రోహిత్ విషయంలో జరిగిన అన్యాయం కన్నా చాలా అన్యాయం జరిగిన సంఘటనలు బోలెడు ఉన్నాయి. వాటిని ఎందుకు సెన్సేషనల్ చేయట్లేదని ప్రశ్నించేవాళ్ళు ఇంకొంతమంది.

జనవరి 2న నేను జెఎన్‌యు నుంచి హెచ్‌సియుకి వచ్చాను. నా పాత స్నేహితుల్ని కలిసి తాపీగా టీ తాగుతూ కూర్చున్నాం షాపింగ్ కాంప్లెక్స్‌లో. అక్కడ ఒక మూలన టెంట్ వేసి అంబేద్కర్, పూలే, బుద్ధుడి ఫోటోలతో బ్యానర్లు కట్టి 'వెలివాడ' అనే ప్లకార్డ్ ఉంది. ఐదుగురు విద్యార్థులు బెడ్స్ వేసుకొని ఉన్నారు. 'ఏం జరిగింది' అనగానే నా స్నేహితుడు జరిగిన సంఘటనని వివరించి కాంపస్ రాజకీయాలుపై చర్చించాడు. ఆ తరువాతి రోజు నుండి క్రమంగా కాంపస్‌లో ఎబివిపి మినహా అన్ని పార్టీలు మద్దతు తెలుపుతూ అనేక కార్యక్రమాలు జరిపారు. సంక్రాంతికి మా ఊరు వెళ్ళి తిరిగి వచ్చే లోపు రోహిత్ మరణించాడన్న వార్త తెలిసింది. మర్నాడు హెచ్‌సియు బయల్దేరాను. 3,4 రోజులు అక్కడే ఉండి కాంపస్ వాతావరణాన్ని, జరుగుతున్న చర్చల్ని పరిశీలించాను.

రోహిత్ ఆత్మహత్య చేసుకోవడం వెనుక ఉన్న కారణాల గురించి ఒకరు మాట్లాడితే, శవరాజకీయాలని ఇంకొకరు దాన్ని విమర్శిస్తున్నారు. రోహిత్ దళితుడా/ కాదా అని ఒక చర్చ, క్యాంపస్ రాజకీయాల్లో కేంద్ర ప్రభుత్వం తలదూర్చడం ఏంటని ఒక చర్చ. అసలు వెలివేయడం ఏంటన్నది మరో చర్చ. ఇలా అనేక విషయాలు వెలుగులోకి వచ్చాయి. పలు రాజకీయ నాయకులు క్యాంపస్‌కి వచ్చి తమ సాలిడారిటీని ప్రకటించారు. కేంద్ర ప్రభుత్వానికి కీలుబొమ్మలా వ్యవహరిస్తున్న విసి రాజీనామా చేయాలన్నది విద్యార్థుల ప్రధాన డిమాండ్. ఆయన రాజీనామా చేసేదాకా యూనివర్శిటీ బంద్ అని ప్రకటించారు. 12 రోజులకి పైగా యూనివర్శిటీ బంద్ నడిచింది. దేశ వ్యాప్తంగా విద్యార్థులు తరలి వచ్చారు.

మొదటిరోజు వెలివాడ అని ఉన్న టెంట్ ఆ అయిదుగురు విద్యార్థుల్ని చూసి జరిగిని విషయం తెలుసుకొని కాంపస్ రాజకీయాలు ఇంతే కదా! ఈ ఉద్యమం కొనసాగడం కష్టమే అనుకున్నాను. "we are more than five" అని నినాదాలతో ఉద్యమాన్ని ముందుకు తీసుకెళ్తుంటే "రోహిత్ వేముల" మళ్ళీ పుట్టినట్లనిపిస్తుంది. ఒక ఆశయం కోసం మరణించి నవాడె ప్పుడూ అమరవీరుడు అవుతాడు.

అసలేం జరిగింది, ఎందుకు రోహిత్ ఆత్మహత్య చేసుకున్నాడు అన్న విషయం చెప్పక్కర్లేదు. ఆ విషయంపై అనేక వార్తలు, వ్యాఖ్యలు, చర్చలు. ఇకపోతే దీన్ని ఎందుకు సెన్సేషనల్ చేస్తున్నారు? ఇంకా బోలెడు సంఘటనలున్నాయి వాటినెందుకు హైలైట్ చెయ్యట్లేదు? యాంటీ గవర్నమెంట్/ యాంటీ బిజెపి దృష్టితో సంఘ వ్యతిరేక శక్తుల్ని మీడియా ప్రోత్సహిస్తుందంటూ వాదన. నిర్భయ కేసు విషయమే తీసుకుందాం. ఆ కేసు సెన్సేషనల్ అయిందంటే అంతకు ముందు మన దేశంలో ఎప్పుడూ అలాంటి సంఘటనలు జరగలేదని కాదు. దేశ పరిస్థితిని, మన దేశంలో స్త్రీల చుట్టూ ఉన్న వాతావరణాన్ని నిలదీస్తూ కొన్ని వేల రేప్ కేసులను రిప్రజెంట్ చేస్తూ ఉద్యమం సాగించి మళ్ళీ ఇలా జరగకూడదని ఒక చట్టం తీసుకురావడం జరిగింది. దీన్ని సెన్సేషనలిజం అంటారా? న్యాయం కోసం మమేకమైన పోరాటం అంటారా? అసలేం జరిగింది? ఎవరికి అన్యాయం జరిగింది? ఎవరికి న్యాయం చేకూరాలి? మళ్ళీ ఇలాంటివి జరగకుండా ఉండాలంటే ఏం చెయ్యాలి? అని ఒక రేషనల్ మైండ్‌తో ఆలోచించే ప్రతి ఒక్కరి దగ్గరా సమాధానం ఉంటుంది. రోహిత్ చనిపోయాక జరిగిందంతా శవరాజకీయాలయితే మరి ఆ చావుకి కారణమైన రాజకీయాల్ని ఏం అంటారు? సంఘ వ్యతిరేకశక్తులు-సంఘీలు కాదా? కాంపస్‌లో రాజకీయాలకు, కేంద్ర ప్రభుత్వంలో ఉన్న స్మృతి ఇరానీకి, బండారు దత్తాత్రేయ జోక్యం గురించి అడిగితే మీడియా యాంటీ గవర్నమెంట్ అంటారా?

మొదటిరోజు వెలివాడ అని ఉన్న టెంట్ ఆ అయిదుగురు విద్యార్థుల్ని చూసి జరిగిని విషయం తెలుసుకొని కాంపస్ రాజకీయాలు ఇంతే కదా! ఈ ఉద్యమం కొనసాగడం కష్టమే అనుకున్నాను."we are more than five" అని నినాదాలతో ఉద్యమాన్ని ముందుకు తీసుకెళ్తుంటే "రోహిత్ వేముల" మళ్ళీ పుట్టినట్లనిపిస్తుంది. ఒక ఆశయం కోసం మరణించినవాడెప్పుడూ అమరవీరుడు అవుతాడు.

హెచ్‌సియు కాంపస్‌లో ఐదేళ్ళు చదువుకున్నాను. విద్యార్థి సంఘాల మధ్య వివాదాలు, భౌతిక దాడులు లాంటివి ఎన్నో చూసాను. కమిటీ వేసి జరిగిన ఘటనల్ని పరీక్షించి సర్దుబాటు చేసి, ఏక పక్షమైన వైఖరి లేకుండా పరిస్థితిని న్యూట్రల్ చెయ్యడం, తగిన యాక్షన్ తీసుకోవడం జరిగింది. ఇలా హాస్టల్ ఖాళీ చేయించి, ఏక పక్షమైన వైఖరితో కేంద్ర ప్రభుత్వం నుండి లేఖలు రావడం అనేది పరీక్షిస్తే అధికారంలో ఉన్న వ్యక్తులు పదవిని ఎలా దుర్వినియోగం చేస్తున్నారన్నది అర్థమౌతుంది. దాని వల్ల ఈ రోజు నష్టపోయింది ఎవరు? జరిగింది ఏమిటి? కారణం వివక్షత కాదంటారా? జరిగింది అన్యాయం కాదంటారా?

"నీ గురించి తెలిసిన వాళ్ళంతా రోహిత్ ఆత్మహత్య చేసుకునే రకం కాదు, చాలా తెలివైన వాడు. ఒక ఆశయం కోసం పోరాడుతూ ఉంటాడు. పోరాడి అలసిపోయే రకం కాదన్నారు. తన చావుతో అయినా జరిగిన రాజకీయాలు బయటకొస్తాయి, జరిగిన వివక్షతని ప్రశ్నిస్తారని, ఆలోచించే ఆ నిర్ణయం తీసుకుని ఉంటాడని అన్నారు." నీవు మరణించి నీ ఆశయానికి ప్రాణం పోసావు. లక్షల మంది విద్యార్థుల్ని ఒకటి చేసి పరపీడన పరాయణాన్ని ప్రశ్నించ మంటూ తాను సైతం ప్రపంచాగ్నికి సమిధైన "రోహిత్ అమర్ రహే."

# అంతర్జాతీయ మహిళా ఉద్యమ స్ఫూర్తితో రాజ్యాంగ పరిరక్షణ - సమాన హక్కుల అమలుకై ఉద్యమిద్దాం

- కె.స్వరూపరాణి



మహిళలు పోరాడి సాధించుకున్న చట్టాల అమలు కొరకు, సమాజంలో బలంగా వేళ్ళూనుకొన్న వివక్షత రూపు మాపి, సమాన హక్కుల సాధన కొరకు మార్చి - 8 అంతర్జాతీయ స్ఫూర్తితో మహిళలంతా సంఘటితమౌదాం!

106వ మహిళాదినోత్సవం జరుపుకుంటున్నాం. ఇదే రోజున మహిళా కార్మికుల తరుపున కోపెన్‌హెగన్‌లో క్లారాజెట్కిన్ రూపొందించిన చైతన్యనాదం క్రమంగా ప్రపంచ వ్యాపితంగా విస్తరించి మానవజాతిలో సగానికి మేలుకొలుపుగా మారింది. నేడు మనం అనుభవిస్తున్న ప్రతి హక్కు, సౌకర్యం వెనుక ఎంతో మంది త్యాగాలు, పోరాటాల చరిత్ర ఉంది.

ప్రపంచ వ్యాపితంగా జరిగిన వర్గ పోరాటాలు కేవలం పురుషులు మాత్రమే చేసినవి కావు. గతంలో జరిగిన విప్లవ పోరాటాలు తిరుగుబాట్లు, ప్రస్తుత పెట్టుబడిదారీ సమాజంలో సాగుతున్న వర్గపోరాటాలలో మహిళలు భాగస్వాములుగా ఉన్నారు. ముఖ్యంగా 1857 మార్చి - 8న ప్రపంచంలో ఎక్కడా జరగనంత తీవ్రమైన పోరాటం అమెరికాలోని న్యూయార్కు నగరంలో జరిగింది. వందలాది బట్టల మిల్లుల కార్మిక మహిళలు ప్రతి రోజు ఆకలితో చావటం కన్నా పోరాడి చావడం మేలు అని అమానవీయమైన పని పద్ధతులకు వ్యతిరేకంగా పనిగంటలు, కనీసవేతనాలు, ఓటు హక్కు కోసం సమ్మె సైరన్ మోగించారు. యాజమాన్యం ఉద్యమాన్ని అణచివేసే ప్రయత్నం చేసింది. బట్టల మిల్లులో కార్మికులు బయటకు రాకుండా తలుపులు వేసి కాల్పులు జరిపి 146 మంది యువ మహిళలను పొట్టన పెట్టుకున్నారు. అయినా మొక్కవోని ధైర్యంతో మహిళలు చేసిన పోరాటం ముందు కిరాతకమైన యజమానులు తలొగ్గక తప్పలేదు. బేరసారాలలో, సంఘటిత పోరాటాలలో పురుషులకు ఏ మాత్రం తీసుపోమని మహిళలు నిరూపించుకున్నారు. ఈ పోరాటం ప్రపంచవ్యాపితంగా స్త్రీలయొక్క సమస్యలు తెరమీదకి తేవటంతోపాటు అనేక ఉద్యమాలకు స్ఫూర్తినిచ్చింది.

అంతర్జాతీయ కార్మిక ఉద్యమం శ్రామిక మహిళల దుర్భర జీవితాలను, పెరుగుతున్న పోరాటాలను గమనించింది. కార్మికోద్య మంలో వారిని భాగస్వాములను చేస్తూ అదే సందర్భంలో మహిళల ప్రత్యేక సమస్యలపై దృష్టి పెట్టింది. క్లారాజెట్కిన్ చొరవ ఫలితంగా అంతర్జాతీయ కార్మిక సభ సందర్భంగా 1907లో జర్మనీలోని స్టట్‌గార్డులో ప్రత్యేక మహిళా సదస్సు నిర్వహించింది. 1910లో జరిగిన 2వ మహిళల సదస్సు మహిళా హక్కుల కొరకు మార్చి 8ని అంతర్జాతీయ దినోత్సవంగా జరపాలని నిర్ణయించింది.

యురోపియన్ దేశాలలో మహిళా ఉద్యమాలు చట్టపరంగాను, సామాజికంగానూ ఓటు హక్కును, పురుషులతో స్త్రీలకు సమాన స్థాయి కల్పించాలనే డిమాండ్‌ను లేవనెత్తింది. సంపూర్ణమైన సామాజిక మానవీయ స్వేచ్ఛను లేవనెత్తిన బూర్జువా సమాజం స్త్రీల బానిసత్వాన్ని కొనసాగిస్తున్న విషయాన్ని గుర్తించడంలో బూర్జువా మహిళా ఉద్యమం విఫలమైంది. పెట్టుబడిదారి దోపిడీ ఉత్పత్తి విధానాన్ని పునాదిగా చేసుకొని, పెట్టుబడిదారులు-కార్మిక వర్గాల మధ్య నిరంతర ఘర్షణతో కూడిన సమాజంలో ఉన్నాం. దోపిడీ దారులు బలమైన పాలకులు గానూ, మరోవైపు శ్రమదోపిడీకి గురౌతున్న వారు పాలితులుగాను విభజించబడ్డ సమాజంలో ఉన్నాము. స్త్రీలు ఎదుర్కొంటున్న ఈ పరిస్థితికి మౌలికమైన వర్గవైరుధ్యాలే అసలు కారణం. బూర్జువా మహిళా ఉద్యమాలు ప్రధానంగా విడాకులు, సంతానంపై ఇరువురికి సమాన హక్కు వైవాహిక విషయాల్లో ఒకేరకమైన నీతి, స్త్రీలకు ఆస్థిహక్కు, సామాజిక స్వేచ్ఛ, రాజకీయ సమానత్వం వరకే పరిమితం అవుతున్నాయి. అవి అవసరమే. పురుషులతోపాటు స్త్రీలకు సామర్థ్యం ఉన్నదని, సమాన హక్కులు ఉండాలని గుర్తించటం చెప్పుకోదగినది. ఈ సంస్కరణలు పరిమితమైనా, వాస్తవానికి బూర్జువా సమాజంలోనే అత్యధిక మహిళలు దోపిడీకి గురవుతున్నారు.

స్త్రీ విముక్తిని సాధించకుండా కార్మిక

వర్గం తమ విముక్తి సాధించలేదు అన్న లెనిన్ మహాశయుని ఉద్భోధలను అనుసరించి అంతర్జాతీయ కార్మిక మహాసభలు, ప్రత్యేకించి మహిళా సమస్యలపై పలు ప్రదర్శనలు చేశాయి. 1917 సోవియట్ రష్యాలో ఏర్పడిన సోషలిస్టు ప్రభుత్వం స్త్రీ సమానత్వం కోసం చట్టపరమైన చర్యలు చేపట్టింది. స్త్రీ విముక్తి సాధించాలంటే సాంఘిక ఆర్థిక రాజకీయ పరిస్థితులు మార్చాలి. లెనిన్ నాయకత్వంలో సోవియట్ ప్రభుత్వం తీసుకున్న చర్యలు మహిళా ఉద్యమాలకు దిక్సూచిగా మారాయి. ప్రతి ఒక్కరికి తిండి హక్కు, పని హక్కు కల్పించడం మహిళా విముక్తికి ఎంతో దోహదపడింది. సామూహిక బిడ్డల పెంపక కేంద్రాలను నిర్వహించడం ఇంటిపని నుంచి విముక్తి కల్పించి సోవియట్ యూనియన్‌లో మహిళలపై అత్యాచారాలు,వ్యభిచారవృత్తి వంటివి అంతం చేయబడ్డాయి. 1960 తరువాత స్త్రీవాద ఉద్యమాలు ఊపందుకున్నాయి. 1975లో ఐక్యరాజ్యసమితి జనరల్ అసెంబ్లీ సమాన హక్కులపై మహిళా దినోత్సవాలు జరపాలని పిలుపునిచ్చింది. 1975 నుండి 1985 వరకు మహిళా దశాబ్ధంగా ప్రకటించింది. అప్పటినుండి ప్రపంచంలో అన్ని దేశాలలో, అన్ని ప్రాంతాలలో కులము, మతము, జాతి వివక్షత లేకుండా మహిళలందరూ మార్చి 8ని మహిళా దినోత్సవంగా జరుపుకోవడం పెద్దఎత్తున సాగుతూ వస్తున్నది. నాల్గవ ప్రపంచ మహిళా సదస్సు 1995లో బీజింగ్‌లో 189 దేశాల ప్రతినిధులతో జరిగింది. ఈ సదస్సులో మహిళా సమాన హక్కులు, ఆటం కాలు, తీసుకోవల్సిన చర్యలు గురించి చర్చిం చింది. భారత ప్రభుత్వం కూడా బీజింగ్ తీర్మానానికి అనుకూలంగా సంతకం పెట్టింది.

**భారత దేశంలో మహిళ పరిస్థితి నానాటికి దిగజారింది**

1990 దశకం నుండి అమలు జరుగుతున్న సరళీకరణ విధానాల వల్ల నిరుద్యోగం, అభద్రత, ధరలు పెరుగుదల, అసమానతలు, పేదరికం పెరిగింది. విద్య, వైద్య, పౌర సేవలు ప్రైవేటీకరించబడుతున్నాయి. ప్రభుత్వ ఉద్యోగులు స్థానే, కాంట్రాక్టు, ఔట్‌సోర్సింగ్ విధానం రూపొందింది. మహిళలు పనిచేస్తున్న అంగన్‌వాడీ, ఆశా, మధ్యాహ్నభోజనం, ఐకెపి తదితర రంగాలలో కనీస వేతనాలు లేవు. సంక్షేమంలో కోత పెట్టడం వలన ఆహార భద్రత, ఇతర సేవలు నిరాకరించబడుతున్నాయి. ప్రస్తుతం మోడీ ప్రభుత్వం కూడా అవే విధానాలను మరింత బరితెగించి అమలు జరుపుతుంది. బడా కార్పొరేట్ శక్తులకు దేశ వనరులను ఇష్టారాజ్యంగా కట్టబెడుతూ కార్మికుల హక్కులను, చట్టాలను హరిస్తున్నారు. మోడీ ప్రభుత్వం బేటిబచావో, బేటిపడావో అనే నినాదం చేస్తూ జెండర్ బడ్జెట్‌ను తగ్గించారు. 2015-16 స్త్రీ శిశు అభివృద్ధికి 18,511 కోట్లు నుండి 8,754 కోట్లకు, మధ్యాహ్న భోజన పథకానికి 13,295 కోట్లు నుండి 7,775 కోట్లు, సర్వశిక్షా అభియాన్‌కి 28,258 కోట్లు నుండి 19,800 కోట్లు తగ్గించారు. ప్రజల ఆరోగ్య పరిరక్షణకు సంబంధించి నేషనల్ హెల్త్ కమీషన్ అనేది కీలకమైన పథకం, 2015-16 బడ్జెట్‌లో దీనికి 3900 కోట్లు తగ్గించారు. గ్రామీణ ఉపాధి హామీ పథకం అమలుకు 6 వేల కోట్లు కోత పెట్టారు. ఈ మొత్తం పరిశీలిస్తే స్థూల జాతీయోత్పత్తిలో మహిళలకు కేటాయించిన నిధులలో కోత పడింది, స్త్రీలపై పెరుగుతున్న హింస, అఘాయిత్యాలు దృష్ట్యా వారి రక్షణ, సహాయార్థం నిధులు పెంచాల్సిన అవసరాన్ని బిజెపి సర్కారు పట్టించుకోలేదు, తీవ్రమైన హింసకు గురయ్యే మహిళలకు ఉపశమనం కల్గించే హెల్ప్‌లైను పథకాలకు అసలు కేటాయింపులు లేవు. నిర్భయ చట్టం క్రింద కేటాయించిన 1000 కోట్లు ఇతర అవసరాలకు ఉపయోగిస్తున్నారు. వర్మ కమీషన్ సిఫారసులుమేరకు ఏర్పరచిన ఒన్‌స్టాప్ క్రైసెస్ సెంటర్స్ (సంక్షోభ నివారణ కేంద్రాలు) కు నిధుల కేటాయింపు లేదు. మోడీ ఎన్నికల ప్రణాళికలో ప్రతి మనిషి కంట కన్నీరు తుడవడమే లక్ష్యంగా ప్రకటించినా అమలు లేదు.

గడిచిన 2 సం॥లో పేద, మధ్యతరగతి ప్రజలపై మరిన్ని భారాలు మోపి మరింత అగచాట్లు పాలు చేసింది. పైగా బి.జె.పి అధికారంలోకి వచ్చిన తరువాత మతోన్మాద శక్తులు పడగ విప్పుతున్నాయి. మహిళలు తమకున్న అవకాశాలు ఉపయోగించి అన్ని రంగాలలో ముందంజ వేస్తూ దేశ ఆర్థిక వ్యవస్థకు ఇస్తున్న తోడ్పాటును వారి శ్రమను గుర్తించకుండా తిరోగమన భావాలు ముందుకు తెస్తున్నారు. ఆడవాళ్ళు బయటికి రాకూడదు అని ఆర్.ఎస్.ఎస్ ఛాందసభావాలకు మోడీ సర్కారు వంత పాడుతుంది. మత ఉద్రిక్తతలు రెచ్చకొట్టి లౌకిక సూత్రాలకే మచ్చ తెస్తుంది. మతాంతర, కులాంతర వివాహాలు చేసుకున్న జంటలను వెంటాడి వేధిస్తుంది. వారిపై తప్పుడు కేసులు పెట్టడం, కులపంచాయితీల పేర హత్యలు సయితం సాగిస్తున్నారు. సంస్కృతి, సాంప్రదాయం

**మోడీ ప్రభుత్వం బేటిబచావో, బేటిపడావో అనే నినాదం చేస్తూ జెండర్ బడ్జెట్‌ను తగ్గించారు. 2015-16 స్త్రీ శిశు అభివృద్ధికి 18,511 కోట్లు నుండి 8,754 కోట్లకు, మధ్యాహ్న భోజన పథకానికి 13,295 కోట్లు నుండి 7,775 కోట్లు, సర్వశిక్షా అభియాన్‌కి 28,258 కోట్లు నుండి 19,800 కోట్లు తగ్గించారు. ప్రజల ఆరోగ్య పరిరక్షణకు సంబంధించి నేషనల్ హెల్త్ కమీషన్ అనేది కీలకమైన పథకం, 2015-16 బడ్జెట్‌లో దీనికి 3900 కోట్లు తగ్గించారు. గ్రామీణ ఉపాధి హామీ పథకం అమలుకు 6 వేల కోట్లు కోత పెట్టారు. ఈ మొత్తం పరిశీలిస్తే స్థూల జాతీయోత్పత్తిలో మహిళలకు కేటాయించిన నిధులలో కోత పడింది, స్త్రీలపై పెరుగుతున్న హింస, అఘాయిత్యాలు దృష్ట్యా వారి రక్షణ, సహాయార్థం నిధులు పెంచాల్సిన అవసరాన్ని బిజెపి సర్కారు పట్టించుకోలేదు.**

పేరిట ఆడపిల్లల వస్త్రాధారణపైన ఆంక్షలు పెడుతున్నారు. 6 గం॥లు దాటాక బయటికి ఎందుకు రావాలని ప్రశ్నిస్తున్నారు. 10మంది పిల్లల్ని కనాలని ఉద్భోదిస్తున్నారు. ఇంటిని, పిల్లలను చక్కదిద్దు కోవాల్సిన మహిళలు ఉద్యోగాల పేరుతో బయటికి రావటం వల్లనే అత్యాచా రాలు జరుగుతున్నాయని, మహిళల ఆర్థిక స్వేచ్ఛను హరించే ప్రయత్నం జరుగుతున్నది. వివిధ స్థాయిల్లో ఉద్యోగినులు సయితం ఆయా రంగాలలో పై అధికారుల లైంగిక వేధింపులకు బలవుతున్నారు. హర్యానా, రాజస్థాన్‌లో బి.జె.పి ప్రభుత్వాలు 73వ రాజ్యాంగ సవరణలను పక్కన పెట్టి కనీస విద్యార్హతలు, మరుగుదొడ్లు లేనివారికి, బ్యాంకులో బకాయిలున్న వారికి, పంచాయితీలో పోటీచేసే అర్హత లేదని ప్రకటించింది. దీని వలన నిరక్ష్యరాస్యులుగా ఉన్న 67% మంది మహిళలు, 47.4% పురుషులు పోటీకి అనర్హులుగా ప్రకటించ బడ్డారు. సెంట్రల్ యూనివర్సిటీ విద్యార్థి రోహిత్, జెఎన్‌యు విద్యార్థి కన్నయ్య కుమార్ ఘటనలు ప్రజల మధ్య విద్వేషాలు సృష్టించే దుర్మార్గానికి ఉదాహరణలు. తల్లి కులం కూడా బిడ్డకు వారసత్వంగా వస్తుందన్న సుప్రీంకోర్టు తీర్పును ఆర్ఎస్ఎస్ అంగీకరించలేక పోతుంది. జెఎన్‌యులో ఉద్యమిస్తున్న అమ్మాయిలను వ్యభి చారిణుల కంటె హీనమని బిజెపి నాయకులు తమ అంతరంగాన్ని బయటపెట్టుకున్నారు. సాధించుకున్న చట్టాలను ఉల్లంఘిస్తున్నారు. చట్ట సభలలో మహిళల రిజర్వేషన్ కొరకు 1996 నుండి చర్చ జరుగుతున్నా నేటికీ చట్టం చేయలేదు.

పేదరికం వలన, మానవ వ్యాపారం చేస్తున్న బేహారుల వలన మహిళలు వ్యభిచార వృత్తిలోకి నెట్టబడుతున్నారు. వీరికి ప్రత్యామ్నయం చూపి ఆ వృత్తి నుండి రక్షించాల్సిన జాతీయ మహిళా కమిషన్ ఛైర్‌పర్సన్ లైసెన్సులు ఇవ్వాలని అనటం మానవ వ్యాపారాన్ని చట్టబద్ధం చేయటమే. నానాటికీ పెరుగుతున్న ధరలు, ఉపాధి కోల్పోవడం మూలంగా కుటుంబ బాధ్యతలు నెరవేర్చే ఆడవాళ్ళు ఇంటా బయటా ఎన్ని కష్టనష్టాలకు లోనవుతున్నా వాస్తవాలను కప్పిపెట్టడానికి హిందూత్వశక్తులు మహిళల పాత్ర, కుటుంబ గౌరవం వంటి కుహనా సుద్దులు చెబుతున్నారు. విద్య, వైద్యం, శిశు సంరక్షణ, వృద్ధుల బాధ్యత వంటి రంగాలన్నింటా ప్రభుత్వం తన బాధ్యత నుండి తప్పుకొని ఇవన్నీ చక్కబెట్టాల్సిన మహిళా లోకంపై భారం పెంచుతుంది.

**చంద్రబాబు వాగ్దానాలు చేయడం తప్ప వాటి అమలు చేయడానికి కృషి పెద్దగా లేదు. ఋణమాఫీ ఆచరణలో రైతులకు అసంతృప్తినే మిగిల్చింది. డ్వాక్రా మహిళలకు చేసిన ఋణమాఫీ వాగ్దానం కేవలం 3000/- రూపాయలకు మాత్రమే కుదించడంతో డ్వాక్రా మహిళలపై వడ్డీ భారం పడింది. పేదరికం వల్ల మహిళలు కాల్‌మనీ వ్యాపారస్తుల కబంధ హస్తాలలో చిక్కుకుపోయారు. కాల్‌మనీ రాకెట్‌లో ఉన్న బడా బాబుల చిట్టాను పూర్తిగా బయటపెట్టలేదు. విచారణ కూడా నిరాశాజనకంగా జరుగుతుంది. ఎం.ఆర్.ఒ.వనజాక్షిని జుట్టుపట్టుకొని లాగిన వారికి ఇంత వరకు ఎటువంటి శిక్షలు లేవు. మహిళలపై హింస జీవితంలో అంతర్భాగం అయింది.**

చంద్రబాబు వాగ్దానాలు చేయడం తప్ప వాటి అమలు చేయడానికి కృషి పెద్దగా లేదు. ఋణమాఫీ ఆచరణలో రైతులకు అసంతృప్తినే మిగిల్చింది. డ్వాక్రా మహిళలకు చేసిన ఋణమాఫీ వాగ్దానం కేవలం 3000/- రూపాయలకు మాత్రమే కుదించడంతో డ్వాక్రా మహిళలపై వడ్డీ భారం పడింది. పేదరికం వల్ల మహిళలు కాల్‌మనీ వ్యాపారస్తుల కబంధ హస్తాలలో చిక్కుకుపోయారు. కాల్‌మనీ రాకెట్‌లో ఉన్న బడా బాబుల చిట్టాను పూర్తిగా బయటపెట్టలేదు. విచారణ కూడా నిరాశాజన కంగా జరుగుతుంది. ఎం.ఆర్.ఒ.వన జాక్షిని జుట్టుపట్టుకొని లాగిన వారికి ఇంత వరకు ఎటువంటి శిక్షలు లేవు. మహిళలపై హింస జీవితంలో అంతర్భాగం అయింది. బెల్టు షాపులు రద్దు చేస్తామన్న పాలకుల వాగ్దానం నెరవేరలేదు. ప్రభుత్వమే మద్యం దుకాణాలు నిర్వహించాలని, షాపింగ్ మాల్స్‌లోనూ, మద్యం షాపులకు లైసెన్సులు ఇవ్వాలని నిర్ణయించింది. పారిశ్రామిక వేత్తలకు వేలాది కోట్లు సబ్సిడీని మంజూరు చేయడానికి ప్రభుత్వం దగ్గర డబ్బులు ఉన్నాయి. కానీ చిరు ఉద్యోగులు సమస్య తీర్చడానికి కూడా ప్రభుత్వం నిధులు లేవని దాటవేయడం, ఉద్యమాలను పాశవికంగా అణచడానికి ప్రయత్నం చేస్తుంది. ఇంటికి ఒక ఉద్యోగం ఇస్తామని చెప్పి 2000 మంది ఫీల్డ్ అసిస్టెంట్లను, 2000 మంది హౌసింగ్ కార్పొరేషన్ వర్క్ ఇన్‌స్పెక్టర్లను తొలగించారు. అంగన్‌వాడీ ఉద్యమంలో పాల్గొన్నవారిని తొలగించాలని మెమో జారీ చేశారు.

అనేక ఆటంకాలు ఎదురవుతున్నప్పటికీ అసమానతలను ఎదిరించేందుకు ఆయా రంగాల్లో విజయాలు సాధించేందుకు మహిళలు ప్రత్యేకంగా యువతులు పట్టుదలతో ధైర్యంగా ముందడుగు వేస్తున్నారు. దైవం పేరుతో అపవిత్రతను ప్రశ్నించిన నిఖితా అజాద్ శనీశ్వరాలయానికి మహిళలను నడిపించిన ఐటి చట్టంలోని సెక్షన్ 69ను ప్రశ్నించిన వారందరూ యువతులే. మహిళల త్యాగాలతోనే మార్చి 8 ఆవిర్భవించింది. మహిళ, కార్మిక హక్కులను కాలరాస్తున్న కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాల మహిళా వ్యతిరేక విధానాలను త్రిప్పి కొట్టాలని, మన అస్థిత్వాన్ని కాపాడు కునేందుకు, మహిళా చట్టాల పరిరక్షణ, సమాన హక్కులు సాధించేందుకు మార్చి - 8 అంతర్జాతీయ మహిళా దినోత్సవం సందర్భంగా ప్రతిన బూనదాం.



కథ

# తరగతి గదిలో తల్లి

- సింగమనేని నారాయణ

తరగతి గదిలోకి అడుగుపెట్టిన ఆ కొత్త ఉపాధ్యాయుడి వైపు ఆసక్తిగా చూస్తున్నారు పిల్లలందరూ! ఎర్రగా, పొడుగ్గా, ముప్ప య్యేళ్ళు మించని అతడిని అందరూ కుతూహలంగా గమనిస్తున్నారు... కొత్తగా వచ్చిన ఉపాధ్యాయుడి పట్ల సహజంగా పిల్లలకు కలిగే ఉత్సుకత వాళ్ల ముఖాల్లో కన్పిస్తోంది. పాతటీచర్ సుశీలమ్మ పదిరోజుల క్రితం బదిలీకాగా, ఆ స్థానంలో వచ్చి ఆ రోజే స్కూల్లోకి అడుగు పెట్టినాడు ఆయన!

ఏడో తరగతి గది అది. అరవై మందికి పైగా పిల్లలున్నారు ఆ తరగతిలో! అందునా 30 మందికి పైగా ఆడపిల్లలున్నారు! ఆ పల్లెటూరి హైస్కూల్లో ఒక తరగతిలో ఈ మాత్రం పిల్లలుండటం, అందులో సగం మంది ఆడపిల్లలుండటం, అతనికి చాలా ముచ్చటగా ఉంది... ఈ మధ్యకాలంలో మగపిల్లల్తోపాటు, అంతకంటే ఎక్కువగా కూడానూ, ఆడపిల్లలు చదువుకోవడం, మగపిల్లలకంటే బాగా రాణించటం, దేశమంతా గమనిస్తూనే ఉంది.

కొత్తగా వచ్చిన ఆ ఉపాధ్యాయుడు, లేచి నిలబడ్డ పిల్లల్నందర్నీ కూర్చోమని చెప్పి, "నా పేరు ప్రభాకరం! ఇంతకు మునుపు హంపాపురంలో నాలుగేళ్ళు పనిచేసినాను. మీ టీచర్ సుశీలమ్మగారి స్థానంలో బదిలీ చేసినారు. ఆమెలాగే నేనూ మీకు తెలుగు పాఠాలు బోధిస్తాను". అంటూ తన్ను తాను పరిచయం చేసుకున్నాడు.

పిల్లలంతా నిశ్శబ్దంగా చూస్తున్నారతని వైపు. తన్ను తాను అతడు పరిచయం చేసుకున్న తీరులోనే ఒక కొత్తదనం ఉందనిపించింది వాళ్ళకు, సుశీలమ్మ మొహంలా చిర్రుబుర్రులాడుతూ కాకుండా, చాలా ప్రశాంతంగా, ప్రసన్నంగా కన్పిస్తోంది అతని ముఖం!

"ముందు మీ అందరి పేర్లూ వరుసగా నాకు చెప్పండి..." అంటూ మొదటి వరుసలో కూచున్న ఒక అమ్మాయిని లేపి, "నీ పేరేమిటమ్మా" అన్నాడు సౌమ్యంగా.

ఆ అమ్మాయి ఉత్సాహంగా "సుభాషిణి సార్" అంది. ఆ క్రమంలో వరుసగా అందరూ తమ పేర్లు వినిపించారు అతడికి.

పరిచయాలు పూర్తయ్యాక "సుభాషిణీ! మొదటగా నిన్ను కొన్ని ప్రశ్నలడిగి పాఠం ప్రారంభిస్తాను" అన్నాడు.

సుభాషిణి లేచి నిలబడింది. ఏం ప్రశ్నలడుగుతాడా అని పిల్లలంతా విప్పారిన కళ్ళతో నిశ్శబ్దంగా చూస్తున్నారు!

"ఈ పాఠం కేవలం పరిచయ పాఠము. గాభరా పడకుండా మాట్లాడండి. ఇప్పుడు మనం మాట్లాడే భాషనేమంటారు" అని అడుగుతూ ఆ అమ్మాయికి దగ్గరగా వచ్చాడతను.

ఓస్ ఇంతేనా' అన్నట్టు "తెలుగుభాష సార్" ఠకీమని జవాబు చెప్పింది ఆ అమ్మాయి.

"సరే! మనం మాట్లాడుకునే ఈ భాషకు మరోపేరు కూడా ఉంది. చెప్పు చూద్దాం" అన్నాడతడు.

సుభాషిణి క్షణం ఆలోచించి "ఆంధ్ర భాష సార్"అంది.

"సరిగానే చెప్పినావు. అయితే ఇంకో పేరు కూడా చెప్పగలవా, ఆలోచించు"అన్నాడు చిర్నవ్వుతో.

సుభాషిణి ఆలోచిస్తూ నిలబడిపోయింది.

"రమణా! నువ్వు చెప్పగలవా" అంటూ మరో విద్యార్థిని అడిగాడు. రమణ లేచి నిలబడినాడు. ఇంకో పేరేమిటబ్బా అంటూ ఆలోచనలో పడిపోయాడు.

"ఎవరైనా చెప్పగలరా?"

రెండో వరుసలో కూచున్న 'ఆశా' లేచి నిలబడి "మాతృభాష అని కూడా అంటారు సార్" అంది విజయోత్సాహంతో.

అతడు మెచ్చుకోలుగా చూస్తూ " చాలా చక్కగా కనిపెట్టేశావమ్మా! మన తెలుగు భాషను మాతృభాష అని కూడా మనం చెప్పవచ్చన్నమాట. సరేనా..."అన్నాడు.

అవునన్నట్లు పిల్లలందరూ తలాడించారు.



"సరే, మాతృభాష అన్నమాటకు అర్థం చెప్పండి చూద్దాం"

"తల్లిభాష సార్" అని దాదాపు అందరూ ముక్తకంఠంతో చెప్పేశారు.

"మాతృభాష అంటే తల్లిభాష అని మీరంతా ఒప్పేసుకున్నట్లే గదా! అయితే నాకో అనుమానం! తల్లిభాష అనే మనం ఎందుకు పిలవాలి? 'తండ్రిభాష' 'అక్కభాష' అనైనా అనోచ్చుగదా! తల్లిభాషే అని ఎందుకు అంటున్నాం చెప్పండి చూద్దాం" అనడిగాడు ప్రభాకరం.

పిల్లలంతా మళ్ళీ ఆలోచనలో పడిపోయారు.

"కృష్ణవేణీ! నువ్వు చెప్పు చూద్దాం"

ఆ పిల్ల సిగ్గుపడుతూ నిల్చుంది. 'తెలీదు సార్' అంది. పక్కనున్న పిల్ల నేను చెబుతా సార్ అంటూ లేచి నిలబడి "అమ్మదగ్గరే మొట్టమొదట మాటలు నేర్చుకుంటాం గాబట్టి.... అమ్మ దగ్గరే పెరుగుతాం కాబట్టి" అంది.

'చాలా చక్కని సమాధానం' అంటూ మెచ్చుకోలుగా, ఆ అమ్మాయి తలనిమిరి, "మనమంతా చిన్నప్పుడు తల్లి ఆలనా, పాలనా, లాలనలతో పెరుగుతాం కదా! అందువల్ల మొదట తల్లి నోటి నుండే మనం భాషను నేర్చుకుంటాం. కాబట్టే మనం మాట్లాడే భాషను మాతృభాష అంటాం. అవునా! మనమే కాదు, ప్రపంచంలో అన్ని భాషలు మాట్లాడేవాళ్ళూ, తమ భాషను 'మాతృభాషే' అంటారు.' అన్నాడు వివరిస్తున్న ధోరణిలో.

'ఔనౌను' అన్నట్టు పిల్లలంతా

తలాడించారు.

"కాబట్టి మనం మెదట ఎవరికి రుణపడి ఉండాలి?"

''అమ్మకే, అమ్మకే'', పిల్లలంతా ముక్తకంఠంతో నినదించారు. ప్రభాకరం ముఖం ప్రఫుల్లమయింది.

''మీరంతా జాగ్రత్తగా గుర్తుతెచ్చుకోండి... తల్లి తన పిల్లల్ని ఎలా సాకి సంరక్షిస్తుందో, పుట్టిన శిశువును ఎంత పొందికగా, ఎంత ఒద్దికగా, ఎంత సున్నితంగా కాపాడుతుందో! ముఖ్యంగా తల్లి పసిపిల్లలకు స్నానం చేయించడం మీరెవరైనా పరిశీలనగా గమనించారా!" అడిగాడు ప్రభాకరం.

"చూసినాం సార్" అన్నాడు రవి అనే అబ్బాయి.

''అయితే లేచి చెప్పు చూద్దాం... అందరూ వింటారు" అని ప్రశ్నించేసరికి ఎలా చెప్పాలో తెలియక నిల్చుండిపోయాడు రవి.

"నేను చెబుతా సార్" లేచి నిల్చుంది సుభాషిణి.

"చెప్పమ్మా" అన్నాడు ఆ పిల్లవైపు లాలనగా చూస్తూ.

"అమ్మ కాళ్ళు చిపి, కాళ్ల మీద బోర్లా పడుకోబెడుతుంది సార్, దోసిళ్ళతో నీళ్ళు తీసుకుని తల మీద, వీపు మీద, కాళ్ళ మీదా మెల్లగా తడుతుంది సార్. శనగపిండితో తల రుద్దుతుందది సర్. కాళ్ళూ చేతులూ లాగి తోముతుంది సార్. నోట్లో వేలు పెట్టి నాలుక మీదున్న గల్లను తీసేస్తుంది సార్. ముక్కును అదిమి చీమిడి తీస్తుంది సార్..." ఇలా స్నానఘట్టాన్ని తన్మయంతో వివరిస్తోంది సుభాషిణి. తన తల్లి రోజూ తన తమ్ముడికి స్నానం చేయించే సన్నివేశాన్ని గుర్తుకు తెచ్చుకుంటూ చెబుతూంటే పిల్లలందరూ పులకించిపోతూ వింటున్నారు.

"అంటే ప్రతి చిన్న పని నుండి తల్లి, తన పిల్లలకు ఎన్నెన్నో పనులు చేసి పెడుతుంది. పిల్లల్ని ఇలా జాగ్రత్తగా పెంచి పెద్ద చేయటంలో తండ్రి పాత్ర ఏ మేరకు ఉందో మీరెప్పుడైనా ఆలోచించారా?"

పిల్లలంతా ఒకరి ముఖాలు ఒకరు ప్రశ్నార్థకంగా చూసుకున్నారు.

వాళ్ళ భావాలు అర్థమై "సరే, నేను కొన్ని ప్రశ్నలడడుగుతాను జవాబులు చెప్పండి" అన్నాడు ప్రభాకరం. పిల్లలు తలలూపినారు.

"చాలా చిన్న ప్రశ్నలే! మీ నాన్న మీకెప్పుడైనా, స్నానాలు చేయించి, బట్టలు తొడిగి, తల దువ్వినాడా"

పిల్లలు ఇదేం ప్రశ్న అనుకున్నారేమో, నాన్న ఎందుకు చేస్తాడనుకున్నారేమో,

"లేదు సార్" అన్నారు.

"మీ ముడ్డి ఎప్పుడైనా కడిగినాడా"

'ఛీ!ఛీ!' అన్నట్లు మొహాలు పెట్టి "అబ్బే..." అన్నారు.

"మీకు ఊయల ఊపినాడా"

"లేదు సార్"

**సుభాషిణికైతే తన ఇల్లే గుర్తుకొస్తోంది. తన అమ్మే గుర్తుకొస్తోంది. పొద్దున, బాగా తెల్లవారకముందే నిద్రలేస్తుంది అమ్మ. పాలు పితుకుతుంది. ఇల్లంతా కసువులు ఊడుస్తుంది అంట్లన్నీ తోముతుంది. ఇల్లంతా సర్దుతుంది. కాఫీలు చేసి ఇస్తుంది. నాన్న బయట వసారాలో కూచుని అన్నిటికీ ఆర్డర్లు వేస్తుంటాడు. తాగిన కాఫీగ్లాసును కూడా పక్కనపెట్టడు. తనకూ తమ్ముడికి స్నానాలు చేయిస్తుంది. బట్టలు వేస్తుంది. వంట చేసి వడ్డించి తన్ను బడికి పంపించేదాకా అమ్మకు ఒకటే హడావుడి. అన్నీ గుర్తుతెచ్చుకుంటోంది సుభాషిణి.**

"మీకు జ్వరం వస్తే మీ పక్కప కూచుని రాత్రిళ్ళు నిద్ర మేల్కొన్నాడా?"

"లేనే లేదు సార్"

"మీరు బయటకెళ్తే మీరొచ్చేదాకా మీకోసం ఎదురు చూస్తూ మీ నాన్న మీకెప్పుడైనా కనిపించాడా?"

"అయ్యో, లేదే..."

"సరే, మీ జవాబులన్నీ నిజమైనవే! అయితే ఈ పనులన్నీ మీకు చేసి పెడుతున్నది ఎవర్రా?" పిల్లల ముఖాలను ప్రేమగా చూపులుతో స్పర్శిస్తూ అడిగాడాయన.

"అమ్మే! మా అమ్మే" అంటూ గది మ్రోగేట్టు పిల్లలంతా గట్టిగా అరిచినారు.

"మా నాన్న అసలు ఇంట్లోనే ఉండడు సార్" అని కంప్లయింట్ చేసింది ఓ అమ్మాయి.

"మా పనీ, ఇంటిపనీ, అంతా మా అమ్మే చేస్తుంది సార్! ఇంటిపని కాగానే తోట దగ్గరకు వెళ్తుంది సార్" అన్నాడు ఓ అబ్బాయి.

సుభాషిణికైతే తన ఇల్లే గుర్తుకొస్తోంది. తన అమ్మే గుర్తుకొస్తోంది. పొద్దున, బాగా తెల్లవారకముందే నిద్రలేస్తుంది అమ్మ. పాలు పితుకుతుంది. ఇల్లంతా కసువులు ఊడుస్తుంది అంట్లన్నీ తోముతుంది. ఇల్లంతా సర్దుతుంది. కాఫీలు చేసి ఇస్తుంది. నాన్న బయట వసారాలో కూచుని అన్నిటికీ ఆర్డర్లు వేస్తుంటాడు. తాగిన కాఫీగ్లాసును కూడా పక్కనపెట్టడు. తనకూ తమ్ముడికి స్నానాలు చేయిస్తుంది. బట్టలు వేస్తుంది. వంట చేసి వడ్డించి తన్ను బడికి పంపించేదాకా అమ్మకు ఒకటే హడావుడి. అన్నీ గుర్తుతెచ్చుకుంటోంది సుభాషిణి.

"మీకు ఎన్నెన్నో పనులు చేసిపెట్టే అమ్మంటే మీకందరికీ ఇష్టమే గదా, మాతృభాష అంటే ఎంత ఇష్టమో తల్లి అంటే కూడా అంతే ఇష్టం ఉండాలి.'' ప్రభాకరం పిల్లల్ని ప్రశ్నిస్తున్నాడు.

"అమ్మంటే ఎవరికి ఇష్టం ఉండదు?'' ఆలోచనల్లోంచి బయట పడుతూ గట్టిగా అనేసింది సుభాషిణి

పిల్లలంతా 'అమ్మంటే మాకిష్టం' అన్నారు గట్టిగానే.

"రవీ, నువ్వు లేచి నిలబడు" అన్నాడు ప్రభాకరం.

రవి లేచి నిలబడినాడు... తన్ను పేరు పెట్టి పిల్చినందుకు సంబరపడిపోయినాడు రవి. సుశీల మేడం అయితే ఎప్పుడూ 'రేయ్, వోయ్' అని పిలుస్తుందే గాని పేరు పెట్టి పిలవదు. కోపం వచ్చినప్పుడైతే గాడిదా, వెధవా, ఫూల్ అంటూ ఒకటే తిట్లు. అవి చాలక బెత్తాలతో దెబ్బలు. ఈ సార్ ప్రేమగా పేరుతో పిలుస్తున్నాడు. చేతిలో బెత్తమే లేదు. రవికి హాయి అనిపించింది.

ప్రభాకరం రవి దగ్గరగా వచ్చి "రవీ! నువ్వు అన్నం దేంట్లో తింటావ్" అనడిగాడు.

"కంచంలో సార్"

"తిన్న తర్వాత ఏం చేస్తావ్"

ఇదేమిటి సార్ ఇలాంటి ప్రశ్నలు వేస్తున్నాడనుకుంటూ, "చేయి కడుక్కుంటాను సార్" అన్నాడు.

"ఆ తర్వాత"

"మూతి తుడుచుకుంటాను సార్"

"ఆ తర్వాత"

"కంచం ముందునుంచీ లేచి వస్తాను"

''అయితే నీ కంచం ఎవరు కడుగుతారు?"

"మా అమ్మ కడుగుతుంది సార్"

"సరే! నువ్వు కూచో" అని, "భారతీ! నువ్వు లేచి నిల్చో" అంటూ ఆ పిల్ల దగ్గరకు నడిచాడు.

"భారతీ! నువ్వు అన్నం తిన్న తర్వాత ఏం చేస్తావ్" అనడిగాడు.

"చేతులు కడుక్కుంటాను"

"అది సరే, ఆ తర్వాత"

"నేను తిన్న కంచం కడిగి బోర్లిస్తాను" అంది చాలా సహజంగా.

"ఇప్పుడు చెప్పండి! రవి చేసిన పని సరైనదా? భారతి చేసిన పని సరైనదా' అని ప్రభాకరం వేసిన ప్రశ్నకు " భారతి చేసిన పనే సరైంది సార్" అన్నారు చాలా మంది పిల్లలు. కొంతమంది మగపిల్లలకు ఇది నచ్చినట్లు లేదు. మౌనంగా ఉండిపోయారు.

"మగపిల్లలందరూ తమ కంచాల్ని తాము కడగరు. ఆడపిల్లలయితే తాము తిన్నకంచాల్ని తామే శుభ్రంగా కడిగేస్తారు అవునా?" తేల్చి చెప్పాడు ప్రభాకరం.

"అవును సార్" అన్నారు ఆడపిల్లలు మరీ గట్టిగా.

"ఇందాక మీరంతా మీ అమ్మ చేసే పనులు మీ కిష్టం అన్నారు కదా! మరి మీ అమ్మ కంచాలు కడిగే పనిని మీరెందుకు చేయకూడదు?"

మగపిల్లలు గుసగుసలు పోతున్నారు. ఉపాధ్యాయుడు చెప్పే సంగతులు కొత్తగా అనిపిస్తున్నాయి వాళ్ళకు.

"అవును సార్"

''తాము తిన్న కంచాల్ని తావే కడుక్కోవటం మంచి పని అని మీరు ఒప్పుకుంటారా, చెప్పండి"

"ఒప్పుకుంటాం సార్" మగపిల్లలు గొంతు కలిపారు.

"అయితే రేప ట్నుంచి మీ కంచాలు కడిగే పని మీరే చేయాలి. అలా అయితేనే మీ అమ్మంటే మీకిష్టం."

"చేస్తాం సార్"

"నిజంగా"

"నిజంగా సార్"

"అంతే కాదు. మీ అమ్మ చేసే పనులన్నీ మీరు కూడా చేయటం అలవాటు చేసుకోవాలి. మీ అమ్మ పట్ల మీకు గల ప్రేమను ప్రకటించుకోవాలి"

''అలాగే సార్'' అన్నాడు మగపిల్లలందరూ

అమ్మచేసే పనులన్నీ ఎవరు చేస్తారో వాళ్ళే మంచి పిల్లలు! వాళ్ళే గొప్పవాళ్ళు. అప్పుడు మీ అమ్మ మిమ్మల్ని మరింత ప్రేమిస్తుంది. ఆడపిల్లలు తల్లి చేసే పనులన్నీ చేస్తారు గాబట్టి ఆడపిల్లలే మీ కంటే మంచి వాళ్ళు" అంటూ నచ్చచెప్పే ధోరణిలో మాట్లాడుతున్నాడు ప్రభాకరం.

ఆ చిన్న వయసులోనే మగపిల్లల అహం దెబ్బతిన్నదేమో, "లేదు సార్, మేము కూడా మంచి వాళ్ళమే"అన్నారు.

"అయితే మీరు కూడా ఆడపిల్లలు చేసే పనులన్నీ చేసి మీ మంచితనం నిరూపించుకోవాలి. చేస్తారా మరి?"

"చేస్తాం సార్".

"అయితే వినండి! ఇప్పటి నుండీ మీరు, మీ పనులకు ఇంట్లో ఆడవాళ్ళ మీద ఆధారపడకూడదు. మీ పనులన్నీ మీరే చేసుకోవాలి. మీ పురువులు మీరే పరచుకోవాలి. నిద్రలేవగానే మీరే చుట్టి పెట్టాలి. పొద్దునే పరక తీసుకొని, ఇల్లంతా కసువులు ఊడ్చాలి."

మగపిల్లలకు కసువు ఊడ్చటం మింగుడు పడినట్లు లేదు. మౌనంగా ఉండిపోయారు. ఆడపిల్లలు కిలకిలా నవ్వేస్తున్నారు.

"ఏం ఆ పని తప్పా? ఇంటిపనిలో ఆడవని, మగవని అని వేర్వేరుగా చూడకూడదు. ఇంతకాలమూ ఆడవాళ్ళే పరకపట్టి కసవు వూడ్చటం చూసి చూసి ఇది ఆడపని అని అనుకుని ఉంటారు. ఇంటిని శుభ్రపరచుకోవటం అనేది అందరి పని! మీ తల్లి చేసే పనులన్నీ మీకిష్టమే అన్నారు కదా! అమ్మ చేసే ఈ పనిని మీరెందుకు చెయ్యకూడదు"

**ఆడపిల్లలాగే మీరు కూడా ఇంటిపనిలో భాగస్వాములు కావాలి. అంట్లుతోమటం నేర్చుకోవాలి. అన్నం చేయటం నేర్చుకోవాలి. బట్టలుతకటం అలవాటు చేసుకోవాలి. అన్ని పనుల్లోనూ, మీ తల్లికి సాయంగా ఉండి ఆమె మెప్పుపొందాలి. మీ పనుల భారాన్ని మీ అమ్మ మీదో, మీ అక్కమీదో, మీ చెల్లిమీదో వేయకూడదు. అప్పుడే మీరు సంస్కారవంతమైన పిల్లలౌతారు." ఇలా ప్రభాకరం చెబుతుంటే పిల్లల మనసుల్లో కొత్త తలుపులు తెరుచుకుంటున్నాయి.**

"చేస్తాం సార్, రేపట్నుంచీ ఇంట్లో కసువు మేమే వూడుస్తాం'' అన్నారు మగపిల్లలు.

"వెరీగుడ్! చాలా మంచిపిల్లలవుతారు మీరు. ఆడపిల్లలాగే మీరు కూడా ఇంటిపనిలో భాగస్వాములు కావాలి. అంట్లుతోమటం నేర్చుకోవాలి. అన్నం చేయటం నేర్చుకోవాలి. బట్టలుతకటం అలవాటు చేసుకోవాలి. అన్ని పనుల్లోనూ, మీ తల్లికి సాయంగా ఉండి ఆమె మెప్పుపొందాలి. మీ పనుల భారాన్ని మీ అమ్మ మీదో, మీ అక్కమీదో, మీ చెల్లిమీదో వేయకూడదు. అప్పుడే మీరు సంస్కారవంతమైన పిల్లలౌతారు." ఇలా ప్రభాకరం చెబుతుంటే పిల్లల మనసుల్లో కొత్త తలుపులు తెరుచుకుంటున్నాయి.

"అన్ని పనులూ ఇక మేమే చేస్తాం సార్" అన్నారు మగపిల్లలంతా.

"ఇలా చేస్తే మిమ్మల్ని మీ తల్లి మరింత బాగా ప్రేమిస్తుంది. ఆడపిల్లలు కూడా మిమ్మల్ని గౌరవంగా చూస్తారు. అంతేకాదు, మీరు కూడా ఆడపిల్లల్ని తక్కువ చూపు చూడకుండా సమానంగా చూస్తారు". అంటుండగా, పిరియడ్ పూర్తయినట్లు బెల్లుకొట్టిన శబ్దం వినిపించింది.

''రేపు మళ్ళీ వస్తాను, మరిన్ని విషయాలు మాట్లాడుకుందాం! ఇది కూడా పాఠమే సుమా!" అని చిరునవ్వుతో పిల్లల్ని పలకరిస్తూ గది నుండి బయటకు నడిచాడు ప్రభాకరం.

**– ఎ.సి.టి.ఎఫ్. మహాసభల సావనీర్, 2004**

# లైంగిక దోపిడీకి లైసెన్సులిస్తారా?

## లైంగిక దోపిడీని వ్యాపార వస్తువుగా మార్చుతున్న సరళీకరణ విధానాలు

- మాలినీ భట్టాచార్య

**వ్యభిచారంలో ఉన్న ఏ మహిళైనా తాను స్వచ్ఛందంగానే పూర్తి సమ్మతంతోనే ఈ వృత్తి చేస్తున్నాననీ, వేరే అవకాశాలు వచ్చినా సరే, తానీ వృత్తిలోనే కొనసాగుతానని అనేది నిజమే. వాటిని వాస్తవాలు అనుకోవడం తప్పు. దీని వెనుక కారణాలు ఏంటి? వారికి వచ్చిన ఇతర అవకాశాలు ఏంటి? అనేవి తెలుసుకోవాలి. వీరిలో ఎక్కువ శాతం వారి చిన్నప్పుడే వారికి తెలియకుండా ఎత్తుకు వచ్చి ఈ వృత్తిలోకి దించడం అనో లేక ఎక్కువ శాతం ఆర్థిక అవసరాలనీ, నిరుద్యోగమో, కుటుంబ అవసరాల కోసమో లేక గృహ హింస వలనో జరిగిందని మనకు అర్థమవుతుంది. వాణిజ్య సెక్స్ ఇద్దరు వ్యక్తుల మధ్య స్వేచ్ఛగా జరగడం చాలా అరుదు. ఈ వృత్తిలోకి దిగడం అంటేనే ఒక పెద్ద అగాధంలోకి, అంతర్జాతీయ వలలోకి చిక్కుకున్నట్లే.**

నయా ఉదారవాద విధానాల నేపథ్యంలో ద్రవ్యపెట్టుబడి లాభార్జనకు అనేక కొత్త కొత్త మార్గాలను వెతుకుతోంది. దీని వలన అంతర్జాతీయ విపణిలో గతంలో ఎన్నడూ లేని విధంగా ప్రజా జీవన భాగాలు కూడ వినిమయ సరుకులుగా మారుతున్నాయి. మొదట పెట్టుబడిదారీ వ్యవస్థలో కార్మికుల శ్రమ ఒక 'సరుకు'గా మార్చ బడింది. ఈ వ్యవస్థకి ముందున్న భూస్వామ్య వ్యవస్థలోని బంధనాల నుండి కార్మికులను విముక్తి చెయ్యాలనే మిషతో ఈ పని చేశారు. ఈ విముక్తి అనేది ఒక వ్యక్తికి బానిసగా కాకుండా, వ్యవస్థలో అంతర్భాగంగానే కార్మికుడ్ని బానిసను చేసింది. ఈ క్రమంలో పెట్టుబడిదారుడు తన లాభాన్ని పెంచుకోవడానికి కార్మికుడు శ్రమచేసిన కాలంలో కొన్ని గంటలకి కార్మికునికి తెలియకుండానే కూలి ఇవ్వకుండా ఎగ్గొడుతున్నాడు. ద్రవ్యపెట్టుబడి కంపెనీల స్థాయిని దాటి కార్పొరేట్ రూపం దాల్చింది. చిన్న చిన్న మదుపుదార్లను కార్పొరేట్ ప్రపంచంలోకి నెట్టింది. కార్పొరేట్ కనుగుణంగా చట్టాలను సవరిస్తున్నారు. ఈ క్రమంలో ఉద్యోగాల కోత సర్వసాధారణమైంది. శ్రమ విలువ తగ్గిపోయింది. కార్మికుల కుటుంబాల బ్రతుకే భారమయింది. గతంలో ఎన్నడూ లేని విధంగా కార్మికుల జీవన భాగాలను సరుకుగా అంగడిలో పెట్టడాన్ని న్యాయసమ్మతం చేస్తున్నది. ఇది ఘోరమైన దోపిడీ. 'వ్యభిచారం చట్టబద్ధం చేయాలని, ఆ పని చేసే మహిళలను సెక్స్ వర్కర్లుగా చూడాలని ఇటీవల జరిగిన ఒక ప్రచారం నయాఉదారవాద పోకడలకు అనుగుణంగానే ఉంది. జాతీయ మహిళా కమీషన్ ఛైర్‌పర్సన్ ఈ అభిప్రాయాన్ని బాహాటంగానే ప్రకటించింది.

**వ్యభిచారం చట్టబద్ధం చెయ్యాలనే వాదనలు:**

పెట్టుబడిదారీ వ్యవస్థ వ్యభిచారాన్ని అమ్ముకునే వ్యక్తి మరియు కొనుక్కొనే వ్యక్తి మధ్య వాణిజ్యపరమైన అంశంగానే చూస్తుంది. సెక్స్ శ్రమ చేసే మహిళ మైనారిటీ వయస్సు దాటిన మరియు ట్రాఫికింగ్ బాధితురాలు కానిపక్షంలో ఈ వ్యవహారాన్ని కార్మికులు స్వేచ్ఛగా తమ శ్రమను అమ్ముకున్న చందంగానే పరిగణిస్తుంది. 'ఈ వ్యవస్థలో శ్రామికులందరూ దోపిడీకి గురవుతూనే ఉంటారు. 'దోపిడీ' అనే ఒక్క చర్య మాత్రమే ఈ వ్యవహారాన్ని చట్ట వ్యతిరేకం చెయ్యలేదు. అసలు నయా ఉదారవాదం చెప్పేదేంటంటే - ప్రభుత్వం సెక్స్ వర్కర్‌లకు లైసెన్స్ లాంటివిచ్చి కొంత రక్షణ కల్పించాలి. కానీ మిగతా ఏ విషయాల్లోనూ తల దూర్చకూడదు. వ్యభిచార్ల వద్దకు విటులను తేవడం వారి ఆదాయంపై ఆధారపడి బతకడం వంటి చర్యలపై చట్టపరమైన ఆంక్షల్ని తొలగించాలి. ఈ చర్యల వల్ల వాణిజ్య సెక్స్ పట్ల మానసిక అభద్రత, అనైతికత తొలగిపోయి వారు ధైర్యంగా మసలే వాతావరణం కలుగు తుందని, వారిపై దాష్టీకం చేసే పోలీసులను మరియు వారిని చిన్నచూపు చూసి అణగద్రొక్కేవారిని ఎదిరించి నిలబడే సాధికారత కలుగుతుందనే వాదనలున్నాయి. అలాగే వారి వారి ఆరోగ్యసమస్యలు, వారి పిల్లల విద్యావసరాల గురించి మాట్లాడే ధైర్యం వస్తుందని వాదిస్తున్నారు. వాణిజ్య సెక్స్‌ను వినోద పరిశ్రమలో భాగంగా చూడాలని ప్రతిపాదిస్తున్నారు. దీనిలో పునరుత్పత్తి జరిగే శ్రమని వినియోగిస్తారు. అనగా దీనిలో భౌతికంగా ఉత్పత్తి లేకపోయినప్పటికి తిరిగి పనికి వెళ్ళేందుకు ఉత్సాహాన్ని, శక్తిని కలిగించడానికి తోడపడుతుందని చెప్తున్నారు. మహిళ కొంత సమయం అయ్యాక వెనకకు పోయి మరల కొత్త శక్తితో పనిని కొనసాగిస్తుంది.

**అంగీకారంతో వ్యభిచార వృత్తిని ఎంచుకోవడం:**

వ్యభిచారంలో ఉన్న ఏ మహిళైనా తాను స్వచ్ఛందంగానే పూర్తి సమ్మతంతోనే ఈ వృత్తి చేస్తున్నాననీ, వేరే అవకాశాలు వచ్చినా సరే, తానీ వృత్తిలోనే కొనసాగుతానని అనేది నిజమే. వాటిని వాస్తవాలు అనుకోవడం తప్పు. దీని వెనుక కారణాలు ఏంటి? వారికి వచ్చిన ఇతర అవకాశాలు ఏంటి? అనేవి తెలుసుకోవాలి. వీరిలో ఎక్కువ శాతం వారి చిన్నప్పుడే వారికి తెలియకుండా ఎత్తుకు వచ్చి ఈ వృత్తిలోకి దించడం అనో లేక ఎక్కువ శాతం ఆర్థిక అవసరాలనీ, నిరుద్యోగమో, కుటుంబ అవసరాల కోసమో లేక గృహ హింస వలనో జరిగిందని మనకు అర్థమవుతుంది. వాణిజ్య సెక్స్ ఇద్దరు వ్యక్తుల మధ్య స్వేచ్ఛగా జరగడం చాలా అరుదు. ఈ వృత్తిలోకి దిగడం అంటేనే ఒక పెద్ద అగాధంలోకి, అంతర్జాతీయ వలలోకి చిక్కుకున్నట్లే. దానిలోంచి బయట పడాలన్నా, ఆ వల నుండి బయటపడనివ్వరు. ఇందులో చిక్కుకున్న స్త్రీ పరిస్థితి ఎలా ఉంటుందంటే ఒక యంత్రంలో పళ్ళ చక్రంలో పన్నులా వుంటుంది. ఈ పన్ను వేరే చక్రంలోని రెండు

పళ్ళ మధ్య ఎల్లప్పుడూ చిక్కుకొని యజమానికి మిలియన్ల డాలర్ల లాభాలనందిస్తుంది. ఈ కూపంలో చిక్కుకున్న స్త్రీ బ్రోతల్ యజమానులకు, హోటల్ వాళ్ళకు, తార్పుడుదార్లకు, మద్యం వ్యాపారం చేసే వారికీ కోటాను కోట్ల లాభాలు సంపాదించి పెడుతుంది. వ్యభిచారం అనేది స్వచ్ఛందంగా ఇద్దరు వ్యక్తుల మధ్య జరిగే ఒప్పందం అని వాదించేవారు దీనిపై కోట్లు లాభాలు కోసంవ్యాపారం చెయ్యడాన్ని మాత్రం గమనించ నిరాకరిస్తున్నది.

**పెట్టుబడి వ్యవస్థలో ఇతర శ్రమలకన్నా హీనమైన శ్రమ కాదనే వాదన:**

వాణిజ్య సెక్స్ ఇతర శ్రమల కన్నా హీనమైన శ్రమ కాదనీ వాదించేవారు ఒక విషయాన్ని గమనించాలి. ఈ వృత్తిలోని స్త్రీ తన యొక్క వ్యక్తిగత ఆనందాన్ని పక్కన పెట్టి ఇతరులను సంతోషపెట్టాలి. 'తన నుంచి తాను దూరమవటం' అంటే ఇదే. ఇది అత్యంత తీవ్రమైన పరిస్థితి. అందుకే కార్ల్‌మార్క్స్ 'శ్రామికుని దిగజారుడుతనం యొక్క ప్రత్యేక వ్యక్తీకరణే వ్యభిచారం' అని అన్నాడు.

ఆ వృత్తిలోని స్త్రీ యొక్క స్వేచ్ఛకంటె అందులో దాగి ఉన్న 'స్వేచ్ఛాలేమితనం' ఎంత ఘోరంగా ఉంటుందో వివరించాడు. ఇదే సందర్భంలో వ్యభిచారాన్ని 'నాశనమైన శ్రామికులు' జాబితాలో చేర్చాడు. ఇలా ఎందుకు చేశాడో పరిశీలిద్దాం. ఉపాధి అవకాశాలు తక్కువగా ఉండటం చేత లక్షలాది శ్రామికులు ఉపాధికోసం వారిలో వారు తీవ్రమైన పోటీ నెదుర్కొంటున్నారు. దీని వలన వీరికి వేతనం మరింతగా తగ్గించేశారు. యజమానులు శ్రామికులను మరింత అణగద్రొక్కేశారు, మరింత అభద్రతలోకి బానినత్వంలోకి నెట్టివేసే అవకాశం యజమానులకి దొరుకుతుంది. దీనివల్ల శ్రామికులు తమని తాము పూర్తిగా కోల్పోతారు. జీవం లేని మరబొమ్మల్లా అయిపోతారు. ఈ దశలో శ్రామికుని ప్రతిఘటనా శక్తి పూర్తిగా నాశనమవుతుంది. చివరికి హీనాతిహీనమైన శ్రమకి కూడా సిద్ధపడతాడని మార్క్స్ విశ్లేషణ. ఫ్రాన్స్‌లోని కార్మికులు, వారి భార్యల మరియు కూతుర్ల వ్యభిచారాన్ని 9వ పనిగంటగా చెప్పటాన్ని మార్క్స్ ఇక్కడ ఉదహరిస్తాడు. 9వ పని గంట అంటే ఇక్కడ శ్రామిక మహిళ తన శక్తికి మించి శ్రమ చేస్తే, చివరిగా యజమాని కామానికి దాసోహమనడం, ఈ స్థితిలో స్త్రీకి తన యజమానిని మార్చుకునే స్వేచ్ఛ ఉండదు. ప్రతిఫలాన్ని ధైర్యంగా అడిగే హక్కుండదు. ఇదే దీని లోని దోపిడీ ముఖ్యలక్షణం. ఈ అంశాల బట్టే వ్యభిచారం అన్ని రకాల శ్రమల్లోకి అతిహీనమైనదిగా గుర్తించడమైనది. ఇది స్త్రీని వేలెత్తి చూపించడానికి కాదు. ఈ దోపిడీ విధానం వలన ఆ స్త్రీలు, వారి కుటుంబాలు ఎంత దారుణంగా ఛిద్రమవుతున్నాయో తెలపడానికి మాత్రమే. అదే సమయంలో ఈ కార్మికుల్ని నాశనం చేసి వారి శ్రమవల్ల ఉత్పన్నమయ్యే లాభాల్లో ఈ వ్యాపారాలు వర్ధిల్లుతున్నాయి.

ఫ్రాన్స్‌లోని కార్మికులు, వారి భార్యల మరియు కూతుర్ల వ్యభిచారాన్ని 9వ పనిగంటగా చెప్పటాన్ని మార్క్స్ ఇక్కడ ఉదహరిస్తాడు. 9వ పని గంట అంటే ఇక్కడ శ్రామిక మహిళ తన శక్తికి మించి శ్రమ చేస్తే, చివరిగా యజమాని కామానికి దాసోహమనడం, ఈ స్థితిలో స్త్రీకి తన యజమానిని మార్చుకునే స్వేచ్ఛ ఉండదు. ప్రతిఫలాన్ని ధైర్యంగా అడిగే హక్కుండదు. ఇదే దీని లోని దోపిడీ ముఖ్యలక్షణం. ఈ అంశాల బట్టే వ్యభిచారం అన్ని రకాల శ్రమల్లోకి అతిహీనమైనదిగా గుర్తించడమైనది.

**డబ్బుకోసం చేసే వ్యభిచారం పెట్టుబడి వర్గాల నిర్దిష్ట దోపిడీ రూపం కాదనే వాదనలు:**

వ్యభిచారం అతి పురాతనమైన వృత్తి. ఫ్రెడరిక్ ఎంగెల్స్ నిర్వచించినట్లుగా పురుషాధిక్య సమాజం మరియు ఏకపత్నీ/సతీ విధానాలు ఈ వృత్తి సమాతరంగా ఆచరణలో ఉండేవి. కాబట్టి ఈ వృత్తి పుట్టు పూర్వోత్తరాలు తెలుసుకోవడానికి పురుషాధిక్య సమాజం మరియు ఏకపత్నీ/ సతీ విధానాలు లోతుగా పరిశీలించడం అవసరం. వివాహ బంధంతో ఒక స్త్రీకి దగ్గరయినట్లే, ఇతర సంబంధాలు కూడ ఒకే వ్యక్తితో ఉండేవి. వ్యభిచారం, ఏకపత్నీ/ సతీ సంబంధాలు ఆనాటి సమాజ పరిస్థితుల్లో విడదీయలేని భిన్న ధృవాలని ఏంగిల్స్ తెలిపాడు. నాడు కొన్ని ప్రత్యేక స్థాయిల్లోని స్త్రీలకు కల్పించబడిన 'ప్రత్యేక హోదా' విభిన్న నర్తకీమణులను, విద్యావేత్తలను, నాగరిక స్త్రీలను తోడుగా తెచ్చుకోవడం ఇవన్నీకూడా స్త్రీకి సంబంధం. ఒక మగవాడితోనే ఉండాలనే విధానానికి పార్శ్వం అంతేకానీ, ఆ స్త్రీలకు స్వేచ్ఛ కల్పించడం కాదు. వేదకాలం తర్వాత సుమారు 2000 సంవత్సరాల కాలంలో మన భారతదేశంలో కూడా ఏకపత్నీ ఆచారం ఉన్న కుటుంబాలలో మగవారు వారి శారీరక సుఖాల కోసం వారి భార్యలు కాకుండా ఇతర స్త్రీలను ఆశ్రయించేవారు. దీనివలన సుఖాలనందించిన స్త్రీలకు స్వేచ్ఛాదికారత వచ్చాయన్నమాట అవాస్తవం. 'అంబాపాలీ' వంటి వాళ్ళు అతి కొద్దిమంది ఆస్తులు సంపాదించి ఉండవచ్చు, కొంత విలాసం అనుభవించి ఉండవచ్చు, వారి స్థాయిని బట్టి రాజరికానికి సుంకం చెల్లించి ఉండవచ్చు. కాని, బుద్ధుడి కాలం నాటి 'కుంభదాసి' లాంటి వారు సమాజపు అట్టడుగు స్థాయిలో ఉండి హీనమైన బ్రతుకు బ్రతికేవారు. వారి శ్రమ, వారి శరీరం ఎల్లప్పుడూ వారి యజమాని ఆధీనంలోనే ఉండేవి.

భూస్వామ్య కాలంలో నాటి నాయకులు ఉంచుకునే ఉంపుడుగత్తెలు, దేవదాసీలు, ఆస్థాన నాట్యగత్తెలు బాగా సంపాదించి నప్పటికీ కఠినమైన వారి కులాచారాలకు లోబడే ఉండేవారు. వారి ప్రజ్ఞాపాటవాలు ఉపయోగించి ప్రజలకు వినోదాన్ని అందించేవారు. వారి సామాజిక తరగతులు అప్పుడు, ఇప్పుడు అలాగే ఉన్నాయి. వీరి ఇళ్ళల్లో పుట్టే అమ్మాయిల్ని పాలకులకు ఆనందాన్ని, వినోదాన్ని అందించడం కోసం ప్రత్యేకంగా పెంచేవారు. అలాంటి పరిస్థితుల్లో వృత్తి ఎంపికకు ఆస్కారమే లేదు. నాటి నుండీ డబ్బుకోసం పడుపు వృత్తి చేసి కొంతమంది సంపన్నులయినప్పటికీ, ఈ వృత్తిలోని వారందరూ ఏదో ఒక పద్ధతిలో భూస్వాముల లేదా యజమానుల దోపిడీకి గురవుతూనే ఉన్నారు.

**చట్టబద్ధత కల్పించినంత మాత్రాన వ్యభిచారంపై మచ్చ తొలగిపోదు:**

బూర్జువా సమాజం మోపే లేనిపోని నిందలవల్ల వ్యభిచార్లపై మచ్చరాలేదు.

నిజానికి, బూర్జువా సమాజంలో ప్రాధమి కంగా వున్న వైరుధ్యం వల్ల మాత్రమే ఈ మచ్చ ఏర్పడింది. పితృస్వామ్యవ్యవస్థ యొక్క ప్రధాన లక్షణం ఏంటంటే దీనిలో ఏకపత్నీ విధానం ఉంటుంది. మగవాడు ఎంతమంది స్త్రీలతోనైనా ఉండవచ్చు. కానీ అలా చేసే స్త్రీల పట్ల సమాజం తీవ్ర అసహనం ప్రదర్శిస్తుంది. స్వేచ్ఛ, సమా నత్వంతో, మనుషుల మధ్య ఒప్పం దాన్ని, సంబంధాన్నీ అనుమతించే పెట్టుబడిదారీ వ్యవస్థలో పితృస్వామ్యం నైతికంగా ఇమడలేదు. కాబట్టి, పితృ స్వామ్యం ఉన్నంత వరకూ పెట్టుబడిదారీ వ్యవస్థలో సరుకుల ఉత్పత్తిలాగే వ్యభిచార వృత్తి కూడ కొనసాగుతుంది. ఈ వృత్తిలో ఉండే మహిళలది 'రహస్యతరగతి' గా కమ్యూనిస్టు మేనిఫెస్టోలో పేర్కొన్నారు. ఇది బూర్జువా సమాజం యొక్క ఒక స్వార్థం. వేరొక పక్క బూర్జువా సమాజం ప్రేమ వివాహాల్ని సైతం మానవ హక్కుగా గుర్తిస్తుంది. కానీ, కట్న కానుకల వంటి ఆర్థిక అంశాలకి లోబడి నడుచుకుంటుంది. స్వేచ్ఛ, సమానత్వం కలిగిన మనుషుల మధ్య వివాహం లాగ వ్యభిచారం బూర్జువా సమాజంలోని ఏకపత్నీ కుటుంబాలలోని మగాళ్ళ కామవాంఛకు తలొగ్గిన అసంఖ్యాక మహిళల దుస్థితి వర్ణనాతీతం. బూర్జువా కుటుంబంలో భార్యకు స్వేచ్ఛ లేదు. వ్యభిచార వృత్తిలో ఉన్న స్త్రీ స్వేచ్ఛగా ఉండలేదు.

సమాజంపై బూర్జువా వ్యవస్థ తీవ్రమైన అనైతిక ప్రభావాలు కలుగజేస్తుందని ఎంగెల్స్ అంటాడు. ఇది వ్యభిచరిస్తున్న స్త్రీ అనైతికత వల్ల కాదు, కాని ఆమె స్వేచ్ఛగా అప్పనంగా లభించాలన్న మగాళ్ళ కోరిక వ్యవస్థలో అజ్ఞానంగా ఉన్న పై అంశాన్ని గమనిస్తే, చట్టబద్ధత అనేది మహిళల్ని విశృంఖలంగా దోచుకునే వారి కోసమేనని అర్ధమవుతుంది.

బూర్జువా వ్యవస్థ ఆవిర్భవించిన లగాయితూ, అన్ని సరుకుల ఉత్పత్తి లాగే, తార్పుడు మగాళ్ళ వల్ల కాక పతీ కుటుంబాలతో పాటు వ్యభిచారం కూడా కొనసాగుతుంది.

**డబ్బుకోసం సెక్స్‌కు అంగీకరించిన ఇద్దరు పెద్దవాళ్ళ మధ్య వ్యవహారం ఇండియాలో చట్టరీత్యా నేరం కాదు:**

మహిళల్ని బలవంతంగా వ్యభిచారంలోకి దింపడం, వారి సంపాదనపై ఆధారపడడం, మహిళల ట్రాఫికింగ్ చట్టరీత్యా నేరం. కాని, ఇన్నర్ ట్రాఫికింగ్ ప్రివెన్షన్ యాక్ట్ 1956లో జరిగిన పెద్దలోపం ఏమిటంటే, ట్రాఫికింగ్ అంటే ఏమిటో నిర్వచించబడింది. ఐటిపిఏ లోని సెక్షన్ 2(ఎఫ్) లో వ్యభిచారం అంటే "లైంగిక దోపిడీ లేక వాణిజ్యపరమైన అవసరాలకోసం మనుషుల్ని తప్పుగా వినియోగించడం లేదా అవమానించడం". దీన్ని బట్టి వ్యభిచారిని వాణిజ్యపరమైన లాభాల కోసం లైంగిక దోపిడీకి గురయిన వ్యక్తి' అని నిర్వచించ వచ్చు. ఐటిపిఏ ప్రధానంగా బ్రోతల్ ఆధారిత వ్యభిచారం (వ్యభిచార గృహాల)పై కేంద్రీకరించింది. ఎందుకంటే ట్రాఫికింగ్ లో మహిళల్ని చివరికి అక్కడికే చేరుస్తారు. ఎన్నో లోపాలున్నప్పటికీ, ట్రాఫికింగ్‌కి వ్యభిచారానికి మధ్యనున్న విడదీయలేని లింక్‌ని ఐటిపిఏ గుర్తిస్తుంది.

**క్రిమినల్ న్యాయ సవరణ చట్టం 2013 ఏరియా ట్రాఫికింగ్ :**

క్రిమినల్ న్యాయ సవరణ చట్టం 2013లో భారతీయ ట్రాఫికింగ్‌ని నిర్వచించి భారతీయ శిక్షాస్మృతిలోని సెక్షన్ 370లో పొందుపరిచారు. ట్రాఫికింగ్‌కి సమగ్ర నిర్వచనం ఇవ్వబడింది. దీని ప్రకారం ట్రాఫికింగ్ చివరిదశయైన వ్యభిచారం మరియు లైంగిక దోపిడీ యొక్క ఇతర రూపాలను కూడ నిర్వచనంలో చేర్చారు. ఆ తర్వాత వివిధ రకాల ఒత్తిడులకు లొంగి ఇతరుల వ్యభిచారాన్ని చట్టం నుండి తొలగించారు. దీని ప్రభావం ఎలా ఉంటుందో పరిశీలించాలి. అయితే ఒక విషయం మాత్రం స్పష్టమవుతోంది. ఏమిటంటే, ట్రాఫికింగ్‌కి, వ్యభిచారానికి మధ్య అంతరాన్ని పెంచుతున్నారు; వ్యభిచారానికి, బల ప్రయోగంతో చేయించే చర్యల్తో లింక్ తెగ్గొట్టి, వ్యభిచారమనేది నేరం కాదనే అభిప్రాయాన్ని ధైర్యంగా ప్రజల్లో పెడుతున్నారు. ట్రాఫికింగ్ యొక్క చివరి చర్యగా వ్యభిచారం నేరమేనని నిర్వచించినపుడు కూడా ఐటిపిఏ ట్రాఫికింగ్‌ని నిరోధించలేకపోయింది. ట్రాఫికర్లని శిక్షించలేకపోయింది. ఎందుకంటే దోపిడీకి గురవుతున్న మహిళల్ని, పిల్లల్ని రక్షించడం కంటె ఈ వ్యవస్థ ఇలాంటి దోషుల నుండి సమాజంలో జరిగే అనర్థాలకే ఎక్కువ ప్రాధాన్యత నిచ్చింది. బాధితులు, నేరస్థుల మధ్య తేడాని గుర్తించని ఈ సమాజంలో ప్రభుత్వ యంత్రాంగం మరియు పోలీసులు అమాయక బాధితుల్ని క్రూరంగా వేధించడం మనం నిత్యం చూసే దృశ్యం.

ఒక వ్యక్తిని చట్ట విరుద్ధంగా ఒక ప్రాంతం నుండి వేరొక ప్రాంతానికి చేరవేయడం తోనే ట్రాఫికింగ్ పూర్తవదు. ఎత్తుకెళ్ళిన వ్యక్తిని బలవంతంగా లైంగిక వ్యభిచారంలోకి నెట్టడం కూడ లాభాలు పొందే వ్యక్తుల మధ్య లింక్‌లు ఇంత స్పష్టంగా కనిపిస్తుండగా, వీరిని శిక్షించడంలో ఐటిపిఏ వైఫల్యాన్ని ఏవిధంగా అర్థం చేసుకోవాలి? వ్యవస్థలో భాగంగా ఈ చట్టాలు, యంత్రాంగం సాగే దిశ దోపిడీకి గురయ్యే వారిపై దోపిడీ చేసేవారి నియంత్రణ పెంచేదిగా ఉంది.

**సంరక్షణ మాత్రమే మరియు గృహశ్రమలాగ లైంగిక శ్రమ సాంఘిక పునరుత్పత్తి పనిగా ఉపయోగకరమా?**

మార్క్సిస్ట్ దృక్పధాన్ని ఉపయోగించి వ్యభిచారాన్ని 'పునరుత్పాదక శ్రమ'గా అభివర్ణించడమంటే, దీన్ని నిరాశాజనకంగా శృంగారపరం చేస్తున్నారన్న మాట. ఉపయోగపు విలువ మరియు

**ట్రాఫికింగ్‌కి, వ్యభిచారానికి మధ్య అంతరాన్ని పెంచుతున్నారు: వ్యభిచారానికి, బలప్రయోగంతో చేయించే చర్యల్తో లింక్ తెగ్గొట్టి, వ్యభిచారమనేది నేరం కాదనే అభిప్రాయాన్ని ధైర్యంగా ప్రజల్లో పెడుతున్నారు. ట్రాఫికింగ్ యొక్క చివరి చర్యగా వ్యభిచారం నేరమేనని నిర్వచించినపుడు కూడా ఐటిపిఏ ట్రాఫికింగ్‌ని నిరోధించలేకపోయింది. ట్రాఫికర్లని శిక్షించలేకపోయింది. ఎందుకంటే దోపిడీకి గురవుతున్న మహిళల్ని, పిల్లల్ని రక్షించడం కంటె ఈ వ్యవస్థ ఇలాంటి దోషుల నుండి సమాజంలో జరిగే అనర్థాలకే ఎక్కువ ప్రాధాన్యత నిచ్చింది. బాధితులు, నేరస్థుల మధ్య తేడాని గుర్తించని ఈ సమాజంలో ప్రభుత్వ యంత్రాంగం మరియు పోలీసులు అమాయక బాధితుల్ని క్రూరంగా వేధించడం మనం నిత్యం చూసే దృశ్యం.**

మారకపు విలువల మధ్య తేడా దోపిడీకి గురయిన కార్మికుని స్థితికి అర్థం పడుతుందనీ మార్క్సిస్టు సిద్ధాంతం చెబుతుంది. కానీ సెక్స్ వ్యాపారాన్ని నడిపి లాభాలార్జించే వారే వారి ప్రయోజనాల కోసం లైంగిక శ్రమని 'ఉపయోగపడే శ్రమ' గా గొప్పగా అభివర్ణిస్తుంటారు. ఒక్కొక్కప్పుడు, లైంగిక శ్రమను 'వినోద పరిశ్రమ'లో భాగంగాను మరియు 'సృజనాత్మకత కలిగిన పని' గాను వర్ణిస్తుంటారు. కానీ, విటుని (క్లయింట్) ఆనందం కోసం తన ఇష్టాలను వదులుకొని బానిసలాగ ఈపని చెయ్యడానికి కాగితాలపై లేని ఒప్పందం చేసుకున్న మహిళ తనని తాను సంపూర్ణంగా దూరం చేసుకున్నట్టే లెక్క. వేతనాలు చెల్లిస్తున్నప్పటికీ 'సంరక్షణ శ్రమ', 'గృహశ్రమ' సేవారంగంలో అత్యల్పస్థాయిలో ఉంటాయి. ఏకపత్నీ కుటుంబాల్లో పైసా రాబడి లేకుండా మహిళలు చేసే ఈ పని వల్ల సమాజం ఎంతో ప్రయోజనం పొందుతుంది. కానీ ఈ పనికి కనీస గుర్తింపుని కూడ సమాజం ఇవ్వదు. ప్రభుత్వం కూడ ఇలాంటి పనిచేసే ఐసిడిఎస్ మరియు ఆశా వర్కర్లను కార్మికులుగా గుర్తించదు. వీరికి 'సాంఘిక వాలంటీర్లు' అని పేరు పెట్టింది. 'సంరక్షణపని','గృహపని' కోసం వ్యాపారాలు నిర్వహించేవారు ఈ ఉపాధి కోసం అధిక సంఖ్యలో దొరికే మహిళల్ని దోపిడీ చేసి లాభాలార్జిస్తారు. అలాగే బార్ డాన్సర్స్, నగ్న ప్రదర్శనలు నిర్వహించే వ్యాపారస్థులు కూడా అత్యంత పోటీతో గత్యంతరం లేక ఈ వృత్తిలోకి వచ్చిన మహిళల్ని ఘోరంగా దోపిడీ చేస్తుంటారు. ఇలాంటి పనిచేసే మహిళల స్థితిగతులు అత్యంత దయనీయంగా ఉంటాయి.

**సాంఘిక మరియు ఆర్థిక విభజన :**

ఈ వృత్తిలోని మహిళలు వారి వారి ఆర్థిక సామాజిక హోదాని బట్టి విభజితమై ఉంటారు. ఈ వ్యవస్థలో తాను పొందే ప్రయోజనం బట్టి తన హోదా ఉంటుంది. ఈ వృత్తిలో ఉండే, ఉన్నతస్థాయి మహిళ కూడా తనంత తాను బతకలేదు. తానుకూడా దళారుల, మధ్యవర్తులు, భవన యజమానులు, మద్యం మత్తుమందుల సరఫరాదారులు ,ట్రాఫికర్లు మొదలయిన వారిపై ఆధారపడవలసిందే. మేడమ్‌గా వృత్తిని నిర్వహించే ఆమె కొనసాగింపు అవసరమైన మహిళలను నిరంతరం వృత్తిలోకి దింపాలి. అట్టడుగునుండే చాలా ఎక్కువ. వారు బతకడానికి కావలసిన కనీస ఆదాయం కోసం ఎంత హీనమైనపనికైనా సిద్ధపడి ఉండే 'నాశనమైన కార్మిక' తరగతికి చెందుతారు. వారి వృత్తికి, వ్యాపారానికి చట్టబద్ధత ఇచ్చినంత మాత్రాన వారి జీవన స్థితిగతులు 'మెరుగు' పడవు.

**సులభమైన పని అనే భ్రమలు:**

వ్యభిచార వృత్తిలోకి చేరకుండా తమ ప్రాథమిక అవసరాలకు తగినంత సంపాదించుకునే అవకాశాలున్నప్పటికీ మహిళలు ఎక్కువ కష్టపడకుండా అధికమొత్తంలో సంపాదించవచ్చని ఈ వృత్తిలోకి ఆకర్షితులవుతున్నారనేది భ్రమే తప్ప వాస్తవం కాదు. పేదరికం ఆడవాళ్ళపరం చేసిన ప్రపంచీకరణ విధానాల నేపథ్యంలో కనీస ప్రాథమిక అవసరాలకోసం పడాల్సిన కష్టాన్ని పై వ్యాఖ్యలు తక్కువ అంచనా వేస్తున్నాయి. ఆసియా, ఆఫ్రికా ఖండాల్లో హీనమైన పనులకు మహిళా శ్రామికుల్ని హెచ్చుగా వినియోగిస్తున్నారని ఆర్థికవేత్తలు చెబుతున్నారు. దీనివల్ల వారి వేతనాలు కుదించేస్తున్నారు. మనదేశం లింగ ఆధారిత ఉపాధి సంక్షోభం ఎదుర్కొంటున్నదని, దీనివల్ల మహిళలు పెద్దఎత్తున ఇతర దేశాలకు తరలిపోతున్నారని ఒక అధ్యయనం తెలిపింది.

గ్రామీణ మరియు పట్టణ ప్రాంతాల్లో మహిళా శ్రామికుల శాతం తగ్గిపోతూ ఉన్నది. మహిళా శ్రామికుల్ని బలవంతంగా దోపిడీ చేసే పితృస్వామ్య దోపిడీ రూపాలు మళ్ళీ వస్తున్నాయని అధ్యయనంలో తేలింది. సరియైన పని 'పనికి తగిన వేతనం' కోసం కార్మికులు పోరాడుతున్నారు. సరియైన పని లేకపోవడం మరియు వేతనాల కుదింపు అమలవుతున్న నయా ఉదారవాదంలోనే ఇతరపనుల కంటె లైంగిక శ్రమ మేలు అన్న భ్రమలను ప్రచారం చేస్తాయి. పరోక్షంగా ఇలాంటి భ్రమల్ని ఈ వ్యవస్థే ప్రోత్సహిస్తుంది.

**ఏం చేయాలి?**

పితృస్వామ్య అవలక్షణాల్లో ఒకటైన సెక్స్ వ్యాపారం పెట్టుబడిదారీ వ్యవస్థలో క్రమబద్ధీకరించబడిన దోపిడీగా మారింది. దీన్ని అంతం చెయ్యాలంటే వ్యవస్థలో మార్పుతేవడమే మార్గం. అంతవరకూ ఆగలేం. కాబట్టి, వ్యవస్థలోని వైరుధ్యాలను పయోగించుకొని బాధితుల స్థితిగతుల్ని మెరుగుపరుచుకోవాలి. వ్యభిచార గృహాలను మూయించడం బార్ డాన్స్‌లు మరియు నగ్న ప్రదర్శనల నిషేధం, వ్యభిచార గృహాలకు విటులు పోకుండా నిరోధించడం వంటి వాటిపై చర్యలు తీసుకోవడం పెద్దగా ఫలితాలనివ్వలేదు. వీరి పిల్లల పట్ల వివక్షత. క్లయింట్ల (విటుల) వేధింపులు, పోలీసుల అకృత్యాలు ఆరోగ్యహక్కు వైద్య సదుపాయాలు, బిడ్డల చదువుల వంటి హక్కుల కోసం ఎక్కువగా ఈ వృత్తిలో కొనసాగుతున్న మహిళలు ఆందోళనకు గురవుతున్నారు. ఇలాంటి సమస్యలపై కొన్ని ఎన్‌జీవోలు పని చేస్తున్నాయి. వారికి మనం మద్దతు, సహకారాలనందించాలి.

ముఖ్యంగా కొంతమంది ఈ వృత్తి నుండి విముక్తి పొంది ప్రత్యామ్నాయ వృత్తి చేపట్టడానికి ముందుకొస్తారు. ఇలాంటి వారికి అన్ని విధాలా సహాయపడాలి. సెక్స్ వ్యాపారంలో చిక్కుకున్న వారితోబాటు ఎవరైతే ఆర్థికంగా వెనుకబడిన రంగాల్లో, ప్రాంతాల్లో అత్యల్ప వేతనాలకి పనిచేస్తూ ట్రాఫికింగ్‌కి గురయ్యే ప్రమాదకర స్థితిలో ఉంటారో అలాంటివారికి కూడా ప్రభుత్వం ఉన్నత ఉపాధి అవకాశాలు కల్పించాలి. ప్రస్తుత వ్యవస్థను 'ఉపాధి కోల్పోయే పెరుగుదల' నుండి ఉన్నతమైన పని- పనికి తగ్గవేతనం' కోసం జరిపే పోరాటాలతో సెక్స్ వ్యాపారంలో చిక్కుకున్న మహిళల సమస్యల్ని ఐద్వా జోడించాలి.

అప్పుడు విశాల ప్రజాపోరాటాల్లో ఈ బాధితులు కూడ కలిసి పోరాడగలరు. ట్రాఫికింగ్ నిరోధించడానికి, ట్రాఫికర్లను రక్షించడానికి మనం బలమైన ఉద్యమం నిర్మించాలి. సెక్స్ వ్యాపారంలో మహిళల సమస్యలకు పితృస్వామ్యమే మూల కారణమనే అవగాహనతో మనం ఈ పోరాటాల్లో పాల్గొనాలి. ఈ వృత్తిలో ఉన్న సమస్యల్ని పక్కన పెట్టేయకుండా వాటిని చేపట్టడం ద్వారానే మన ఉద్యమం బలపడుతుంది.

✲ ✲ ✲

ఆరోగ్యం

# ప్రసవం తరువాతి కాలంలో తీసుకోవాల్సిన జాగ్రత్తలు

- డా॥ కె. భారతీసాగర్

బిడ్డని ప్రసవించి, మావి కూడ బైటికి వచ్చిన తరువాతి నుంచి ఆరువారాల సమయం వరకు గల కాలాన్ని బాలింత (పర్పూరియం) కాలంగా వ్యవహరిస్తారు. ఈ సమయం కూడా కీలకమయినది. ఎందుకంటే ఈ సమయంలోనే గర్భధారణ మరియు ప్రసవ సమయంలో గర్భాశయం మరియు ఇతర జననాంగాలలో జరిగిన మార్పులు రివర్స్‌అయ్యి సాధారణ స్థితికి వస్తాయి. అలాగే స్తనాలలో స్తన్యం ఉత్పత్తి కావటానికి అవసరమైన మార్పులు జరుగుతాయి. అంతేకాదు ఈ సమయంలో కూడా ఎప్పుడైనా యోనినుంచి అధికంగా రక్తస్రావం జరిగి అత్యవసర పరిస్థితి తలెత్తవచ్చు.

కొత్తగా గర్భం ధరించి, తొమ్మిదినెలల తరువాత ప్రసవం జరిగేవరకు, ప్రసవం జరిగిన తరువాత ఏమిచేయాలి అనేది అందరూ స్త్రీలకు అవగాహన ఉండదు. మన చుట్టు పక్కల ఉండే వయసుమళ్ళిన స్త్రీలు చెప్పే సలహాలమీద ఆధారపడి ఉంటాము. అయితే పై విషయాల గురించి శాస్త్రీయ అవగాహన లేకపోటం వలన కొన్ని ఇబ్బందుల్ని కూడా ఎదుర్కోవలసి వస్తుంది. అలాంటి అపోహల్ని దూరంచేసి వైద్య శాస్త్రపరంగా ఈ సమయంలో ఎటువంటి జాగ్రత్తలు తీసుకోవాలి, చర్యలను పాటించాలి అనే విషయాలు తెలుసుకోవటం అవసరం.

ఈ విషయం గురించి వివరణ ఇచ్చేముందుగా ఇంకో విషయం చెప్పదలచు కున్నాను. అది ప్రసవం ఖచ్చితంగా ఆసుపత్రులలోనే జరిపించాలి. అధునిక వైద్య సౌకర్యాలు వృద్ధిచెందిన ఈ కాలంలో కూడా ఇంకా ఎక్కువ శాతం మంది గ్రామీణ ప్రజలు ప్రసవం వాళ్ళ ఇండ్లలోనే కానిచ్చేస్తున్నారు. ఈ విషయంలో గ్రామాలలోని మంత్రసానుల సహాయం తీసుకుంటున్నారు. అదిసరికాదు. ఎందుకంటే వాళ్ళకి స్త్రీ ప్రత్యుత్పత్తి అవయవాల గురించి, ప్రసవ సమయంలో తలెత్తే ఉపద్రవాల చికిత్సగురించి సంపూర్ణ



అవగాహన ఉండదు. ఆసుపత్రి ప్రసవాలతోనే మాతా శిశు మరణాలను గణనీయంగా తగ్గించవచ్చు.

ప్రసవం అయిన తరువాత బిడ్డ వెలుపలికి రాగానే అంతకు ముందు వరకు బాగా పెద్దదిగా సాగిన గర్భసంచి తిరిగి సాధారణ పరిమాణానికి వస్తుంది. గట్టి బడుతుంది. అప్పటి వరకు సుమారు ఒకకేజీ బరువున్నది కాస్తా 60గ్రా. బరువుకి వచ్చేస్తుంది. ఇలా గర్భసంచిలో మార్పులు జరగకపోతే విపరీతమైన రక్తస్రావం జరిగి తల్లి చనిపోయే పరిస్థితి వస్తుంది. ప్రసవం అయిన వెంటనే ఆసుపత్రిలో అయితే గర్భసంచి తన పూర్వస్థితికి రావటానికి, ప్రసవానంతర రక్తస్రావం ఆగటానికి ఇంజెక్షన్ చేస్తారు. దీనిద్వారా మెజారిటి శాతం మహిళల్లో ప్రసవానంతరం రక్తస్రావం జరగకుండా ఉంటుంది.

గర్భసంచి లాగానే యోని, గర్భసంచిని పట్టిఉంచే లిగమెంట్లు కూడా యధాపూర్వ స్థితికి వచ్చేస్తాయి.

**లోకియా :** ప్రసవం అయిన నాటినుండి మొదటి పదిహేను రోజులవరకు యోని నుంచి స్రావాల వస్తూ ఉంటాయి. ఈ ద్రవాలు ఒక ప్రత్యేకమైన చేపవాసన వస్తూ వుంటాయి. మొదటి నాలుగు రోజులు ఎరుపురంగు స్రావాలు వస్తూ వుంటాయి. తరువాతి ఐదురోజులు పింక్, పసుపు రంగులో ఉన్న స్రావాలు వస్తాయి. తరువాతి పదిరోజులు తెలుపు రంగులో ద్రవాలు స్రవిస్తాయి. అయితే ఈ స్రావాలు పరిమిత పరిమాణంలోనే స్రావిస్తాయి. ఒక వేళ ఈ స్రావాలు దుర్వాసన వేస్తూ, అధిక పరిమాణంలో వెలువడుతూ ఉంటే అది జననేంద్రియాలలో ఇనన్ఫెక్షన్‌కి లేదా ప్రసవ సమయంలో కొన్ని కణజాలాలు లోపలే ఉన్నాయనేదానికి సంకేతం. ఈ సమస్య ఉన్నప్పుడు వెంటనే వైద్యులను సంప్రదించాలి.

ప్రసవ సమయంలో ఇంకొక అవయం కూడా ఎక్కువ ప్రభావితమవుతుంది, అదే మూత్రసంచీ. ఇది గర్భసంచి పక్కనే ఉండటం వలన, ప్రసవ సమయంలో కలిగే వత్తిడి వలన దీనిలో వాపు ఏర్పడుతుంది. అలాగే మూత్ర నంచి నరాలు కూడా వత్తిడికి గురి అవుతాయి. దీనివలన ప్రసవం తరువాత మూత్రసంచీ మూత్రంతో నిండినా కూడా మూత్రం చేయాలన్న స్పృహ కలుగదు. ఈ స్థితినుంచి మూత్ర సంచికి టోన్ (పటుత్వం) తిరిగి వస్తుంది. అంతవరకు బాలింతస్త్రీ గుర్తుంచుకొని మూత్రవిసర్జన చేస్తూ ఉండాలి. లేకపోతే మూత్ర సంచిలో మూత్రం నిలువ ఉండి మూత్రనాళ ఇన్ఫెక్షన్స్ వచ్చే అవకాశం ఎక్కువ ఉంటుంది.

జీర్ణకోశానికి సంబంధించి రెండు ముఖ్య మార్పులు చోటుచేసుకుంటాయి. ఒకటి అధికంగా నీటి దాహం వేయటం, రెండవది మలబద్ధకం. చాలా ప్రాంతాలలో ప్రసవం తరువాత బాలింతలకి త్రాగటానికి ఎక్కువ నీరు ఇవ్వరు. ఇది తప్పు. ఆమెకి అవసరమైనంత నీటిని తాగటానికి ఇవ్వాలి.

ప్రసవం అయి బిడ్డ బైటకొచ్చేటప్పుడు, మావి గర్భసంచీ నుంచి విడివడి వెలుపలికి వచ్చే సమయంలో కొంత రక్తస్రావం అనివార్యంగా జరుగుతుంది. అయితే గర్భధారణ సమయంనుంచే రక్తహీనతతో బాధపడుతున్న వాళ్ళలో మరింత రక్తస్రావం అయ్యే అవకాశాలుంటాయి. అందుకే ఆసుపత్రులలోనే పురుడు పోసుకోవటం తల్లీ, పిల్లలిద్దరికి సురక్షితం. డాక్టర్లు, నర్సులు తల్లి, పిల్లలని అప్రమత్తంగా కనిపెట్టుకొని

ఉంటారు. అత్యవసర పరిస్థితులలో తక్షణ వైద్యసాయం అందిస్తారు.

బాలింతల్లో చోటుచేసుకునే ఇంకొక మార్పు స్తనాలలో స్తన్యం ఉత్పత్తి కావటము. ప్రసవం అయిన మొదటి రెండు రోజులలో స్తనాల పరిమాణంలో చెప్పుకోదగ్గ మార్పులు ఉండవు. ఈ రెండు రోజుల్లో స్తనాలనుంచి వచ్చే స్రావాలను కోలోస్ట్రమ్ అంటారు. ఇందులో ఎక్కువ ప్రొటిన్, విటమిన్ ఏ, సోడియం, క్లోరైడ్ ఇంకా Ig-A యాంటీ బాడీస్ ఉంటాయి. తక్కువ పరిమాణంలో క్రొవ్వులు, కార్బోహైడ్రేట్‌లు ఉంటాయి.

గర్భధారణ సమయంలో స్తనాలలో స్తన్యం ఉత్పత్తి కావటానికి అవసరమైన మార్పులు జరుగుతాయి. ప్రసవం అయిన మూడు లేదా నాలుగవరోజు నుంచి స్తన్యం స్రవించటం మొదలవుతుంది. అయితే స్తన్యం ఉత్పత్తి బిడ్డకి స్తనాలను అందించి బిడ్డ పాలకోసం చనుమొనలను చూషణచేయటం ద్వారానే చక్కగా జరుగుతుంది. తల్లికి, బిడ్డకి మధ్య గాఢమైన బంధం ఏర్పడుతుంది. అయితే తల్లికి కూడా బిడ్డకి పాలు త్రాగించాలని బలమైన ఆకాంక్ష ఉండాలి.

**ప్రసూత స్త్రీ పాటించవలసినవి :** సాధారణ ప్రసవం జరిగి తల్లిని వేరే పడక మీదికి మార్చిన తరువాత ఆమెకి 8నుంచి 10గంటలు విశ్రాంతి ఇవ్వాలి. వీలైనంత తొందరగా బెడ్ నుంచి లేచి తిరగటానికి ప్రయత్నం చేయాలి. తద్వారా మూత్ర సంచి, ఇంకా ఇతర అవయవాలు పటుత్వాన్ని (టోన్‌ని) తిరిగి పొందుతాయి. గర్భసంచి లోపల ఏదైనా ద్రవాలు ఉంటే అవి వెలుపలికి వచ్చేస్తాయి. గర్భసంచీ తొందరగా తనపూర్వ స్థితికి చేరుకుంటుంది. అయితే తొందరగా బెడ్‌నుంచి తిరగమన్నారని ఇంటిపనులు, బైటపనులు మొదలుపెట్టకూడదు, కనీసం ఆరువారాల వరకు విశ్రాంతి అవసరం.

> గర్భధారణ సమయంలో స్తనాలలో స్తన్యం ఉత్పత్తి కావటానికి అవసరమైన మార్పులు జరుగుతాయి. ప్రసవం అయిన మూడు లేదా నాలుగవరోజు నుంచి స్తన్యం స్రవించటం మొదలవుతుంది. అయితే స్తన్యం ఉత్పత్తి బిడ్డకి స్తనాలను అందించి బిడ్డ పాలకోసం చనుమొనలను చూషణచేయటం ద్వారానే చక్కగా జరుగుతుంది. తల్లికి, బిడ్డకి మధ్య గాఢమైన బంధం ఏర్పడుతుంది. అయితే తల్లికి కూడా బిడ్డకి పాలు త్రాగించాలని బలమైన ఆకాంక్ష ఉండాలి.

సాధారణ ప్రసవం అయిన మొదటి రోజు ద్రవాహారాన్ని ఇవ్వాలి. తరువాతి రోజునుంచి మామూలు ఆహారం ఇవ్వవచ్చు. ఆహారంలో ఎక్కువ కేలరీలు, ప్రోటిన్లు, కొవ్వులు, మినరల్స్, విటమిన్లు ఉండేలాగా చూసుకోవాలి. పాలివ్వని తల్లులకు సాధారణ ఆహారం సరిపోతుంది. అలాగే ఆహారంలో తగినంత పీచుపదార్థాలు ఉండేలాగా చూసుకోవాలి. దీనిద్వారా మలబద్ధకాన్ని నివారిం చవచ్చు.

ఒకవేళ జననేంద్రియాల దగ్గర చిన్న ఆపరేషన్ (ఎపిసి యాటమే మాత్రమే) చేసి వుంటే దానిని సరిగా శుభ్రంచేసి శుభ్రమైన పాడ్‌ని ఉపయోగించాలి. ఆసుపత్రికి తీసుకెళ్ళి డ్రెస్సింగ్ చేయించాలి. అలాగే స్తనాలు శుభ్రంచేస్తూ ఉండాలి. పాలివ్వటానికి ముందే శుభ్రంగా కడిగి తుడుచుకొని పొడిగా ఉంచాలి. ఆమె వాడుకుంటున్న పడక, మంచం, గది పరిసరాలు శుభ్రంగా ఉంచాలి.

సాధారణంగా ఎక్కువ శాతంమంది స్త్రీలు ప్రసవానంతరం రక్తహీనతతో బాధపడుతుంటారు. దాన్ని నివారించటానికి ఐరన్ బిళ్ళలు వాడవలసి ఉంటుంది. పొట్ట కండరాలు, గర్భాశయం సాధారణ స్థితికి రావటానికి తోడ్పడుటకోసం పొట్టచుట్టూ శుభ్రమైన కాటన్ వస్త్రాన్ని కానీ, అబ్డోమినల్ బైండర్‌ని కానీ ఉపయోగించాలి. శారీరక వ్యాయమం కూడా చేయాలి. దీనిద్వారా ఉదరం, గర్భాశయం, బాహ్య జననేంద్రియాల దగ్గరున్న కండరాలు పటుత్వాన్ని సంతరించుకొంటాయి. ప్రసవం అయిన తరువాత మొదటి నెలసరి ఎప్పుడైనా రావచ్చు. అయితే పాలిచ్చేంతకాలం దాదాపు 70శాతం మందిలో రాకపోవచ్చు. పాలివ్వని వారిలో ఆరవవారంకే నెలసరి రావచ్చు. అందుకే వైద్యుల సలహాతో తగిన కుటుంబ నియంత్రణ పద్ధతులు పాటించాలి. ఈ విషయంలో స్త్రీలు తగినంత చొరవ తీసుకోవాలి. ఇంట్లో వాళ్ళని ఒప్పించైనా వాటిని ఆచరించవలసి ఉంటుంది. భార్యాభర్తలు కూడా శారీరకంగా వెంటనే కలువకూడదు. కనీసం రెండునుంచి మూడు వారాల సమయం దూరం పాటించాలి.

ప్రసవం తరువాత యోనినుంచి నిరంతరంగా రక్తస్రావం కావటం, కడుపులో నొప్పిరావటం, గర్భాశయం జారినట్లుగా ఉండటం లాంటి ఏ లక్షణాలున్నా తక్షణం డాక్టర్‌ని సంప్రదించవలసిన అవసరం ఉంది.

***

## కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డునందుకున్న రచయిత్రి ఓల్గా గారికి అభినందనలు



ఓల్గా పేరుతో అందరికీ చిరపరిచితురాలు (అసలు పేరు పోపూరి లలిత కుమారి) గా ఆమె రచించిన 'విముక్త 'కథా సంపుటి ఎన్నో భాషలలోకి అనువదింపబడినది. ఈ కథా సంపుటికి 2015 సంవత్సరానికి గాను కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డు ప్రకటించారు. 2-2-16న న్యూఢిల్లీలో ఈ అవార్డును స్వీకరించారు. ఈ సందర్భంగా ఐద్వా, చైతన్య మానవి అభినందనలు తెలుపుతుంది. స్త్రీ వాద దృక్పథంతో ఎన్నో రచనలు చేసి స్త్రీ వాద రచయితగా ఒక ప్రత్యేక స్థానాన్ని పొందారు. ఆమె రచనలు ఎంతో ప్రభావవంతంగానూ, భావితరాలకు ఆదర్శనీయంగానూ ఉంటాయి. మనువాద సంస్కృతిని మళ్లీ తెరపైకి తీసుకువస్తున్న నేటి పరిస్థితుల్లో ఆమెరచనలు విస్తృతంగా ప్రచారం కావలసిన అవసరం ఉంది. విముక్త కథా సంపుటిలో రామాయణంలోని ఆరు ప్రధాన పాత్రలను ఇతివృత్తాలుగా తీసుకుని వారిలో ఆత్మగౌరవ కోణాన్ని శోధించి పాఠకులకు అందజేశారు. సీత అంతరంగంలోకి చొరబడి ఆమెలోని అసాధారణ కోణాన్ని వెలికి తీసుకువచ్చారు.

సీరియల్

# న్యాయమూర్తి - మానవతావాది

## మరో అమ్మ (మేరీ జోన్స్ ఆత్మకథ)



1902 జూన్‌లో పశ్చిమ వర్జీనియాలోని క్లార్క్‌బర్గ్‌లో తారు (బిట్యూమినస్) గని కార్మికులకు మీటింగు పెట్టాను. యూనియన్ నాయకులతో కలిసి చెట్టుక్రింద కూర్చుని సమ్మె విషయం చర్చిస్తున్నాము. ఇంతలో పోలీసులు వచ్చారు. నాపై అరెస్టు వారెంట్ ఉందని హెచ్చరించారు. అందులో ఒకడు నా దగ్గరకు వచ్చి "అమ్మా! మీరు అరెస్టులో ఉన్నారు. మీరు ఇక్కడ సమావేశాలు పెట్టకూడదని కోర్టు ఉత్తర్వులిచ్చిందని" చెప్పాడు.

అయినా నేను ఖాతరు చెయ్యకుండా 'తప్పకుండా వస్తాను. నేను వచ్చే దాకా ఆగు', అని అతనితో అంటూనే ఉపన్యాసం పూర్తిచేశాను. కార్మికుల వైపు తిరిగి, 'అబ్బాయిలూ! సెలవు! నేను అరెస్టులో ఉన్నాను, జైలుకు వెళుతున్నాను. చాలా కాలం వరకు మిమ్మల్ని కలవకపోవచ్చు. పోరాటం కొనసాగించండి. లొంగవద్దు. ఈ పార్కర్స్ బర్గ్ కోర్టు ఇచ్చే ఇంజక్షన్ ఆర్డర్స్ గురించి పట్టించుకోవద్దు. పార్కర్స్‌బర్గ్ ఫెడరల్ కోర్టు న్యాయమూర్తి అవినీతిపరుడు. మనం ఆకలితో మాడుతూ వుంటే అతను గోల్ఫ్ ఆడతాడు, మనం మానవ సేవ చేస్తుంటే అతను ధనవంతులైన బడాబాబులకు సేవ చేస్తాడు' అని చెప్పాను.

ఇక్కడ నుండి 84 మైళ్ళ దూరంలో ఉన్న పార్కర్స్‌బర్గ్‌కు, ఆ రాత్రి నన్నూ, నాతోపాటు యూనియన్ నాయకులను పోలీసులు తీసుకెళ్ళారు. ఒక పోలీసు అధికారి మేనల్లుడికి నా బాధ్యత అప్పగించారు. ఈ కుర్రాడికి కార్మికుల సమస్యల పట్ల సానుభూతి ఉందన్న విషయం నాకు అర్థమైంది. రైలు దిగిన తరువాత, కార్మికులు, పోలీసులు ఒకవైపు, మేం ఇద్దరం మరొక వైపు వెళుతున్నట్లనిపించింది. అదే విషయం అతనిని అడిగాను. కార్మికులను జైలుకు, నన్ను హోటల్‌కు తీసుకెళ్తున్నారని ఆ కుర్రాడు చెప్పాడు.

'అబ్బాయి! కార్మికులు జైలుకి వెళుతుంటే, మదర్‌జోన్స్ హోటల్‌కి వెళ్ళటం ఎప్పుడైనా విన్నావా?' అని నేను వెనక్కితిరిగి వడివడిగా నడిచి కార్మికులతో కలిసాను. వాళ్ళతోపాటు జైలుకు వెళ్ళాను. అయితే జైలరు, అతని భార్య అందరితోపాటు నన్ను సెల్‌లో పెట్టకుండా, 'అమ్మా! మీరు మా అతిథి' అని అంటూ నన్ను వాళ్ళ కుటుంబంలో ఒకరిగా చూసుకున్నారు. మంచి భోజనం పెట్టి పుష్టిగా తయారు చేసారు. ఆ కుంటుంబం ఆదరణలో నాకు నిజమైన విశ్రాంతి దొరికింది.

విచారణ కోసమని మమ్మల్ని ఫెడరల్ కోర్టుకు తీసుకువెళ్ళారు. కార్మికులు సంఘటితం కాకుండా ఉండేందుకు గని యజమానులు ఏమైనా చేయగలరు. తప్పుడు సాక్ష్యాలతో కోర్టులను ప్రభావితం చెయ్యగలరు. నన్ను బోనులో నిలబెట్టారు. న్యాయమూర్తి 'నువ్వు గని కార్మికులను హింసకు ప్రేరేపించావా'? అని ప్రశ్నించారు.

'చూడండిసార్, నేను ఇలాంటి వ్యాఖ్యలు బహిరంగంగా చేస్తే అది నాకు ఆత్మహత్యతో సమానం. అలాంటప్పుడు నా జాగ్రత్తలో నేను ఉండనా? మీరు న్యాయమూర్తి స్థానంలో 40 సంవత్సరాలుగా ఉన్నారు కదా? ఈ 40 సంవత్సరాలలో ఏది నిజమో, ఏది అబద్ధమో తెలుసుకునే వివేకం మీకు ఉందనుకుంటాను' అని అన్నాను.

అప్పుడు ప్రాసిక్యూటరు ఒక్క గెంతులో న్యాయమూర్తి దగ్గరకు వెళ్ళి, నావైపు వేలు చూపిస్తూ 'యువర్ హానర్– ఈమె దేశంలోనే అత్యంత ప్రమాదకరమైన ఆడమనిషి. ఆమె మిమ్మల్ని అవినీతిపరుడు అని అంది. ఆమె తక్షణం రాష్ట్రం విడిచి వెళ్ళాలి. మళ్ళీ ఈ రాష్ట్రంలోకి అడుగు పెట్టరాదు. అలాగైతేనే ఆమెకు క్షమాబిక్ష సిఫార్సు చేస్తానన్నాడు.

**'చూడండిసార్, నేను ఇలాంటి వ్యాఖ్యలు బహిరంగంగా చేస్తే అది నాకు ఆత్మహత్యతో సమానం. అలాంటప్పుడు నా జాగ్రత్తలో నేను ఉండనా? మీరు న్యాయమూర్తి స్థానంలో 40 సంవత్సరాలుగా ఉన్నారు కదా? ఈ 40 సంవత్సరాలలో ఏది నిజమో, ఏది అబద్ధమో తెలుసుకునే వివేకం మీకు ఉందనుకుంటాను' అని అన్నాను.**

నేను క్షమాబిక్ష కోసం కోర్టుకు రాలేదన్నాను. 'న్యాయం కోసం వచ్చాను. నేను ఈ రాష్ట్రాన్ని వదిలి వెళ్ళను. ఇక్కడున్న చిన్న పిల్లవాడైనా సరే వచ్చి, అతని బ్రతుకు పోరాటంలో సహాయపడమని అడిగితే, తప్పకుండా అతనికి సహాయం చేస్తాను. అలాంటి పరిస్థితి లేనప్పుడు మాత్రమే నేను ఇక్కడి నుండి వెళతాను' అని జవాబిచ్చాను.

'నన్ను అవినీతిపరుడు అని మీరన్నారా', అని న్యాయమూర్తి అడిగారు.

'అవును అన్నాను' అని సమాధానం చెప్పాను. ఎందుకలా అన్నారని న్యాయమూర్తి అడిగారు.

'నేను చట్టం గురించి మాట్లాడుతుండగా నన్ను అరెస్టు చేశారు. కార్మికులతో వాళ్ళ జీవితాల గురించి, వారి స్వేచ్ఛ గురించి మాట్లాడాను. సంతోషంగా వుండేందుకు వారికి తగిన అవకాశమివ్వాలన్నాను. ఈ కార్మికుల్ని వాళ్ళ యజమానులు సంవత్సరాల తరబడి దోచుకున్నారు. పారిశ్రామిక బానిసల్లా తయారు చేశారు. నేను ఈ సందర్భంగా లింకన్ మహాశయున్ని స్మరించుకుంటున్నాను. పత్రికల ద్వారా నేను తెలుసుకున్న దేమిటంటే లింకన్ ఈ కోర్టుకు ఫెడరల్ న్యాయమూర్తి నియామకాలు చేసినప్పుడు జూనియర్, సీనియర్ ఎవరన్నది గుర్తించలేకపోయారు. మీకు, మీ నాన్నగారికి ఇంటిపేర్లు ఒకటేకదా. నియామకాలు జరిగే సమయానికి మీ నాన్నగారు చనిపోయారు. మీరు న్యాయమూర్తిగా, మీ నాన్నగారి స్థానంలో వచ్చారు. అప్పుడు మీరు అవినీతిపరులే కదా', అని అన్నాను.

**పార్కర్స్‌బర్గ్‌కు చెందిన మర్ఫీ అనే వ్యక్తి నాదగ్గరకు వచ్చి, నేను వెళ్ళిపోతున్నందుకు విచారం వ్యక్తం చేశాడు. న్యాయమూర్తి నన్ను విడిచిపెట్టినందుకు సంతోషిస్తున్నానన్నాడు. వాస్తవానికి కోర్టు ఆజ్ఞలను ఉల్లంఘించినది నేను. కార్మికులు అసలు మాట్లాడనేలేదు. కానీ నా కోసం వాళ్ళు జైలుకు వెళ్ళారు కాబట్టే నన్ను విడిచిపెట్టారు. అందుకు బాధగా ఉంది. నేను జైలుకు వెళ్ళడమన్నది అంత ముఖ్యమైన విషయం కాదు. వాళ్ళు యువకులు, బలమైన వాళ్ళు వాళ్ళకు చాలా జీవితం ఉంది. నేను ముసలిదాన్ని అయినా చెయ్యడానికి ఇంకా చాలానే ఉంది. వాళ్ళల్లో బార్నేరైస్‌కు గుండెజబ్బు ఉంది. అతని భార్య జబ్బుమనిషి, అతను జైలులో ఉన్నట్లు తెలిస్తే ఆమె కుప్పకూలిపోతుంది. అతని పిల్లలు తల్లి దక్షతను కోల్పోతారేమోనని భయంగా ఉంది అదే విషయం అతనికి చెప్పాను.**

'నేను ఇంతకు ముందెన్నడూ ఈ విషయం వినలేదు' అనిన్యాయమూర్తి అన్నారు.

కోర్టు ముగిసిన తరువాత, న్యాయమూర్తి అతని చాంబర్‌లో నన్ను కలుసుకోవాలని కబురు వంపారు. నేను చాంబర్‌లోకి వెళ్ళేసరికి అతను నాదగ్గరకి వచ్చి నా చెయ్యిపట్టుకొని తాను అవినీతి పరుణ్ణి కానని, అందుకు తగిన ఆధారాలు చూపిస్తానని చెప్పారు.

నా చేతిలో అందుకు సంబంధించిన ఆధారపత్రాలు పెట్టి, గతంలో తప్పుడు రిపోర్టులు ఇచ్చింది అతని శత్రువులని చెప్పారు. నేను క్షమించమని అడిగాను. ఒక న్యాయమూర్తి తాను అవినీతిపరుల్లో ఒకడిగా ఉండకూడదని అనుకున్నందుకు సంతోషిస్తున్నానని చెప్పాను. అవినీతిపరుల గురించి కార్మికులు ఎలా భావిస్తారో మీకు అర్థమయ్యే ఉంటుందన్నాను.

నన్ను విడుదల చేశారు. అయితే నాతోపాటు అరెస్టు అయిన కార్మికులకు 60 నుండి 90 రోజులు జైలు శిక్ష విధించారు.

మరుసటి రోజు రాత్రి నేను పార్కర్స్‌బర్గ్ నుండి క్లార్క్‌బర్గ్ వెళ్ళాలనుకున్నాను. పార్కర్స్‌బర్గ్‌కు చెందిన మర్ఫీ అనే వ్యక్తి నాదగ్గరకు వచ్చి, నేను వెళ్ళిపోతున్నందుకు విచారం వ్యక్తం చేశాడు. న్యాయమూర్తి నన్ను విడిచిపెట్టినందుకు సంతోషిస్తున్నానన్నాడు. వాస్తవానికి కోర్టు ఆజ్ఞలను ఉల్లంఘించినది నేను. కార్మికులు అసలు మాట్లాడనేలేదు. కానీ నా కోసం వాళ్ళు జైలుకు వెళ్ళారు కాబట్టే నన్ను విడిచిపెట్టారు. అందుకు బాధగా ఉంది. నేను జైలుకు వెళ్ళడమన్నది అంత ముఖ్యమైన విషయం కాదు. వాళ్ళు యువకులు, బలమైన వాళ్ళు, వాళ్ళకు చాలా జీవితం ఉంది. నేను ముసలిదాన్ని అయినా చెయ్యడానికి ఇంకా చాలానే ఉంది. వాళ్ళల్లో బార్నేరైస్‌కు గుండెజబ్బు ఉంది. అతని భార్య జబ్బుమనిషి, అతను జైలులో ఉన్నట్లు తెలిస్తే ఆమె కుప్పకూలిపోతుంది. అతని పిల్లలు తల్లి దక్షతను కోల్పోతారేమోనని భయంగా ఉంది అదే విషయం అతనికి చెప్పాను.

'అమ్మా! మీరు వెళ్ళి న్యాయమూర్తితో రైస్ పరిస్థితి చెబితే, అతన్ని తప్పకుండా వదిలిపెట్టవచ్చు. వెళ్ళి మాట్లాడండని' మర్ఫీ నాతో అన్నాడు. నేను జడ్జిగారి ఇంటికి వెళ్ళాను. ఆయన నన్ను ఆ రాత్రి భోజనానికి ఆహ్వానించారు. నేను బార్నేరైస్ విడుదల కోసం మాట్లాడడానికి వచ్చానని చెప్పాను.

అతనికి గుండెజబ్బు, అతని భార్యకు నరాల జబ్బు ఉందని వైద్యం అందకపోతే అతను జైలులోనే చనిపోవచ్చని, మీరు అతనికి న్యాయం చేస్తారని ఆశించి వచ్చానని చెప్పాను.

వెంటనే ఆయన జైలర్‌ని పిలిచి, రైస్‌ను ఫోన్ దగ్గరకు తీసుకురమ్మని చెప్పారు. ఫోన్‌లో, 'బార్నేరైస్ మీ గుండె ఎలా ఉందని' అడిగారు.

'నా గుండె బాగానే ఉంది. ఆ పాపిష్టి ముసలి న్యాయమూర్తి నన్ను 60 రోజులపాటు జైలులో పెట్టాడే. దీనివల్ల నా జబ్బు ముదిరిపోతుందేమో. నేను కేవలం మదర్‌జోన్స్ బాటలో నడిచానంతే' అని బార్నేరైస్ విసురుగా అన్నాడు.

న్యాయమూర్తి నా వైపు తిరిగి, అతను మాట్లాడే పద్ధతి బాగోలేదని అసహనం వ్యక్తం చేశారు.

కార్మికులు బాధలు పడీపడీ ఇలాగే మాట్లాడతారని నేను జడ్జిగారికి సర్దిచెప్పాను. అతనికి గుండెకు, లివర్‌కు తేడా తెలీదని, నేను అతనితో కలిసి మీటింగులకు వెళ్ళేటప్పుడు రోడ్లమీద, రైల్వే ట్రాక్స్‌మీద నడిచేవాళ్ళమని, నడవలేక ఆయాసపడి క్రింద కూర్చుండిపోయేవాడని జడ్జిగారితో వివరించి చెప్పాను.

న్యాయమూర్తి జైలు డాక్టర్‌ని పిలిచి, బార్నేను మరునటిరోజు ఉదయం పరీక్షించమని చెప్పారు. మరసటిరోజే బార్నే జైలు నుండి విడుదల అయ్యాడు.

* * *

# సాహిత్య పరిశోధకురాలు నాయని కృష్ణకుమారికి నివాళి



పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం మాజీ ఉప కులపతి, జానపద మూలాలపై కొత్త చూపుని సారించిన విశిష్ట పరిశోధకురాలు ఆచార్య నాయని కృష్ణకుమారి జనవరి 29న కన్నుమూశారు. తెలుగునేలపై భావకవితా వీచికలను సృష్టించిన నాయని సుబ్బారావు, హనుమాయమ్మ దంపతులకు 1930 మార్చి 14న గుంటూరులో నాయని కృష్ణకుమారి జన్మించారు. సాహితీ గోష్ఠులను, తండ్రి కోసం వచ్చే సాహితీ వైతాళికుల పరిచయాలను ఆస్వాదిస్తూ కృష్ణకుమారి పెరిగారు. చరిత్ర అధ్యాపకుడు క్లాసులో చెప్పగా రాసుకున్న విషయాలతో 'ఆంధ్రుల కథ' పేరిట పుస్తకాన్ని 18 ఏళ్ళ వయసులోనే రచించారు. గుంటూరు, శ్రీకాకుళంజిల్లాల్లో ప్రాథమిక విద్యను, ఆంధ్రా విశ్వ విద్యాలయంలో ఉన్నత విద్యను పూర్తి చేసిన ఆమె మద్రాసుయతిరాజులు కాలేజి, ఉస్మానియా యూనివర్శిటీలలో అధ్యాపకురాలిగా, తెలుగు యూనివర్శిటీ ఉపకులపతిగా పనిచేశారు. ఆమె రచించిన 'జానపద గేయ గాథల'కు ఉస్మాని యా వర్సిటీ డాక్టరేట్ ప్రధానం చేసింది, 'జానపద వాఙ్మయం సమాజం-సంస్కృతి-సాహిత్యం' పేరిట పాఠ్య గ్రంథం అందించారు. కాగా, ప్రాచీన, ఆధునిక సాహిత్యానికి కృష్ణకుమారి అందించిన సేవలు గణనీయ మైనవి. కృష్ణకుమారి గారు గుంటూరులో జరిగిన ఐద్వా రాష్ట్ర మహాసభల్లో పాల్గొని ప్రారంభోపన్యాసం చేశారు. నాయని కృష్ణకుమారి గారికి ఐద్వా, చైతన్య మానవి జోహార్లు అర్పిస్తోంది.

కథ

# గీతను మార్చిన రాత

- చాడా లలితాదేవి




**గురజాడ శతవర్థంతి సందర్భంగా గురజాడ స్ఫూర్తితో నిర్వహించిన కథల పోటీలో కన్సొలేషన్ బహుమతి పొందిన కథ**

తలుపు తట్టిన చప్పుడు విని, మధ్యాహ్నం భోజనానికి వచ్చి, టీవీ చూస్తున్న రాజేష్ కుర్చీలోంచి లేచి వెళ్ళి తలుపు తెరిచాడు. ఎదురుగా కొరియర్ బాయ్ చేతికొక కవరిచ్చి, సంతకం పెట్టించుకొని వెళ్ళిపోయాడు.

"నాకెవరూ కొరియర్ పంపేవాళ్ళు లేరే? అనుకుంటూ ఫ్రమ్ అడ్రసు చూశాడు. 'అనామిక' అని మాత్రం ఉంది.

"ఈ పేరెప్పుడూ విన్నట్టు లేదే!" అనుకుంటూ కవరు చించాడు. లోపల చిన్న ఉత్తరం. చివర సంతకం అదే. "నాన్న" అన్న సంబోధన చూసి ఆశ్చర్యపోయాడు.

"నాన్నా" ఎక్కడిదీ పిలుపు? నన్నలా పిలిచేవాళ్ళెవరూ లేరే" అని అనుకుంటున్నావు గదూ? నేను నీ పాపను నాన్నా! అవును నీ పాపనే! అయ్యో జ్ఞాపకం రావడం లేదా?

నా పేరన్నా చెప్పి జ్ఞాపకం చేద్దామంటే, నా కసలు పేరే లేదాయె! మీరు ఏ పేరు పెట్టలేదు-పెట్టకుండానే నన్ను వదిలించు కున్నారాయె.... అదే... నాన్నమ్మ... నన్ను చంపేసిందిగా!

ఓ! నీకా సంగతి తెలియదు కదూ? కానీ నేను నిజం చెపుతున్నాను నాన్నా! తనూ ఒక ఆడదే అయినా నాన్నమ్మకు ఆడపిల్లలంటే ఎందుకిష్టముండదో; నాకైతే అర్థం కావడం లేదు. మరి నీ సంగతి నాకు తెలియదు.

నేను పుట్టిన మూడు రోజులకే దవాఖానా నుండి అమ్మను, నన్ను ఇంటికి తీసుకొచ్చారన్న సంగతి నీకు గుర్తుండే ఉంటుంది. ఆ మర్నాడు నువ్వేమో ఆఫీసుకు వెళ్ళిపోయావు. పక్కింటి నర్సమ్మత్త స్నానం చేయిస్తానని అమ్మను బాత్‌రూమ్‌కి తీసుకెళ్ళింది. అప్పుడే నాన్నమ్మ నా దగ్గరకొచ్చి.....

"ఆరుగురు ఆడముండలను కని అష్టకష్టాలు పడ్డాను. మళ్ళీ నా కొడుకు పాలిట నువ్వు దాపురించావా?" అంటూ నోరు తెరిపించి గొంతులో ఏమో వేసింది.

అబ్బ! ముళ్ళలా గుచ్చుకుంది. ఏడుద్దామన్నా గొంతుపెగల్లేదు. తరువాత ఏమైందో తెలియదు.

కాసేపటికి పెద్ద గొంతుతో "అయ్యో! దేవుడోయ్ ! ఉన్నట్టుండి పసిగుడ్డు గుడ్డు తేలేసిందిరో!" అంటూ బుడి బుడి రాగాలు తీస్తూ నానా హంగామా చేస్తూ అందరినీ నమ్మించింది.

నమ్మలేకపోతున్నావు కదూ! నిజం చెబుతున్నాను నాన్నా! అసలు ఆడపిల్లగా పుట్టడం నా తప్పా? చేయని తప్పుకు అమ్మ కడుపులో ఉన్నన్నాళ్ళైనా నన్ను మీ ప్రపంచంలో బ్రతకనీయపోతిరి.

పూర్తిగా కళ్ళు తెరవని నన్ను అంత కిరాతంగా చంపడానికి మీ అమ్మ మనిషా? రాక్షసా? ఏదైతేనేం నాకో పేరు, అడ్రసు లేకుండా చేశారు.

ఎందుకో ఇదంతా నీకు చెప్పాలన్పించి చెప్పేశాను ఉంటాను మరి. నీవు చూడాలనుకున్నా నీకు కన్పించని, నీది కాని నీ అనామిక.

చదవడం పూర్తిచేసిన రాజేష్‌కు ఒక్కసారిగా గతం కళ్ళముందు గిర్రున తిరిగింది.

రెండేళ్ళ క్రితం పుట్టిన పాప నాలుగు రోజులకే ఏదో సంధి వాతంతో సహజంగానే చనిపోయిందనుకున్నాడే గానీ, తెలియని గతం తెలిసాక తల తిరిగిపోయింది.

"అన్నం వడ్డించా"నంటూ పిలుస్తున్నా వినిపించుకోకుండా- "ఆకలిగా లేదు" అంటూ ఆఫీసుకెళ్ళిన భర్తను చూస్తూ అర్థంగాక అయోమయంలో పడింది లక్ష్మి.

సాయంత్రం ఇంటికి వచ్చాక్కూడా తనకొచ్చిన ఉత్తరం గురించే ఆలోచిస్తున్నాడు రాజేష్.

"నీరసంగా కన్పిస్తున్న భర్తను చూస్తూ "భోజనం చేద్దాం రండి" అంటూ పిలుస్తున్న లక్ష్మిని ఏమీ అనలేక మౌనంగా తినొచ్చి పడుకున్నాడు.

కలత నిద్రతో తెల్లారింది.

మర్నాడుదయం ఆఫీసుకు వెళ్తూ ... "ఆఫీసులో పని ఉంది. వీలైతే మధ్యాహ్నం వస్తాను! లేకుంటే లేదు. ఎదురు చూడకు" అంటూ వెళ్ళిపోయాడు.

గుమ్మం దాకా వచ్చిన లక్ష్మికి ఒక్కసారిగా కళ్ళు తిరిగినట్లనిపించింది. కాసేపలాగే నిల్చుని వంటకేం తొందరలేదుగా! కాసేపు పడుకుంటాను అనుకుంటూ రూంలోకి వెళ్ళిపోయింది.

ఏదో మార్పును గమనించిన రాజమ్మ అనుమానంగా చూసింది కోడలు వైపు. అడుగుదామనుకొనేలోపే వెళ్ళి పడుకున్న కోడలివైపు చూస్తూ మౌనంగా ఉండిపోయింది.

సాయంత్రం ఇల్లు చేరిన రాజేష్‌కు టీ తెచ్చిస్తూ "కొరియర్‌లో మీకేదో కవరొచ్చిందండీ! తీసుకుని షెల్ఫ్‌లో పెట్టాను"- అంది లక్ష్మి.

భార్య మాటలకొక్కసారిగా ఉలిక్కిపడ్డాడు గబగబా టీ తాగడం ముగించి, పరుగెత్తినంత పనిచేసి కవరందుకొన్నాడు.

నిన్నటిలాంటి కవరే!

ఫ్రమ్ 'పాప'!

చుట్టూ చూసి దాన్ని చింపుతూ మెల్లిగా

> **'నాన్నా! నేను నీ పాపను! అదే- నీ రెండో పాపను! అవును! మరచిపోయాను. నన్ను నీవసలు చూడనేలేదు కదూ? నేను పాపనన్న విషయం కూడా నీకు తెలిసుండదు' ఇంకా చెప్పాలంటే -పెరగనీయకుండానే అమ్మ కడుపులోనే చిదిమి వేశారు. ఈ దారుణం నీకు తెలిసే అవకాశం లేదులే నాన్నా!'**

మెట్లెక్కి డాబాపైకి చేరాడు.

లోపలి నుండి చిన్న ఉత్తరం జారి పడబోతుంటే వంగి గబుక్కున అందుకున్నాడు. "నాన్నా!" అన్న సంబోధన.

చివర్లో 'పాప' అన్న సంతకం! ఏమిటీ వింత? తనను 'నాన్నా' అంటూ ఈ పిలుపు లేమిటీ? ఎవరీ పాపలు? అతని కళ్ళు అక్షరాల వెంట పరుగులు తీశాయి.

'నాన్నా! నేను నీ పాపను! అదే- నీ రెండో పాపను! అవును! మరచిపోయాను. నన్ను నీవసలు చూడనేలేదు కదూ? నేను పాపనన్న విషయం కూడా నీకు తెలిసుండదు' ఇంకా చెప్పాలంటే -పెరగనీయకుండానే అమ్మ కడుపులోనే చిదిమి వేశారు. ఈ దారుణం నీకు తెలిసే అవకాశం లేదులే నాన్నా!'

అంతమాత్రాన ఇందులో నీ తప్పేంలేదనుకోకు. కట్టుకున్న ఇల్లాలి పట్ల, పుట్టబోయే బిడ్డల పట్ల బాధ్యత తెలియని సగటు మనిషివి నువ్వు.

నీ తల్లిని గౌరవించు. అదే సమయంలో ఆలి బాగోగులు కూడా ఓ భర్తగా చూడాల్సిన బాధ్యత నీకుందన్న విషయం మరచిపోయావు.

చదువుతున్న రాజేష్ కళ్ళు బైర్లు కమ్మినంత పనైంది. కాళ్ళు వణకడంతో ఒక్కసారిగా కింద కూలబడిపోయాడు. కాసేపటికి తేరుకుని మళ్ళీ చదవసాగాడు.

రెండవసారి నెలతప్పిన అమ్మను డాక్టరు వద్దకు తీసుకెళ్ళింది మీ అమ్మ. అమ్మను పరీక్షిస్తున్న డాక్టరమ్మతో- 'నాలుగో నెలలో ఆడో,మగో తెలుస్తుందట అమ్మగారు-చెప్పండి ఎవరో'- అంటూ అడిగింది నానమ్మ

'అలా చెప్పడానికి చట్టం ఒప్పుకోదు'- అందావిడ

అయినా మీ అమ్మ వదల్లేదు

అంతగా బతిమలాడి అడుగుతుంటే డాక్టర్‌కి జాలేసిందేమో?

'ఇంతకీ నీకెవరు కావాలి'-అడిగింది.

నానమ్మ ఏడ్చినంత పనిచేస్తూ "మొదట ఆడపిల్ల పుట్టి నాల్గు రోజులకే చనిపోయింది అమ్మగారు. మనవరాల్ని ఎత్తుకొని ఆడించే అదృష్టానికి నన్నా దేవుడు దూరం చేశాడు" అంటూ కళ్ళొత్తుకుంది.

'బాధపడకండి. మీ కోరిక తీరబోతుంది' అంటూ వెళ్ళిపోయింది డాక్టర్.

అలా చివరకు విషయాన్ని రాబట్టగలిగింది మీ అమ్మ. తరువాత ఏం జరిగిందో ఏమో?

నాల్గురోజుల తరువాత అమ్మకు వచ్చిన కడుపు పోయింది. ఉహూ పోయేలా చేసింది మీ అమ్మ రాక్షసి.

పక్క వీధిలో ఉంటున్న నర్సును తోలుకొని వచ్చి మందులవీ ఇప్పించి సానుభూతినొలకబోస్తూ.. రాని దు:ఖాన్ని నటిస్తూ అమ్మనోదార్చింది.

అమ్మకేదో అనుమానం వచ్చింది గానీ ఏమీ అనలేని నిస్సహాయత! రుజువులు చూపించలేని అసహాయత. మౌనంగా తనలో తానే కుళ్ళిపోతున్నా అమ్మను చూసి అలా జరిగినందుకు బాధపడుతుందనుకున్నావు గానీ...కారణం నీ తల్లి అని గ్రహించలేక పోయావు.

ఆడదై పుట్టి మరో ఆడపిల్లను ద్వేషించడం ఇదెక్కడి న్యాయం నాన్నా! ఇకనైనా నీ భార్యను అదే... మా అమ్మను జాగ్రత్తగా కాపాడుకో! ఇంతకన్నా ఏమి చెప్పగలను.

ఇట్లు,

ఉనికి ఏర్పడకుండానే ఊపిరిపోయిన నీ ఉత్తుత్తి పాప.

ఉత్తరాన్ని ముఖానికి కప్పుకొని బావురుమన్నాడు రాజేష్. కొంత సేపటికి తేరుకొని కళ్ళు తుడుచుకొన్నాడు. అటూ ఇటూ చూశాడు. సాయంకాలపు చీకట్లు కమ్ముకుంటున్నాయి.

అమ్మలో ఇంత క్రూరత్వం వుందా? అమ్మకు ఆరుగురు అక్కల తరువాత తాను పుట్టడం వల్ల ఆమెలో ఇంతటి క్రౌర్యం చోటుచేసుకుందా? కారణమేమిటి? తనకి ఎనిమిదేళ్ళ వయసులో పొలం తగాదాల్లో నాన్న, పెదనాన్న ఒకరిపై ఒకరు చేయిచేసుకోవడం ఆవేశంతో నాన్న పెదనాన్నను తోసేయడం అతడెళ్ళి ఓ బండరాయిపై పడటం ఫలితంగా తలపగిలి ఆయన అక్కడికక్కడే మరణించడం ఆ శవాన్ని ఎడ్లబండిపై తీసుకురావడం కావాలనే హత్య చేశాడంటూ పోలీసు స్టేషన్‌లో నాన్నపై ఫిర్యాదు చేయడం తనకి గుర్తుంది.

నాన్న అరెస్ట్-కేసు-విచారణ-చివరకు నాన్నకు ఇరవైయేళ్ళ జైలు శిక్ష. అది మొదలు "అన్నను చంపి జైలుకెళ్ళినోడి పిల్లలు" అంటూ ఊళ్ళో వాళ్ళు తను కుటుంబాన్ని వెలివేసినంతగా ఈసడించుకోవడం చూసి, ఆ ఊర్లో ఎలా బతకాలో తెలియక, ఉన్న రెండెకారాలను అందినకాడికి అమ్ముకొని... మమ్మల్ని తీసుకొని దూరంగా మరో వూరు చేరుకుంది అమ్మ.

కాయకష్టం చేసి కడుపులు నింపుతున్న సమయంలో బస్తీ వాతావరణాన్ని చూసి అలా బతకాలన్న ఊహలతో తేలిపోతూ,.. చిన్న, చిన్న సరదాల కోసం అడ్డదారులు తొక్కిన పెద్దక్కలు, ముగ్గురు తలోదారిన నడుస్తూ... ఇంట్లోంచి వెళ్ళిపోయారు. మిగిలిన వాళ్ళు అమ్మ నెదిరించడం మొదలుపెట్టారు.

అది గమనించిన అమ్మ గంతకు దగ్గ బొంత అన్నట్లు... అప్పటికే పెళ్ళైపోయిన రెండోపెళ్ళివాడికి ఒక అక్కనూ, పెళ్ళాం ఉన్నా పిల్లలు లేని కారణంగా మళ్ళీ పెళ్ళికి సిద్ధపడినవాడికి మరో అక్కనూ... పోలియో తో కాళ్ళు చచ్చుబడిపోయినవానికి చిన్నక్కనూ ఇచ్చి పెళ్ళిళ్ళు చేసింది.

తను హాస్టల్లో వంటచేస్తూ, అక్కడే తనను చేర్పించి చదివించింది. అలా తను డిగ్రీ పూర్తి చేయగలిగాడు. గవర్నమెంటు ఆఫీసులో జూనియర్ అసిస్టెంటుగా ఉద్యోగం సంపాదించుకున్నాడు.

అమ్మను పనిమాన్పించి వేరే ఇల్లు తీసుకొని ఉంటున్న సమయంలో.... ఆవేశంలో జరిగిన పొరబాటే తప్ప, మనుషుల్ని చంపే దుర్మార్గుడు కాదంటూ

నాన్న సత్ప్రవర్తనను గమనించి శిక్షాకాలానికి ముందుగానే 'గాంధీ జయంతి' సందర్భంగా విడుదల చేస్తున్నారని తెలిసి అమ్మ, తను ఎంతగానో సంతసించారు.

కానీ...

ఓ రోజు జైలులో ముళ్ళకంపలను నరుకుతున్న నాన్న పాముకాటుకు గురై మరణించడం... ఊహించని షాక్.

ఐనా అమ్మ తొందరగానే తేరుకుంది. మూడేళ్ళ క్రితం లక్ష్మితో తన వివాహం జరిపించింది. ఉన్నంతలో హాయిగా ఉంటున్నారన్న సమయంలో....

ఈ ఉత్తరాల కలకలం... నిజానికి అమ్మకు నోటి దురుసుతనం కాస్త ఎక్కువే తన మాట నెగ్గించుకోవడానికి ఆవిడ ఆయుధం ఆమెకున్న నోరే అని చెప్పవచ్చు. కానీ!

తన బిడ్డల ద్వారా ఎదుర్కొన్న అవమానాలు అమ్మనీ స్థితికి తీసుకొచ్చాయా? లేకుంటే తానొక ఆడదైయుండీ - ఆడపిల్లల పట్ల ఇంత ద్వేషం పెంచుకొని, ఇలా విపరీత ధోరణులను ప్రదర్శించడమెంత వరకు న్యాయం?

ఆ కసి, కోపం భ్రూణ హత్యలను చేసేంతగా ఉసిగొల్పాయా?

అలాంటప్పుడు తనకు పెళ్ళి ఎందుకు చేసినట్లు? బహుశా తనకందరూ మగపిల్లలే పుట్టారనుకుందేమో? ఆలోచనలకు భిన్నంగా జరుగుతుంటే తట్టుకోలేక ఈ దారుణానికి పూనుకుందా?

వెంటనే లేచివెళ్ళి అడుగుదామన్నంత వెర్రి ఆవేశం వచ్చింది. అంతలోనే వివేకం అడ్డొచ్చింది.

తన పిచ్చిగానీ-అడిగినా ఒప్పుకుంటుందా? తన నోటిగాయతో వీధినీ, వాడనూ ఒక్కటి చేస్తుంది. పరువుగా బతుకుతున్న తను కుంటుంబాన్ని జెండాకెక్కిస్తుంది. ఈ వయసులో తల్లిని రాచిరంపాన పెడ్తున్న రాక్షసుడిగా తనపై ముద్రవేయడానికి కూడా ఏ మాత్రం వెనుకాడదని తల్లి తెగింపు గుర్తొచ్చి ఆగిపోయాడు.

తన తల్లి చేసిన పాపపు పని తెలిసిన తన శ్రేయోభిలాషులెవరో ఇంకా కళ్ళు తెరవని పసిపిల్లల పేరుతో.. ఉత్తరాలను పంపి, తన కళ్లను తెరిపించి పుణ్యం కట్టుకున్నారు. కనిపించని ఆ మంచి మనసున్న మనిషికి మనసులోనే నమస్కరించాడు.

'ఈ రక్త చరిత్ర ఈ ఇంట్లో ఇక పునరావృతం కానీయను'- అనుకుంటూ డాబా దిగి క్రిందికి వచ్చాడు.

ఆ రాత్రి భోజనం చేస్తుండగా మౌనంగా ఉన్న కొడుకుతో ఏదో మాట్లాడబోయి సీరియస్‌గా ఉన్న అతని వాలకం చూసి మౌనంగా ఉండిపోయింది రాజమ్మ. భోజనం మధ్యలో లక్ష్మి గబుక్కున లేచివెళ్ళి వాంతి చేసుకుంటుంటే, 'ఏమైంది లక్ష్మీ' అంటూ గబుక్కున లేచి వెళ్ళాడు.



రాజమ్మ కల్పించుకొని "మళ్ళీ నెల తప్పినట్లుందేమోనన్పిస్తుందిరా! రేపు డాక్టరు గారి వద్దకు తీసుకెళ్తాను.. విషయం తెలుస్తుంది..." అంది పెద్దరికంతో.

ప్రశ్నార్థకంగా భార్య ముఖంలోకి చూసిన రాజేష్‌కి తలొంచిన లక్ష్మి వాలకం చూశాక విషయం అర్థమైంది.

మెల్లిగా ఆమెను తీసుకొచ్చి తాగడానికి నీళ్ళిచ్చి "లక్ష్మీ! నేను పాలు కాచి తెస్తాను. తాగి పడుకో!" అంటూ బెడ్‌రూంలోకి తీసుకెళ్ళాడు.

ఎన్నడు చూడని తీరులో కొడుకు ప్రవర్తన చూసి ఆశ్చర్యపోయింది రాజమ్మ.

తెల్లవారింది.

తల్లి వారిస్తున్నా వినకుండా సెలవు పెట్టి భార్యను ప్రైవేటు నర్సింగ్‌హోమ్‌కు తీసుకెళ్ళి పరీక్షలు చేయించాడు.

"మూడు నెలలు నిండాయి. కానీ చాలా బలహీనంగా వుంది. సాధ్యమైనంతవరకు బెడ్‌రెస్ట్‌లోనే ఉండాలి. బలమైన ఆహారం, పండ్లు తినిపించండి. మరో నెలపోయాక రండి'' అంటూ మందులు రాసిచ్చింది డాక్టరు.

ఆటోలో ఇల్లు చేరి తల్లికి విషయం చెప్పాడు. నిర్లిప్తంగా విని ఊరుకుంది. కోడలితో తనను వెళ్ళనీయనందుకు మనసులో కోపంగా ఉందామెకు.

రాత్రి భోజనాల సమయంలో తల్లి వినేలా భార్యతో "లక్ష్మీ' బట్టలవీ సర్దుకో! రేపొద్దున ప్రయాణం. ఇంతకు ముందే అత్తయ్య మావయ్యకు నిన్ను తీసుకొస్తున్నాననీ, నీకు పురుడు వచ్చేవరకు నీవక్కడే ఉంటావనీ ఫోన్ చేశాను. వాళ్ళెంత సంతోషించారో తెలుసా? అక్కడే ఉండి హాయిగా రెస్ట్ తీసుకో. వీలున్నప్పుడల్లా నేనొచ్చి వెళుతుంటాను. సరేనా?" అన్నాడు ప్రేమగా.

''అత్తయ్యకూ మీకు ఇబ్బంది అవుతుందేమోనండీ!" అంటూ నసిగింది. ''లక్ష్మీ నేనున్నాను గదా! జాగ్రత్తగా చూసుకుంటాను" అంటూ భరోసా ఇచ్చాడు. తల్లి వారిస్తున్నా వినకుండా మర్నాడు ఉదయం భార్యను తీసుకుని బయలుదేరాడు.

బస్సులో కిటికీ పక్కన కూర్చున్న లక్ష్మికి బయటనుండి వీస్తున్న చల్లగాలి ఎంతో స్వాంతననీ, హాయినీ కల్గిస్తుంది. తృప్తిగా కళ్ళు మూసుకుంది గతం కళ్ళముందు కదలసాగింది.

తమ వీధిలో నాలుగిళ్ళవతల ఉంటున్న మణెమ్మగారు వైభవ లక్ష్మీ వ్రత ఉద్యాపన ఉందనీ, వచ్చి వాయనము తీసుకొనడానికి రమ్మని పిలవడం, వెళ్ళిన తనకక్కడ ఇంటర్‌లో క్లాస్‌మేట్ అయిన వాణి కన్పించడం జరిగింది. చాలా రోజుల తరువాత కలుసుకున్న తాము చాలాసేపు కబుర్లు చెప్పుకొని, మళ్ళీ కలుసుకోవడానికి వీలుగా ఫోన్ నంబర్లు తీసుకున్నారు.

తరువాత రెండు రోజులకనుకుంటా

తానే ఫోన్ చేసింది. ఎన్నో విషయాలు మాట్లాడుకొన్నాకా....

ఒకప్పుడు "కథ రాశాను వినండి" అంటూ కాలేజీలో మేము వినేదాకా, మా అభిప్రాయాల్ని చెప్పేదాకా మమ్మల్ని వేధించేదానివి ఇంకా రాస్తున్నావా? ఎన్ని బహుమతులను కొట్టేశావేంటి? అని అడిగింది వాణిని.

"ఏదో రాస్తున్నాను లేవే! ఆడపాదడపా పత్రికల్లో అచ్చవుతున్నాయి. కొద్దో గొప్పో పారితోషికం కూడా అందుతుంది" అంటూ చెప్పి నవ్వింది.

తరువాత తన గురించి అడిగింది. చివరకు కన్నతల్లితో కూడా చెప్పకుండా మనసులో దాచుకున్న బడబాగ్నిని బయటపెడుతూ ఫోన్‌లోనే ఏడ్చినంత పనిచేసింది.

మళ్ళీ నెల తప్పిన సంగతి చెప్తూ "ఈసారి కూడా ఏమవుతుందోనని భయంగా ఉంది వాణీ" అని అంటుంటే... "నువ్వేం భయపడకు లక్ష్మీ! నేనంతా చూసుకుంటాను. నీకేం కాదు నిశ్చింతగా ఉండు అంటూ తన ఇంటి అడ్రస్ అడిగి, ఫోన్ పెట్టేసింది.

"తనకు కథలు రాసే వాణిని ఏడిపించడమే తెలుసుకానీ, ఆ రాతలు ఇంత పవర్‌ఫుల్‌గా తన బ్రతుకు గీతల్ని చక్కదిద్దుతాయన్న ఆలోచన ఏ మాత్రమైనా తన ఊహకందలేదు కదా!" అని ఆలోచిస్తూ.

"థ్యాంక్యూ వాణీ! నువ్వు నీ కలం

**రాత్రి భోజనాల సమయంలో తల్లి వినేలా భార్యతో "లక్ష్మీ, బట్టలవీ సర్దుకో! రేపొద్దున ప్రయాణం. ఇంతకు ముందే అత్తయ్య మావయ్యకు నిన్ను తీసుకొస్తున్నాననీ, నీకు పురుడు వచ్చేవరకు నీవక్కడే ఉంటావనీ ఫోన్ చేశాను. వాళ్ళెంత సంతోషించారో తెలుసా? అక్కడే ఉండి హాయిగా రెస్ట్ తీసుకో. వీలున్నప్పుడల్లా నేనొచ్చి వెళుతుంటాను. సరేనా?" అన్నాడు ప్రేమగా.**

బలం చూపించి నా కడుపు పంటను కాపాడావు! ఈసారి నాకాడపిల్ల అంటూ పుడితే నీపేరే పెట్టి నీ ఋణం తీర్చుకుంటాను" అని అనుకుంటూ.. ఎప్పుడూ లేనంత నిశ్చింతగా భర్త భుజంపై తలవాల్చింది.

# చైతన్య దీపిక - యర్రా అబద్ధం

ప్రజాతంత్ర ఉద్యమాలకు, పరీక్షా సమయంలో ఊపిరిగా నిలిచిన ఆమె వ్యక్తిత్వం అజరామరం. ప్రతి చిన్న పెద్ద కార్యక్రమాలలో ఎంతో నిబద్ధతతో కూడిన ఆమె పాత్ర ఏనాటికైనా సజీవమే. ఆమె కుటుంబ బాధ్యత, నిర్వహణ ఎంతో శాస్త్రీయంగా క్రమశిక్షణతో ఉండేది. ఆర్థిక విషయాల్లో 'అబద్ధం' గారి పాత్ర నిజంగా గణిత శాస్త్రమే.

అబద్ధంగారు పాలకొల్లు ప్రక్కనే ఉన్న దిగమర్రులో జన్మించారు. తల్లిదండ్రులు బాసిన మల్లమ్మ, బాసిన చిన్నయ్యగార్లు. ఇంట్లో చేనేత మగ్గంమీద తల్లి పనిచేసేవారు. తండ్రి ఆయుర్వేద వైద్యం చేసేవారు. మానవ జాతి అంతా ఒకటే కులం. అందరికీ ఒకే దైవం అనేది ఆయన అభిప్రాయం. తండ్రి సంస్కారం, తల్లి కఠోర పరిశ్రమ బాగా అలవడింది అబద్ధంగారికి. కమ్యూనిస్టు పార్టీ ద్వారా అబ్బిన సామాజిక స్పృహ ఆమె జీవితానికి సార్థకతనిచ్చాయి.

డిసెంబరు 1964, 30 అర్ధరాత్రి 2గంటల సమయం. పాలకొల్లు నుండి ఢిల్లీ వరకు దేశవ్యాపితంగా అరెస్టులతో నాయకులంతా జైళ్ళపాలయ్యారు. 1965 చివరిలో అరెస్టులను ఖండిస్తూ విజయవాడలో జరిగిన పౌరహక్కుల సభకు పాలకొల్లు నుండి కాలనీలో ఉన్న మహిళలందరం రైళ్ళలో విజయవాడ వెళ్ళాం. ఆ సభకు ఢిల్లీనుండి సుప్రీంకోర్టు జడ్జి ఎస్.సి.ఛటర్జీ హాజరయ్యారు.

1968 నుంచి మొదలైన మహిళా ఉద్యమ పునర్నిర్మాణం జిల్లాలో పాలకొల్లు చేనేత సొసైటీ కాలనీ నుంచే ప్రారంభమయింది. మహిళా అభ్యుదయం కోసం పాటుపడే ప్రజాశక్తి పత్రిక వారపత్రికగా నడుస్తున్న స్థితి నుంచి దినపత్రికగా అభివృద్ధి చెందటానికి మహిళా సంఘంగా వరికోతలకు సిద్ధమయ్యాం. వరికోతకు వెళితే వచ్చే కూలి మొత్తాన్ని పత్రిక నిధిగా ఇవ్వటమైనది. ఈ కార్యక్రమంలో అబద్ధంగారిది ముఖ్యపాత్ర. ఆ కాలనీ నుంచి 40మంది మహిళలు వరికోతలో ఉత్సాహంగా పాల్గొన్నారు. నిరక్షరాస్యులైన సానుభూతిపరులకు ఆ రోజుల్లో అబద్ధంగారి ఇంటి వద్ద ప్రజాశక్తి పత్రిక చదివి వినిపించేవాళ్ళం. వియత్నాం యుద్ధం జరుగుతున్న సమయంలో ఆ ప్రాంతంలో బాల సంఘం ఏర్పాటు చేసి వాళ్ళు చదువుకునేందుకు బాలమిత్ర, చందమామ, కథల పుస్తకాలు ట్రంకు పెట్టెలో ఏర్పాటు చేశాము. బాలసంఘమే ఆ రహస్య రోజుల్లో ఉద్యమానికి తోడ్పాటునివ్వడంలో ముఖ్యపాత్ర.

1967లో మహనీయుడు సుందరయ్య చూపిన మార్గంలో సి.పి.యం పార్టీ మొదటి మహిళాశాఖ సభ్యులుగా పాలకొల్లులో కామ్రేడ్



ఏలూరు వెంకటరత్నం, యర్రా అబద్ధంగార్లు ఇద్దరూ ఒకే మార్గంలో జీవనయానం సాగించారు. ఒకేసారి అందరి దగ్గర సెలవు తీసుకుని, ఒకరినొకరు తోడుగా కలసి వెళ్ళిపోయారు.

పాలకొల్లు మహిళాశాఖ అద్భుత సేవా కార్యక్రమాలకు స్పందించిన పాలకొల్లు మున్సిపాలిటీ మహిళా సంఘం ఆధ్వర్యంలో నడుస్తున్న కుటుంబ న్యాయ సలహా కేంద్రానికి స్థలాన్ని కేటాయించింది. అనేకమంది అభిమానులు, పెద్దల సహకారంతో సమతా భవనం నిర్మాణం జరిగింది.

కార్యకర్తలు, భావితరం బంగారు భవితకోసం మరింత శక్తివంతంగా ఉద్యమించి, వారు ఆశించిన నిజమైన స్వతంత్ర భారతాన్ని సాధించగలరని ఆశిస్తూ, మా ప్రియతమ సహచరులు యర్రా అబద్ధం, ఏలూరి వెంకటరత్నం గార్లకు నివాళులతో....

**- అల్లూరి మన్మోహిని.**

# మనువులూ, హిట్లర్‌లూ, గోబెల్స్‌లూ! కాస్త నోళ్ళు మూసుకుంటారా?



...వాళ్ళు త్రివర్ణ పతాకాన్ని కాలబెట్టే వాళ్ళు. బ్రిటీష్ వాళ్ళను క్షమాభిక్ష వేడుకున్న సావర్కర్‌కు శిష్యులు వాళ్ళు. ఇప్పుడు హర్యానాలో ఖట్టర్ ప్రభుత్వం వాళ్ళదే. ఈ ప్రభుత్వం షహీద్ భగత్‌సింగ్ పేరుతో ఉన్న విమానాశ్రయానికి ఒక 'సంఘీయుడి' పేరు పెట్టింది. వీళ్ళా మాకు దేశభక్తి గురించి పాఠాలు చెప్పేది? దేశం గురించి ఆర్ఎస్ఎస్‌తో చెప్పించుకునే దుస్థితిలో మేం లేం... మేము ఈ దేశానికి చెందిన వాళ్ళం. ఈ మట్టిని మేం ప్రేమిస్తాం. ఈ దేశంలో ఉన్న 80 శాతం పేద ప్రజల కోసం మేం పోరాడుతాం. మా దృష్టిలో దేశభక్తి అంటే ఇదే. మాకు డాక్టర్ బాబా సాహెబ్ అంబేద్కర్ రూపొందించిన రాజ్యాంగంపై పూర్తి విశ్వాసం ఉంది. అంతేకాదు, ఈ దేశ రాజ్యాంగాన్ని అవమానించే వాళ్ళను మేం సహించబోమని కూడా స్పష్టం చేస్తున్నాం. 'సంఘీయులే' కానివ్వండి, లేదా మరెవరైనా సరే...

అయితే,' ఝుండేవాలా' (ఆర్ఎస్ఎస్ ఢిల్లీ కార్యాలయం)లో 'నాగపూర్' (ఆర్ ఎస్ ఎస్ కేంద్ర కార్యాలయం)లో నిర్వచించే రాజ్యాంగంపై మాత్రం మాకెలాంటి విశ్వాసం లేదు! మాకు మనుస్మృతిపై ఎలాంటి విశ్వాసం లేదు. ఈ దేశంలో వేళ్ళూనుకున్న కులవ్యవస్థపై మాకు విశ్వాసం లేదు! అట్లాగే, ఇదే రాజ్యాంగంలో డాక్టర్ బి.ఆర్.అంబేద్కర్ 'రాజ్యాంగ పరిహారం' గురించి కూడా చెప్పారన్న విషయం మరచిపోవద్దు. మరణశిక్షను రద్దు చేయాలని కూడా అంబేద్కర్ అభిప్రాయపడ్డారన్న విషయం మర్చిపోవద్దు. భావ ప్రకటనా స్వేచ్ఛకు ఆయన సర్వోన్నత స్థానం ఇచ్చారన్న విషయం కూడా గుర్తుంచుకోవాలి. ఈ అంశాల న్నింటితో సహా, మన మౌలిక హక్కులను, రాజ్యాంగపరమైన హక్కులను నిలబెట్టు కోవాలని మేం ఆకాంక్షిస్తున్నాం.

కానీ ఈరోజు ఏబీవీపీ తనకున్న మీడియా అండతో ఈ విషయాన్ని పూర్తిగానే తారుమారు చేయడం చాలా సిగ్గుచేటు.. బాధాకరం కూడా. విషయాన్ని అది పూర్తిగా నీరుగారుస్తోంది. నిన్న ఏబీవీపీ సంయుక్త కార్యదర్శి మాట్లాడుతూ, 'మేం ఫెలోషిప్ కోసం పోరాడుతామ'ని చెప్పాడు. ఎంత హాస్యాస్పదం ఇది! ఇప్పటికే వీళ్ల ప్రభుత్వం, మేడం 'మను'స్మృతి ఇరానీ ఫెలోషిప్‌లు లేకుండా చేసేశారు. ఉన్నత విద్యకు బడ్జెట్‌లో వీళ్ళ ప్రభుత్వం 17 శాతం కోత విధించారు. దాంతో మన హాస్టళ్ళు గత నాలుగేండ్లుగా అఘోరిస్తున్నాయి. మనకు వై-ఫై లభ్యం కాలేదు. బీహెచ్ఈఎల్ ఒక బస్సునివ్వగా, దాంట్లో చమురు పోయడానికి అధికారుల వద్ద డబ్బు లేదు! ఏబీవీపీ వాళ్ళు మాత్రం మేం హాస్టళ్ళు నిర్మింపజేస్తామని, వై-ఫై తెప్పిస్తామని పెద్ద పెద్ద మాటలు మాట్లాడుతున్నారు.

మిత్రులారా! ఈ దేశంలో మౌలిక ప్రశ్నలపై చర్చ ప్రారంభిస్తే వీళ్ళ ముసుగు తొలగిపోతుంది. మేం మౌలిక ప్రశ్నలు లేవనెత్తుతున్నందుకు గర్విస్తున్నాం. వాటిపై చర్చ చాలా అవసరం... జెఎన్‌యూలో జిహాదీలున్నారని సుబ్రమణ్యస్వామి అన్నాడు. జెఎన్‌యూ వాళ్ళు హింసను వ్యాపింప జేస్తున్నారని అంటున్నారు. నేనీ జెఎన్‌యూ గడ్డ మీది నుంచి ఆర్ఎస్ఎస్ సిద్ధాంతకర్తలను సవాల్ చేస్తున్నాను. రండి, మాతో వాదిం చండి! మేమసలు 'హింసకు సంబంధించిన మౌలిక అవగాహనపై చర్చ చేయాలను కుంటున్నాం. 'ఖూన్ సే తిలక్ కరేంగే, గోలియోంసే ఆరతీ' (నెత్తుటితో తిలకం దిద్దుకుంటాం, తుపాకీ గుళ్ళతో హారతి) అని ఏబీవీపి వాళ్ళు చేస్తున్న నినాదాల గురించి కూడా మాట్లాడుకుందాం రండి. ఈ దేశంలో మీరెవరెవరి రక్తం పారించాలను కుంటున్నారో చెప్పండి. ఎవరిపై తూటాలు పేల్చాలనుకుంటున్నారో చెప్పండి. అవును, మీరు తుపాకీ గుళ్ళు కురిపించారు. బ్రిటీష్ వాళ్ళతో చేయి కలిపి దేశ స్వాతంత్ర్యం కోసం పోరాడే వాళ్ళపై గుళ్ళు కురిపించారు. దేశంలో పేదరికంతో, ఆకలితో పీడితులైన వాళ్ళపై మీరు గుళ్ళు కురిపించారు. మీరు ముస్లింలపై గుళ్ళు కురిపించారు.

మహిళలు తమ హక్కుల కోసం ఉద్యమిస్తే, 'ఐదు వేళ్ళు సమానమవుతాయా' అని మీరంటారు. మహిళలు 'సీత' లాగా ఉండాలని, అగ్నిపరీక్షకు దిగాలని మీరంటారు. ఈ దేశంలో ఉన్నది ప్రజాస్వామ్యం కదా! ప్రజాస్వామ్యంలో అందరికీ సమానంగా జీవించే హక్కులుండాలి కదా! విద్యార్థులైనా, ఉద్యోగులైనా, పేదలైనా, కార్మికులైనా, రైతులైనా... అంబానీ అయినా, అదానీలైనా అందరికీ హక్కులు సమానమే కదా! కానీ మహిళల సమాన హక్కుల గురించి మాట్లాడితే, భారతీయ సంస్కృతిని నాశనం చేయాలనుకుంటున్నారని మీరు గొంతు చించుకుంటారు. నిజమే మేం మీ దోపిడీ సంస్కృతిని నిజంగానే నాశనం చెయ్యాలను కుంటున్నాం! మీ కులతత్వ సంస్కృతిని నాశనం చేయాలనుకుంటున్నాం. మీ మనువాద సంస్కృతిని నిర్వచనాన్నే మార్చా లని మేమంటున్నాం. అసలు సంస్కృతికి నిర్వచనాన్నే మార్చాలని మేమంటున్నాం. అసలు వీళ్ళకు సమస్య ఎక్కడొస్తోంది? మనం

ప్రజాస్వామ్యం గురించి మాట్లాడితే వీరికి కడుపుమంటగా ఉంది. 'లాల్ సలాం'తో పాటు 'నీలా సలాం' అని మనం నినదిస్తే, మార్క్స్‌తోపాటు బాబా సాహెబ్ అంబేద్కర్ గురించి మనం మాట్లాడితే వీరికి మింగుడు పడకుండా ఉంది... కుట్ర వీళ్ళదే. వీళ్ళసలు బ్రిటీష్ వాళ్ళ తొత్తులు! కావాలంటే నాపై పరువు నష్టం కేసు పెట్టుకోండి. ఆర్ఎస్ఎస్ చరిత్రే బ్రిటీష్ వాళ్ళతో కుమ్మక్కయిన చరిత్రని మళ్ళీ మళ్ళీ అంటాను! ఈ దేశద్రోహులు మనల్ని దేశభక్తి సర్టిఫికేట్ చూపాలని డిమాండ్ చేస్తున్నారు.

నా మొబైల్‌ను పరిశీలించండి మిత్రులారా! మా తల్లిని నానా రకాల బూతులు తిడుతూ మెసేజ్‌లు పెట్టారు. వీళ్ళేనా భారతమాత గురించి మాట్లాడేది? ఒకవేళ మీరు చెప్పే 'భారతమాత'లో నా తల్లి భాగం కాకపోతే నేను 'భారతమాత' అనే మీ అవగాహనను నేనంగీకరించను. నా తల్లి అంగన్‌వాడీ సేవకురాలిగా పనిచేస్తోంది. రూ. 3,000లతో మా కుటుంబం బతుకుతోంది. ఆమెను వీళ్ళు బూతులు తిడుతున్నారు. వీళ్ల 'భారతమాత' నినాదానికి నేను సిగ్గుపడుతున్నాను. ఈ దేశం లో ఉన్న నిరుపేద, దళిత, రైతుకూలీల తల్లులెవరూ వీళ్ళ 'భారతమాత' పరిధిలోకి రారు. నేనంటాను 'జై'! దేశంలోని మాతలందరికీ జై! తండ్రు లందరికీ జై! అక్కాచెల్లెండ్రకు జై! రైతుకూలీలకు, కార్మికు లకు, ఆదివాసీలకు, దళితులకు జై! వాళ్ళకు ఇలా అనే దమ్ముందా? ఉంటే అనమనండి. 'ఇంక్విలాబ్ జిందాబాద్' అని అనమనండి వీళ్ళను. 'భగత్‌సింగ్ జిందాబాద్' అనమ నండి. 'సుఖదేవ్ జిందాబాద్' అనమనండి. 'అష్ఫాఖుల్లా ఖాన్ జిందాబాద్' అనమని అనండి. 'బాబా సాహెబ్ అంబేద్కర్ జిందాబాద్' అనమనండి.

బాబా సాహెబ్ 125వ జయంతి పేరుతో మీరాడిందంతా నాటకం! మీకు ధైర్యముంటే, బాబాసాహెబ్ చెప్పినట్టుగా ఈ దేశంలో కులవాదమే అతి పెద్ద సమస్య అని ఒప్పుకోండి. కులతత్వం గురించి మాట్లాడండి. రిజర్వేషన్లు అమలు చేయండి. ప్రైవేటు రంగంలో రిజర్వేషన్ అమలు చేయండి.. అప్పుడు నమ్ముతాం మీకు ఈ దేశంపై విశ్వాసం ఉందని. అసలు దేశమంటే ఏమిటి? దేశమంటే మనుషులు! దేశం గురించిన మీ అవగాహనలో పేదలకు,నిస్సహాయులకు, రైతుకూలీలకు, ఆదివాసులకు, దళితులకు చోటే లేదు. నేను నిన్నొక టీవీ డిబేట్‌లో మాట్లాడాను. దీపక్ చౌరాసియాతో చెప్పాను. ఇది చాలా సీరియస్ సమయం అనే విషయం గుర్తుంచుకోండని అన్నాను. దేశంలో పడగ విప్పుతున్న ఫాసిజంతో మీ మీడియాకు కూడా ముప్పేనని చెప్పాను. ఇకపై మీకక్కాడా సంఘ్ కార్యాలయం నుంచే స్క్రిప్టులు వస్తాయని అన్నాను. సరిగ్గా ఇందిరాగాంధీ సమయంలో కాంగ్రెస్ కార్యాలయం నుంచి వచ్చినట్టుగానే. కొంత మంది మీడియా వాళ్ళు అంటున్నారు. మా పన్నులతో, సబ్సిడీ డబ్బులతో జెఎన్‌యూ నడుస్తుంది అని. అవును నిజమే! అనుమానమేమీ లేదు. కానీ అసలు విశ్వ విద్యాలయాలు ఉన్నది దేనికోసం అని మేమడుగుతున్నాం. విశ్వ విద్యాలయాలుం డేది సమాజంలోని 'కామన్ కాన్సెన్స్' (సామూహిక చేతన)ను విమర్శనాత్మకంగా విశ్లేషించడానికే. అవి ఆ పని చేయకపోతే దేశమే సరిగా నడవదు. అలాంటి దేశం కేవలం పెట్టుబడిదారులకు నెలవుగా మాత్రమే మిగిలిపోతుంది. దోపిడీ, పీడనలకు మాత్రమే ఆలవాలంగా మారిపో తుంది. దేశ ప్రజల సంస్కృతి, విశ్వాసాలకు, హక్కులకు స్థానం లేనప్పుడు అసలు దేశం అనే మాటలో అర్థమే లేదు. మేం ఈ దేశంతోపాటుగా సంపూర్ణంగా నిలబడి ఉన్నాం. భగత్‌సింగ్, బాబాసాహెబ్ కన్న కలల కోసం నిలబడి ఉన్నాం. అందరికీ సమాన హక్కులుండాలన్న అవగాహనతో నిలబడ్డాం. అందరికీ జీవించే హక్కు ఉండాలి. అందరికీ తినే, మాట్లాడే, నివసించే హక్కుండాలి. ఈ స్వప్నంతోనే మేం నిలబడి ఉన్నాం. దీని కోసమే రోహిత్ ప్రాణత్యాగం చేశాడు. కానీ రోహిత్ విషయంలో జరిగినట్లు జెఎన్‌యూలో మేం జరగనివ్వమని కేంద్ర ప్రభుత్వానికి సవాల్ చేసి మరీ చెబుతున్నాం. మేం భావ ప్రకటనా స్వేచ్ఛ కోసం నిలబడుతాం. పాకిస్తాన్, బంగ్లాదేశ్‌ల విషయం వదిలెయ్యండి. ప్రపంచ పేదలంతా ఏకం కావాలని మేమంటున్నాం. "ప్రపంచ కార్మికులారా ఏకం కండి" అని కోరే వాళ్ళం మేం. ప్రపంచ మానవత వర్ధిల్లాలి, భారత మానవత వర్ధిల్లాలి అని మేమంటాం. మానవత్వానికి వ్యతిరేకంగా నిలబడిందెవరో మేం గుర్తించాం. మనువాదం, కులవాదం.. బ్రాహ్మణ వాదంతో కుమ్మక్కయిన పెట్టుబడిదారీ విధానం- ఇవే మానవత్వానికి శత్రువులు. వీటి ముఖాలను బట్టబయలు చేయాలి. నిజమైన ప్రజాస్వామ్యం, నిజమైన స్వాతంత్ర్యం దేశంలో నెలకొల్పాలి. ఆ స్వాతంత్ర్యం రాజ్యాంగం ద్వారానే వస్తుంది. పార్లమెంటు ద్వారా వస్తుంది. ప్రజాస్వామ్యం ద్వారా వస్తుంది. అందుకే మీ అందరికీ విజ్ఞప్తి చేస్తున్నాను, మన మధ్య ఎన్ని విభేదాలున్నా, భావ ప్రకటనా స్వేచ్ఛ కోసం, రాజ్యాంగం కోసం, దేశ సమగ్రత కోసం మనందరం ఐక్యంగా నిలబడదాం.

సంఘీయులే మన దేశాన్ని చీలదీసే శక్తులు... ఉగ్రవాదాన్ని పెంచి పోషించే శక్తులు. ఇక చివరి ప్రశ్న కసాబ్ ఎవరు? అఫ్జల్ గురు ఎవరు? శరీరాలపై బాంబులు కట్టుకొని హత్యలు చేయడానికి సిద్ధపడుతున్న ఆ పరిస్థితు లేమిటి? ఈ ప్రశ్నను విశ్వ విద్యాలయాల్లో చర్చించకపోతే అవి ఉండీ

**కొంత మంది మీడియా వాళ్ళు అంటున్నారు. మా పన్నులతో, సబ్సిడీ డబ్బులతో జెఎన్‌యూ నడుస్తుంది అని. అవును నిజమే! అనుమానమేమీ లేదు. కానీ అసలు విశ్వ విద్యాలయాలు ఉన్నది దేనికోసం అని మేమడుగుతున్నాం. విశ్వ విద్యాలయాలుండేది సమాజంలోని 'కామన్ కాన్సెన్స్'(సామూహిక చేతన)ను విమర్శనాత్మకంగా విశ్లేషించడానికే. అవి ఆ పని చేయకపోతే దేశమే సరిగా నడవదు. అలాంటి దేశం కేవలం పెట్టుబడిదారులకు నెలవుగా మాత్రమే మిగిలిపోతుంది. దోపిడీ, పీడనలకు మాత్రమే ఆలవాలంగా మారిపోతుంది. దేశ ప్రజల సంస్కృతి, విశ్వాసాలకు, హక్కులకు స్థానం లేనప్పుడు అసలు దేశం అనే మాటలో అర్థమే లేదు.**

ప్రయోజనం లేదని నా అభిప్రాయం. హింసను కూడా నిర్వచించుకుందాం. హింస అంటే ఏమిటి? తుపాకీ తీసుకొని ఒకరిని చంపడమే హింస కాదు. దళితులకు రాజ్యాంగం ఇచ్చిన హక్కులను జెఎన్‌యూ అడ్మినిస్ట్రేషన్ ఇవ్వడానికి నిరాకరిస్తే అది కూడా హింసే అవుతుంది. ఇది వ్యవస్థీకృత హింస, న్యాయం అంటే ఏమిటి? దీనిని నిర్ణయించేదెవరు? బ్రాహ్మణవాద వ్యవస్థలో దళితులకు మందిరంలోకి ప్రవేశం లేదు. ఆనాడు అదే న్యాయం. బ్రిటీష్ కాలంలో కుక్కలకు, భారతీయులకు రెస్టారెంట్లలోకి ప్రవేశం లేదనేవారు. అప్పటికి అదే న్యాయం. కానీ ఈ న్యాయాన్ని అప్పుడూ సవాలు చేశారు. ఎబీవీపీ, ఆర్‌ఎస్‌ఎస్‌లు చెప్పే న్యాయాన్ని సవాల్ చేస్తున్నాం. మీ న్యాయం, మా న్యాయాన్ని ఇముడ్చుకోనప్పుడు మీ న్యాయాన్ని మేం ఒప్పుకోం. మీరు చెప్పే స్వాతంత్ర్యాన్ని మేం ఒప్పుకోం. మనుషులందరికీ వారి రాజ్యాంగ హక్కులు లభించిన రోజునే మేం స్వాతంత్ర్యాన్ని గుర్తిస్తాం. ప్రతి మనిషికీ తన రాజ్యాంగ హక్కులతోపాటు దేశంలో సమాన హోదాను కల్పించినప్పుడే, ఆ రోజునే మేం ఇది న్యాయమని ఒప్పుకుంటాం. జెఎన్‌యూ విద్యార్థి సంఘం ఏ రకమైన హింసనూ, ఏ ఉగ్రవాదినీ, ఏ ఉగ్రవాద సంఘటననూ, ఎలాంటి దేశ వ్యతిరేక చర్యనూ ఏ రకంగానూ సమర్థించదని నేను స్పష్టం చేస్తున్నాను. కొంత మంది.. గుర్తు తెలియని వ్యక్తులు 'పాకిస్తాన్ జిందాబాద్' అని నినాదాలు చేశారు. దానిని జెఎన్‌యూ విద్యార్థి సంఘం తీవ్రంగా ఖండిస్తోంది.

**తెలుగు సేత: జి.వి.కె ప్రసాద్**

ప్రజాశక్తి సౌజన్యంతో...

---

# ఆపద్బాంధవి - ఏలూరి వెంకటరత్నం



భారతదేశ స్వాతంత్ర్యం వచ్చిన అనంతరం, నిజాం క్రూరపాలనకు వ్యతిరేకంగా తెలంగాణాలో, ఆంధ్ర మహాసభ నాయకత్వాన తెలంగాణ ప్రజాపోరాటం ప్రారంభం అయింది. పోరాటానికి రక్షణగా నిలబడి కమ్యూనిస్టు పార్టీ ఎన్నో త్యాగాలు చేసింది. ఆంధ్ర ప్రాంతంలో ఎంతోమంది కమ్యూనిస్టు నాయకులను ప్రభుత్వం తుపాకీలతో కాల్చి చంపింది. మొత్తం తెలంగాణాలో నాలుగువేల మంది పార్టీ నాయకులు ప్రాణాలు బలి ఇచ్చారు. ప్రభుత్వం పార్టీని నిషేధించింది.

అంతటి భయంకర పరిస్థితులలో నర్సాపురం, పాలకొల్లు ప్రాంతాలలో అనేకమంది కష్టజీవులు, కార్మిక కుటుంబాలు పార్టీ నాయకులకు రక్షణగా నిలచి, నాయకులకు తల్లిదండ్రులుగా తమ ఇళ్ళల్లో రహస్యంగా ఆశ్రయం ఇచ్చి కాపాడారు. ఏలూరు వెంకటరత్నం, తాను రక్షణగా నిలబడి అమరవీరులు పడాల సుబ్బారావు వగైరాలను, వారి ఇంట్లో ఆహారం వగైరా అన్ని ఏర్పాట్లుచేసి బయట తలుపు గొళ్ళెం పెట్టి, తాను ఏమీ ఎరగనట్లు బయట కూర్చొని కాపలా కాస్తూ, వెయ్యి కళ్ళతో పరిసరాలను గమనిస్తూ నాయకులను ఆదరించారు. అంతటి భయంకర పరిస్థితులలో వెంకటరత్నం సాహసం, చైతన్యం ఎంతటిదో ఊహించాల్సిందే. అంతటి గడ్డుకాలంలో పార్టీ నాయకులకు రక్షణ ఇచ్చి, ఆదరించిన అజ్ఞాత మహిళల చరిత్ర మరుగున పడిపోయింది. పాలకొల్లులో వీరెడ్డి చాయమ్మ, బాసిన నూకమ్మ వగైరాలు కన్నతల్లులను మరిపించి నాయకుల మల మూత్రాలు ఎత్తివేసిన మానవతామూర్తులు, వారిలోనే అసలైన దైవత్వం వుంది.

ఈ స్థితిలో ప్రజా ఉద్యమాలే శరణ్యం. 1964 డిసెంబర్‌లో నాయకులంతా జైళ్ళపాలయ్యారు. పాలకొల్లు పార్టీ ఆఫీసు పనిచేయకపోతే వ్యతిరేకులు హేళనగా ప్రచారం చేస్తారని, వెంకటరత్నంగారు, నేనూ ఆఫీసుకి వెళ్ళిపోయి, శుభ్రం చేసి పుస్తకాలు, వగైరా అన్నీ క్రమంలో సర్దుకుని వచ్చేవారం. పార్టీ అవసరాలకు ఆమె సలహాలు, సహాయమే నాకు ప్రధానంగా ఆధారమయింది. పార్టీ నాయకులెవ్వరూ లేని కష్టకాలంలో, చాలా ముఖ్యమైన పార్టీ బాధ్యతలకు వెంకటరత్నంగారి సహాయమే పార్టీకి నిధివలె ఉపయోగపడింది. ఏలూరు సత్యంగారు చాలా ఆరాటంతో హైదరాబాద్, వైజాగ్, రాజమండ్రి సెంట్రల్ జైళ్ళలో వున్న నాయకుల సమాచారం సేకరణకు నిరంతరం పార్టీ ఆదేశాలు అమలుకు కృషిచేస్తూనే ఉండేవారు.

చివరిగా 19-12-2015వ తేదీ ప్రజాతంత్ర ఉద్యమంలో నాకు తొలి సహచరి వెంకటరత్నంగారిని కడసారి కలుసుకో గలిగాను. మంచానికి అతుక్కుపోయి వున్నారు. చూపులేదు. కానీ మనస్సులో ఆలోచన, స్పృహ బాగానే వుంది. జిల్లా మహిళా నాయకురాలైన విజయలక్ష్మి, శేషారత్నం, ఎ.నారాయణమ్మ అందరం వచ్చామని ఆమెకు తెల్పింది. నేను పలకరిస్తే జ్ఞప్తిలోనే వున్నారు. మాట్లాడలేకపోతున్నారు.

వెంకటరత్నం గారికి అమరవీరుల పాటలంటే ప్రాణం. విజయలక్ష్మి, శేషారత్నంగార్లు మూడు పాటలు గట్టిగా పాడారు. అమరుల గేయాలతో ఆమె అంతిమయానం సాగింది. ప్రియతమ సహచరి కడసారి కలయిక గొప్ప అదృష్టం. చరితార్థం ఆమె జీవితం. భావితరం ఆమె ఆశయం సాధించాలి.

**నా తొలి సహచరికి నివాళులతో..**

అల్లూరి మన్మోహిని.

# మహిళ

**- వేములపల్లి సత్యవతి**

> **హైతీ అనే దేశంలో మహిళలు ఎంత నికృష్టమైన దురాచారానికి గురవుతున్నారంటె యుక్తవయసు రాగానే యువతుల్లో లైంగిక ఇచ్ఛ కలుగకుండ ఉండుట కొరకు ఆమె జననాంగంలోని కొద్ది భాగాన్ని కత్తిరించివేస్తారు. ఆ క్రియ శాస్త్రీయ పద్ధతుల్లో జరగదు. మన దగ్గర ఇంతకు ముందు నాటు మంత్రసానులు పురుడు పోసేవారు. అదేవిధంగా అశాస్త్రీయ పద్ధతిలో ఒక యువతి జననాంగాన్ని కత్తిరించే సమయంలో మూత్రకోశానికి సంబంధించిన భాగం కూడ తెగిపోయింది.**

మహిళ అన్ని దేశాలలోను, అన్ని కాలాలలోను వివక్షతకు, అణచివేతకు, హింసకు గురి అవుతూనే ఉన్నది. స్త్రీని ఒక వస్తువుగా భావించినందువలననే ధర్మరాజు జూదములో ద్రౌపదిని ఫణంగా పెట్టగలిగాడు. ఆడినమాట తప్పరాదని ఆమె ఇష్టా అయిష్టాలను తెలుసుకోకుండానే హరిశ్చంద్రుడు తాను అమ్ముడుపోయి భార్య చంద్రమతిని కూడా అమ్మేశాడు. మహిళ వ్యాపారానికి ఉపయోగపడే పరికరంగా, ధనార్జనకు మూలంగా ఎటు తిప్పితే అటు తిరిగే ఆటబొమ్మగా, అవసరాలు తీర్చేదానిలా తయారు చేశారు. వ్యాపార ప్రకటనలలో మహిళల అశ్లీల దృశ్యాల చిత్రాలకు ఉపయోగపడుచున్నది. ధనార్జన కొరకు వ్యభిచార గృహాలకు అమ్ముడుపోతున్నది. అందరి అవసరాలు తీర్చే స్థితికి చేరుకుంది.

మహిళకు మనసుందని, ఆలోచనలు, కోరికలు ఉంటాయని, భావోద్వేగాలు గలిగే మనసున్న మహిళ అని, ఆమె కూడా ఒక వ్యక్తి అనే తలవని వారు నేటికి లేకపోలేరు. ప్రబంధ కావ్యాలలో మహిళల అంద చందాలను హిమాలయాలంత ఉన్నతంగా వర్ణించారు, పొగిడారు. చంద్రబింబంలాంటి ముఖమని, చెంపకు చారెడేసి కన్నులని, కందిరీగలాంటి సన్నని నడుము అని, మందగమని అని వర్ణనలతో ముంచెత్తారు. అంతేగాదు స్త్రీ శక్తి స్వరూపిణి అని, ఆదిశక్తి అని ఉన్నత పీఠం మీద కూర్చోబెట్టారు. ఎవరెన్ని రకాల పొగిడినా, తెగిడినా, ప్రశంసించిన అవన్ని మేడిపండు లాంటవే. రకరకాల సమస్యలకు గురవుతూనే ఉంది. కన్యాశుల్కం సమాజంలో ఉన్నప్పుడు బలయింది స్త్రీనే. నేడు వరకట్న పిశాచానికి గురవుతున్నదీ మహిళే. ఆకుచాటున దాగి ఉండే పిందెలాగా స్త్రీ తండ్రి, భర్త, కొడుకు చాటున అణగిమణగి ఉండాలనేవారు నేటికీ ఉన్నారు. అందుకే నిర్భయ అత్యాచార సమయంలో "ఆమె ఆ కామాంధుల కాళ్ళమీద వడి 'అన్నా' అని వేడుకోవలసిందని" ఒక సాధువుగారు సెలవిచ్చారు. మహిళ స్వంత ఆలోచనలు, భావాలు తీసుకునే స్వేచ్ఛ పురుషాధిక్య సమాజంలో లేదు. తండ్రి, భర్త, కొడుకు ఎవరూ ఈ విషయంలో మినహాయింపు కాదు. హైతీ అనే దేశంలో మహిళలు ఎంత నికృష్టమైన దురాచారానికి గురవుతున్నారంటె యుక్తవయసు రాగానే యువతుల్లో లైంగిక ఇచ్ఛ కలుగకుండ ఉండుట కొరకు ఆమె జననాంగంలోని కొద్ది భాగాన్ని కత్తిరించి వేస్తారు. ఆ క్రియ శాస్త్రీయ పద్దతుల్లో జరగదు. మన దగ్గర ఇంతకు ముందు నాటు మంత్రసానులు పురుడు పోసేవారు. అదేవిధంగా అశాస్త్రీయ పద్ధతిలో ఒక యువతి జననాంగాన్ని కత్తిరించే సమయంలో మూత్రకోశానికి సంబంధించిన భాగం కూడ తెగిపోయింది.

సంఘసంస్కర్తలు రాజారామ్మోహన్ రాయ్, ఈశ్వరచంద్ర విద్యాసాగర్, పూలే దంపతులు, కార్వే మహాశయుడు, వీరేశలింగం పంతులు గారు, రఘుపతి వెంకటరత్నం నాయుడు గారు మొదలగు వారు స్త్రీ విద్య కొరకు, స్త్రీల పట్ల ఉన్న అసాంఘిక దురాచారాలను రూపుమాపటానికి అనితరసాధ్యం కాని కృషిచేశారు. దాని ఫలితంగానే నేటి యువతులు, మహిళలు అన్ని రంగాలలోను పురుషులతోపాటు దీటుగా అప్రతిహతంగా ముందుకు దూసుకుపోతున్నారు. అయినా ఆటంకాలు, అవరోధాలు, లైంగిక వేధింపులు కొనసాగుతూనే ఉన్నాయి. మహిళల్లో కూడ మార్పు రావాలి. స్త్రీకి స్త్రీయే శత్రువన్న దానిని పటాపంచలు చేయాలి. వంశోద్ధారకులయిన పుత్రులను కనలేదని, కట్నకానుకలు తాము కోరినంత తేలేదని బాధించటం, వేధించటం, చంపటం మానుకోవాలి. ఆడబిడ్డల లాంఛనాలు సరిగా ముట్టలేదని మూతులు ముడుచుకుని ఎత్తిపొడవటం చేయకూడదు. తోటి స్త్రీలను అవహేళనగా, తక్కువగా, నీచంగా మాట్లాడటం మానివేయాలి. తప్పులను సరిదిద్దటం కొఱకైతే అర్థమయ్యేలా వివరించి చెప్పాలి. ప్రతిదానికి విమర్శించటం కూడా మంచిదికాదు. అసూయ ముందుపుట్టిన తర్వాత అదది పుట్టిందన్న సామెతను సార్ధకం చేయకూడదు. అందచందాలలో, చదువు సంధ్యల్లో, ఆటపాటల్లో తన కంటె ఉన్నతంగా ఉన్నవారిని చూచి బాధపడే ఆత్మన్యూనతా భావం నుంచి బయటపడాలి. విద్యావంతులయిన యువతులు, మహిళలు సమస్యల్లో చిక్కుకుని బాధపడే స్త్రీలకు చేయూతనివ్వాలి. అంతేకాదు విద్యావంతులు, ధనాభారము లేనివారు, ఆ రెండూ లేనివారిని ఆదుకోవటానికి ముందుకు రావాలి. అశ్లీల చిత్రాలను, ప్రకటనలను, రాతలను ధైర్యంతో, ఆత్మవిశ్వాసంతో, మనోనిబ్బరంతో ఎదుర్కోవాలి. ప్రతిఘటించాలి. సినిమాలలోను, బుల్లితెరపై, వ్యాపార ప్రకటనలకు అశ్లీలత కలిగిన ప్రదర్శనను చేయుమని నిరాకరించాలి. అలా చేయగలిగిననాడే స్త్రీ తన వ్యక్తిత్వానికి వన్నెతేగలదు. నిలదొక్కుకోగలదు.



కేస్ స్టడీ

# బాధ్యతలేని భర్త

కె. శారద

సుధీర్‌తో సినిమా చూసి ఇంటికి వస్తూ చాలా ఆనందంగా ఫీలయ్యింది సుమ. అతడు సుమా! "మనిద్దరికీ ఒకరంటే మరొకరికి ఇష్టం. మనం మన పెద్దలకు చెప్పి పెళ్ళి చేసుకుందాం" అన్నాడు. అందుకే సుమకు గాలిలో తేలిపోతున్నట్లుంది. ఇరువైపుల పెద్దలు వారి ఇష్టాన్ని కాదనకుండా పెళ్ళి చేశేసారు. ఇద్దరూ అన్యోన్యంగా కాపురం చేసుకుంటునారు. 5 సంవత్సరాలలో వారికి ఒక బాబు, పాప కలిగారు. హాయిగా ఆనందంగా సాగిపోతోంది వారి జీవితం.

సుధీర్ ఫాన్సీ షాపు నడుపుతున్నాడు. బాగానే ఉంది ఆదాయం. అనుకోకుండా ఆ షాపు యజమాని ఆ షాపును, దాని వెనుకాల చిన్నగదిని కలిపి అమ్మకానికి పెట్టాడు. సుధీర్ ఆ షాపును కొంత తన దగ్గర ఉన్న డబ్బు మరియు కొంత అప్పుచేసిన డబ్బులతో కొనేశాడు. సుమ పొదుపరితనం, అతని నైపుణ్యంతో నెమ్మదిగా ఆ అప్పు తీర్చేశాడు. పిల్లలిద్దరూ 8, 6 క్లాసులకు వచ్చారు. అప్పుడప్పుడు బాగా తాగి రావడం సుధీర్‌కి అలవాటయ్యింది. అదేమని అడిగితే "ఫ్రెండ్స్ బలవంతం చేస్తే తాగుతున్న" అన్నాడు. కొంత కాలం సరిపెట్టుకుంది సుమ. కొన్నాళ్ళుగా అనారోగ్యంతో ఇబ్బందిపడుతూ సుమ డాక్టర్ వద్దకు వెళ్ళింది. ఆమె అన్ని టెస్ట్‌లు చేసి 'అమ్మా! నీకు ఆపరేషన్ చేసి గర్భసంచి తొలగించాలి. లేకపోతే కేన్సర్ వచ్చే లక్షణాలు కనిపిస్తున్నాయి' అని చెప్పింది డాక్టర్. భర్తకు అదే చెప్పింది. అతను విని ఊరుకున్నాడు. ఇబ్బందికరమైన పరిస్థితిలో గత్యంతరం లేక ఆపరేషన్ చేయించుకుంది సుమ. రెండు నెలలు తల్లి దగ్గర విశ్రాంతి తీసుకొని ఇంటికి వచ్చింది సుమ.

భర్తలో ఏదో మార్పు, వివరీత స్వభావం. ఏమయిందో ఆమెకు తెలియలేదు. ఒకరోజు ఏదో పనుండి షాపుకు వెళ్ళింది. అక్కడ ఒకామెతో సుధీర్ చనువుగా ప్రవర్తిస్తూ కనిపించాడు. ఇంటికి వచ్చాక 'ఎవరామె'? అని అడిగితే ఇలా చెప్పాడు. "నువ్వు ఆపరేషన్ చేయించుకున్నావు. నాకు నీ అవసరం లేదు. ఆమెతోనే ఉంటాను. నీకు తిండి, బట్ట, పిల్లల ఫీజులు చూస్తాను. ఇంకేమి కావాలి నీకు?" అని అడిగాడు. అలా వీలు లేదు. ఆమెను వదిలెయ్యి అంటే ఆమెను కొట్టాడు. అతని బట్టలు ఉతకాలి, టిఫన్ చెయ్యాలి, వంట చేయాలి. ఇంట్లోనే పడి ఉండాలి. అతను మాత్రం వేరే ఆమెతోనే కలిసి ఉంటాడట. ఆమె మోటూరు ఉదయం న్యాయసలహా కేంద్రానికి వచ్చి ఇవన్నీ చెప్పింది. 'నా భర్త నాకు కావాలి మేడం. మేము ప్రేమించి పెళ్ళి చేసుకున్నాము. నాకు డబ్బు అక్కరలేదు. నా భర్త నాకు కావాలి. నా ఎదురుగానే అతను ఆమెతో తిరుగుతున్నాడు. ఒకప్పుడు నన్ను ప్రేమించిన సుధీరేనా ఇతడు అని ఆశ్చర్యంగా ఉంది. నేను, నా భర్త 10వ తరగతి కూడా చదవలేదు. నేను ఎలా బ్రతకాలి? నా పిల్లలను ఎలా చదివించుకోను'? అని

**మెల్లిగా సుమను ఓదార్చి ఆమెకు ధైర్యం చెప్పి ఆమెను వేరే చోట కుట్టుపనికి పంపించాము. "కుట్టు పని నాకు బాగుంది. నాకు మనసుకు ప్రశాంతంగా ఉంది. పిల్లలు ఇప్పుడు పది, ఇంటర్ చదువుతున్నారు కదా! వాళ్ళు కూడా నాకు సహాయపడుతున్నారు". "అమ్మా! నీకు ఎక్కడ బావుంటే అక్కడ పనికి వెళ్ళు మేము పెద్దవాళ్ళమే కదా! నువ్వు వచ్చేవరకు చదువు కుంటాము" అని పిల్లలు ధైర్యం చెప్పారని చెప్పుకొచ్చింది సుమ.**

ఏడ్చిందామె. న్యాయసలహా కేంద్రం బాధ్యులు సుధీర్‌ని పిలిపించి మాట్లాడారు. "నేను ఆమెను వదులుకోను? సుమను, పిల్లలను పోషిస్తాను. నాకామె అవసరం లేదు" అని వెళ్ళిపోయాడు. తరువాత ఎన్ని ఫోన్‌లు చేసినా పలకడు. మెల్లిగా సుమను ఓదార్చి ఆమెకు ధైర్యం చెప్పి ఆమెను వేరే చోట కుట్టుపనికి పంపించాము. "కుట్టు పని నాకు బాగుంది. నాకు మనసుకు ప్రశాంతంగా ఉంది. పిల్లలు ఇప్పుడు పది, ఇంటర్ చదువుతున్నారు కదా! వాళ్ళు కూడా నాకు సహాయపడుతున్నారు". "అమ్మా! నీకు ఎక్కడ బావుంటే అక్కడ పనికి వెళ్ళు మేము పెద్దవాళ్ళమే కదా! నువ్వు వచ్చేవరకు చదువుకుంటాము" అని పిల్లలు ధైర్యం చెప్పారని చెప్పుకొచ్చింది సుమ. ఉదయం 10 గంటల నుండి సాయంత్రం 6 గంటల వరకు కుట్టుపనికి వెళ్తోంది ఆమె.

4 రోజులైందో లేదో ఆమె భర్త "ఇంటి ఖర్చులకు నేను పైసా ఇవ్వను. నేను చెప్పినట్లు ఇంట్లో పడివుండు లేకపోతే వెళ్ళిపో. నేను నా ఇష్టం వచ్చినట్లు ఉంటాను. నువ్వు మాత్రం ఇంట్లోనే ఉండాలి" అని ఆమెను కొట్టాడట. "నాకేమిటి దారి! నన్నింతగా అవమానపరచిన భర్త నాక్కూడా అక్కర్లేదు. అతని నుండి అన్ని విధాలుగా నాకు విడుదల కల్పించండి. న్యాయపరంగా నా పిల్లలకు రావలసిన అస్తులను నాకు, నా పిల్లలకు వచ్చేలా చేయండి మేడమ్. నేను ధైర్యంగా నిలబడతాను వద్దు వద్దు అనే మగవాడికి బానిసలాగా నేను పడి వుండి అతనికి సేవలు చేయను. నాకు నచ్చిన కుట్టుపనిలోనే నేను శిక్షణ తీసుకుంటాను. పిల్లల్ని చదివించుకుంటాను" అని చెప్పింది సుమ. 'ఒక రెండు నెలలు ఓపిక వహించు. పిల్లల పరీక్షలైనాక వాళ్ళను కూడా తీసుకుని వెళ్ళి మీ హక్కుల కోసం పోరాడుదాము. ఇలాంటి సైకో, శాడిస్టు భర్తతో నీకు ఈ బాధలు వద్దు. నీకు నచ్చిన పని ఏమైనా చేసి బతుకుదువు గాని. నీకు మేమందరమూ అండగా నిలబడ తాము. నీకు తప్పకుండా న్యాయం జరుగు తుంది' అని సుమకు ధైర్యం చెప్పారు బాధ్యులు.

"ఇదేనా ప్రేమంటే? ఇతనికేనా ఇన్నాళ్ళు సేవలు చేసింది! భార్యా భర్తల బంధమంటే ఇంతేనా? ఒక మహిళలో అందాలు, ఆకర్ష ణలు తప్ప ఆమె మనసు ఎవ్వరికీ అక్కరలేదా! ఇంత చంచల తత్వమా మగవాడిది! నా బిడ్డలను నేను ఎంతో ఆదర్శవంతులుగా తీర్చి దిద్దుకుంటాను భవిష్యత్తులో" అనుకుంటూ ఇంటికి వెళ్ళింది సుమ.

# మద్రాస్ హైకోర్టు సంచలనాత్మక తీర్పు

- వి.ఎస్.

ఒక ముక్కుపచ్చలారని చిన్నారిపై జరిగిన అత్యాచారం కేసును గురించి చెన్నై హైకోర్టు న్యాయాధీశులు అత్యంత సంచలనాత్మకమైన తీర్పు చెప్పారు. కండకావరంతో, కళ్ళనిండ కామవాంఛతో అత్యాచారం చేసే కామాంధులకు శస్త్రచికిత్స ద్వారా వారి మగతనాన్ని తొలగించాలని, ఇది అనాగరిక, ఆటవిక చర్య అయినప్పటికీ అనాగరిక, ఆటవిక కామాంధులకు ఇలాంటి కఠిన శిక్ష వేయవలసిందేనని, దీనిని గురించి ఆలోచించవలసినదిగా రాష్ట్ర-కేంద్ర ప్రభుత్వాలకు సూచించారు.

నిర్భయ చట్టం చేయబడినాగాని నిర్భయంగా దేశంలో అన్ని ప్రాంతాలలో, సామూహిక అత్యాచారాల సంఖ్య తగ్గకపోగా ఎక్కువయింది. అంతకు ముందు అక్కడక్కడా ఒక్కడుగా ఆ పనికి పూనుకునేవాడు. ఒక్కడినైతే యువతులు, మహిళలు ధిక్కరిస్తారని పథకం మార్చారు. సామూహిక అత్యాచారాలకు తెగబడ్డారు. కొన్ని సందర్భాలలో హతమారుస్తున్నారు. ఒకవిధంగా మద్రాసు హైకోర్టున్యాయాధీశుల వారి తీర్పు సబబేననిపిస్తుంది. అత్యాచార నేరంపై కొన్ని సంవత్సరాల కారాగార శిక్షేగా పడేది అన్న భయంలేని భావం ఆ కామాంధులలో ఉండి ఉంటుంది. కాని అత్యా చార నేరానికి మగతనం పోగొట్టుకోవలసి వస్తుందన్న భయంతో అత్యాచారాలకు పాల్పడరేమో! అత్యాచారమంటేనే వారిలో వణుకు పుట్టేలా ఆ చట్టం పనిచేయవచ్చు. అనాగరిక, ఆటవిక చర్యలకు ఇటువంటి చర్యలే సరైనవని హైకోర్టు న్యాయాధీశులు వెల్లడించారు.

నిర్భయ చట్టం చేయకముందు వర్మ కమిటి ఏర్పడింది. శస్త్రచికిత్స ద్వారా మగతనాన్ని తొలగించే విషయంపై చర్చ జరిగింది, ప్రజాసంఘాలు, స్వచ్ఛంద సేవా సంస్థలు, మేధావులు, మహిళా సంఘాలు తర్జనభర్జన పడ్డాయి. సుదీర్ఘ ఆలోచనలు చేసాయి. చర్చించాయి. చివరకు మగతనాన్ని తొలగించటం, ఉరిశిక్ష వేయటం కూడ తప్పనిసరి కాదు అని వర్మకమిటికి నివేదికలు అందజేశాయి. అగ్నికి ఆజ్యం పోసినట్లుగా నీలిచిత్రాల ప్రభావం కూడ జోరందుకుంది. వయోభేదం లేకుండ వాటిని చూచే పరిస్థితి నెలకొంది. ప్రజలు దీనిని సామాజిక బాధ్యతగా భావించనంతవరకు, వారిలో అలాంటి చైతన్యం రానంతవరకు ఎన్ని చట్టాలు చేసినా చట్టుబండలే అవుతాయి.

# ముంచుకొస్తున్న ప్రమాదం

మీపాటికి మీరు కాలేజీలో చదువుకునే అమ్మాయా? మీపేరు మరో అబ్బాయి పేరుతో కలిపి గోడలమీదకు ఎక్కవచ్చు. ఎవరైనా నీవు ప్రేమిస్తే వేరే కులం లేక మతం అయితే నిన్నూ, నీ తల్లి దండ్రులను బెదిరించి మరీ నువ్వు ఇష్టపడే వ్యక్తి నిన్ను టీజ్ చేశాడనో అత్యాచారం చేశాడనో కేసుపెట్టాల్సి రావచ్చు. నీవు ఎవరికళ్ళకైనా ఆకర్షణీయంగా కన్పడితే పోలీసు నిఘా విభాగం నీ కదలికలను ట్రాక్ చెయ్యవచ్చు.

ఫేక్ ఎకౌంట్ పేరుతో మీకు ఏ దావూద్ ఇబ్రహీం అనుచరులుగానో మెసేజ్‌లు రావచ్చు. అఖ్లక్ మాదిరి ఏ మాంసం తినాల్సిన అవసరం లేకుండానే మీ ఇంట్లో గోమాంసం ప్రత్యక్షమవ్వ వచ్చు. లేదూ మీ ఇంటి ఆవరణలో పందిమాంసం వేసి మీ తరుపున ఎబివిపి వారు ఒక ముస్లిమ్‌కు అన్యాయం జరిగింది న్యాయం జరపమని ధర్నాలు, ఆందోళనలు చెయ్యవచ్చు.

మీరు ఇంక్విలాబ్ జిందాబాద్ అంటున్నారా? అది ఇష్రత్ జహాన్ జిందాబాద్‌గా మారిపోయి యు-ట్యూబ్‌లో హల్ చల్ చెయ్యవచ్చు. ఎందుకు ఎన్‌కౌంటర్ చేశారంటే ఉగ్రవాది కాబట్టి చేశాము చెయ్యవచ్చు అంటున్నవారికి హెడ్లీ కంటే గొప్ప సాక్ష్యం ఎవరికి కావాలి.

బొంబాయిపై దాడులు చేసింది ఎవరు దావూద్ మెమన్? ఎక్కడున్నాడు మెమన్? పాకిస్తాన్‌లోనా? పట్టుకురాగలరా? మనకెక్కడిదంత సీన్? మరేమిటి చెయ్యడం? ఎవరో ఒకర్ని బలిస్తే పోలా మెమన్ అన్న కోరి వచ్చాడా? ఇండియాకు ఇంకేమి కానిచ్చేయండి?

రేప్ జరిగిందా? పొలిటికల్ డ్రామా కాదు గదా? క్లయింట్‌తో గొడవని పక్కకు నెట్టేయండి? రైతులను పట్టించుకోవడం లేదా? ఎవరన్నారు? వాళ్ళంతా ఆత్మహత్యలు చేసుకుంటే ఎంత ఫ్యాషన్‌గా ఉంటుందో ఎన్‌జాయ్ చేస్తున్నారు. హిరేన్‌పాండ్యా చచ్చిపోయాడా? చంపేశారా? మంచిది లేకపోతే ఢిల్లీకి వెళ్ళి మనకు తలనెప్పులు తెచ్చుకోవడం ఎందుకూ?

ఎమ్.పి గారి చేతిలో కర్రతీసుకుని వీరంగం వేస్తున్నారా? మరి పిల్లగాళ్ళయితే కాసేపు గీపెట్టి నోరుమూసుకుంటారు? ఆడపిల్లలమీద అత్యాచారం చేస్తే నేరస్తులపైన కూడా కర్ర తీసుకుంటారా? మరీ విచిత్రం కాకపోతే ఏమిటా ప్రశ్న.

అసహనం అంటారేమిటి? అందర్నీ మాట్లాడిన్తున్నాం గదా? మాకంటే సహనమూర్తులెవరూ? అందుకే గదా మాట్లాడే వాళ్ళందర్నీ మూసేస్తామని చేసి చూపిస్తున్నారు గురువుగారు? మీకెంత దేశభక్తి ఉన్నా మా ప్రయోజనాల కోసం ఏమైనా చేస్తాం. అందర్నీ నమ్మిస్తాం. ఎంతటి మార్ఫింగులైనా అవలీలగా అర్థం చేసుకోండి. ప్రమాదం అనుకుంటే పడి ఉండండి! ఎందుకు ఊరికే యాగీ చేస్తారు? ఇలాంటి గ్లోబల్స్, హిట్లర్‌లు కుక్కచావు చచ్చారంటున్నావా? జనాన్ని మేం నోరెత్తనిస్తే కదా?

-మానవి డెస్క్

# గాయపడిన అక్షరం

పాఠశాల జీవితంలోని
మధురస్మృతుల మందార మాలలను
ఆనందానుభూతుల అరవిందాలను
చేతిలో పట్టుకొని
కొత్త కలలు కంటూ
కళాశాల ప్రాంగణంలో
అడుగుపెడతారు అప్పుడే

భయంకర కంటకాలను ఏరివేసి
సంకోచం పాషాణాలను పక్కకు నెట్టి
ఆత్మీయతా పూల తివాచీ పరచి
స్నేహ సుగంధాల వింజామరలు వీస్తూ
కొత్తదనం పోగొట్టి
స్వాగతగీతాలై పలకరించాల్సిన
అనుభవజ్ఞులైన విద్యార్థులు
ఇలా వికృత గీతాలైతే ఏంచెయ్యాలి

కవులు కళాకారులు
శాస్త్రవేత్తలు దేశభక్తుల బదులు
చలన చిత్రాల్లో నాయికను
విసిగించి వేధించే నాయకులే
ఆరాధ్య దైవాలైన వేళ
అరక్షణంలో అరచేతిలో
ప్రత్యక్షమయే
బూతు చిత్రాల ప్రేక్షకులై
జీవనలక్ష్యం విస్మరించి
శ్రుతిలయలు తప్పిన గీతంలా
తలకిందులైన పతాకాల్లా
అమర్యాదా వాచకాలుగా
అనాగరికతకు వారసులుగా
విద్యార్థులు పరిణమిస్తుంటే తప్పెవరిది?

కొత్తపదాలకు అర్థాలు చెప్పే నిఘంటువులుగా
తెలియని పాఠాలను వివరించే ఆచార్యులుగా
కొత్తగా వచ్చిన విద్యార్థులకు
దీపధారులుగా మార్గదర్శులు కావల్సినవారు
తోటి ఆడపిల్లలను
ఆటబొమ్మలుగా
కోరికలు తీర్చుకొనే వస్తువులుగా భావిస్తూ
వేధింపుల చిత్ర లిపితో
అవమానకర భాషతో అనాది పశుకామంతో
విద్యార్థినుల గుండెలపై చేతులు వేస్తూ
చున్నీలను తొలగిస్తూ
రేకుల్ని పెకలించి
దేహపుష్ప మకరందాన్ని అస్వాదించాలని
వికృత చేష్టలతో
పైశాచికానందం పొందుతూ
అవమానాగ్ని గుండంలో
నెట్టి వేసినపుడు
శత్రువును ప్రతిఘటించలేక
ఆత్మహత్యతో తనను తాను శిక్షించుకొంటున్న వేళ

చదువుల చందమామలై
నింగినుండి నేలపైకి దిగివచ్చి
తమ జీవితాలలో వెన్నెల వర్షం కురిపిస్తారని
సెలయేటి తరంగాల మృదంగ ధ్వనుల
ఊపిరులూదిన ఉత్సాహగీతం లాంటి కూతురు
సంతాపసభలో చీమచిటుక్కుమంటే
వినిపించే నిశ్శబ్ద క్షణాల మృదంగమైనపుడు
తల్లిదండ్రుల కన్నుల యమునలో
కన్నీటి ప్రవాహాలు కనిపించినా
ఐనా ఎలాంటి సందర్భంలోనైనా
ఆత్మహత్యల పిరికి గీతాలాపనెందుకు
గుండె ఒరలో నుంచి
ఆత్మగౌరవ ఆయుధాన్ని దూసి వైరినెదిరించు
గాయపడిన అక్షరానికి చందనలేపమద్దు

**- మందరపు హైమవతి**

వైద్యం

# సంతానరాహిత్యం (ఇన్‌ఫెర్టిలిటి)

- డా॥ ఎం. రమాదేవి




ఈ మధ్యకాలంలో సంతాన రాహిత్యం కాస్త పెరిగినట్టు కనిపిస్తోంది. దానికి కారణం మారుతున్న జీవనశైలి, వాతావరణ కాలుష్యం, కల్తీ ఆహార పదార్థాలు, లేటుగా పెళ్ళిళ్ళు.... ఇలా సవాలక్ష కారణాలు. దీనితో సంతాన సాఫల్య కేంద్రాలకు విపరీతమైన డిమాండ్ పెరిగింది. వారి వ్యాపారం మూడు పువ్వులూ, ఆరు కాయలుగా కొనసాగు తోంది. వైద్యం వ్యాపారమయమైన నేటి కాలంలో సంతానరాహిత్యం విషయంలో ఎంతో కొంత అవగాహన అవసరం. అందు కనే అందుబాటులోకి వచ్చిన అత్యాధునిక చికిత్సల వివరాలు తెలుసుకుందాం.

**పిల్లలు పుట్టకపోవడానికి ప్రధాన కారణాలు :**

గర్భధారణ అన్నది అతిసహజంగా జరిగిపోయేదే అయినా, తరచి చూస్తే ఒకరకంగా సంక్లిష్టమైన ప్రక్రియ ప్రతి నెలా స్త్రీ అండాశయాల్లో విడుదల అయ్యే అండం ఫెలోపియన్ ట్యూబుల ద్వారా గర్భాశయం వైపు ప్రయాణిస్తుంది. ఇదే సమయంలో పురుషుడి వీర్యంలోని శుక్రకణాలు వచ్చి దానిని చేరుకుని, వాటిలో ఒకటి అండానికి ఫలదీకరణం చెందిస్తే అది సూక్ష్మపిండంగా ఏర్పడి, గర్భాశయంలోకి ప్రవేశించి, గర్భాశయం గోడలకు అతుక్కుని అక్కడ పిండంగా పెరగడం ఆరంభిస్తుంది. సూక్ష్మంగా చెప్పుకోవాలంటే ఇదీ గర్భధారణ ప్రక్రియ. ఈ ప్రక్రియ మొత్తాన్ని రుతు క్రమంలో సమయానుకూలంగా రకరకాల హార్మోన్ల నుంచి శరీర భాగాల వరకూ ఎన్నో అంశాలు నియంత్రిస్తుంటాయి.

**ఏడాది దాటితే అనుమానించాలి :-** భార్యాభర్తలు సంతాన నిరోధక పద్ధతులేవీ పాటించకుండా ఏడాది పాటు ప్రయత్నించినా కూడా గర్భం రాకపోతే సమస్యలేమైనా వున్నాయా అని అనుమానించాలి. సాధారణంగా ఇలా ప్రయత్నిస్తే మొదటి ఏడాదిలోపే 85% మందికి గర్భం వస్తుంది. మరో 5-7% మందిలో రెండో సంవత్స రంలో కలుగవచ్చు. కాబట్టి ఏడాది దాటినా ఫలితం లేదంటే వైద్యపరమైన సలహా తీసుకోవడం మంచిది.

మన సమాజంలో నేటికీ బలంగా పాతుకుపోయిన అపోహ ఏమంటే స్త్రీలలో ఏదో లోపం వల్లనే పిల్లలు పుట్టడం లేదని నమ్ముతుంటారు. ఇది పూర్తి అవాస్తవం. దీనివల్ల ఎన్నోకుటుంబాలలో కలతలు, కలహాలు కూడా రేగుతున్నాయి. కానీ వాస్తవాలు చూస్తే సంతానరాహిత్యమున్న మొత్తం జంటలలో కేవలం 35% కేసుల్లో స్త్రీలలో లోపాలుంటున్నాయి. మరో 35% కేసుల్లో పురుషుల్లో లోపాలుంటున్నాయి. మిగిలిన 30% జంటల్లో ఇద్దరిలో లోపం వుండటమో లేక సరిగా నిర్ధారించలేని ఇతరత్రా సమస్యలేమైనా ఉండటమో జరుగుతోంది. కాబట్టి సంతానరాహిత్యాన్ని ప్రత్యేకించి స్త్రీల సమస్యగా, స్త్రీల లోపంగా చూడటం సరికాదు. ఇటీవల కాలంలో సంతానసాఫల్య చికిత్సలో మరెన్నో కొత్త కొత్త విధానాలు వచ్చిచేరుతూ వీటి విస్తృతిని పెంచుతున్నాయి. ముఖ్యంగా అండాలను లేదా శుక్రకణాలను తీసి భవిష్యత్తు అవసరాల కోసం ప్రయోగశాలలో అతిశీతలంగా (క్రయోప్రిజర్వేషన్) భద్రపరచి వాడుతున్నారు. ప్రయోగశాలలో ఫలదీకరణం చెందించిన సూక్ష్మ పిండాలను స్త్రీ గర్భాశయంలో ప్రవేశపెట్టగా మిగిలిన అదనపు పిండాలను క్రయోప్రిజర్వేషన్‌లో వుంచి, వాటిని తర్వాత వాడటం కూడా

**గర్భధారణ అన్నది అతిసహజంగా జరిగిపోయేదే అయినా, తరచి చూస్తే ఒకరకంగా సంక్లిష్టమైన ప్రక్రియ ప్రతి నెలా స్త్రీ అండాశయాల్లో విడుదల అయ్యే అండం ఫెలోపియన్ ట్యూబుల ద్వారా గర్భాశయం వైపు ప్రయాణిస్తుంది. ఇదే సమయంలో పురుషుడి వీర్యంలోని శుక్రకణాలు వచ్చి దానిని చేరుకుని, వాటిలో ఒకటి అండానికి ఫలదీకరణం చెందిస్తే అది సూక్ష్మపిండంగా ఏర్పడి, గర్భాశయంలోకి ప్రవేశించి, గర్భాశయం గోడలకు అతుక్కుని అక్కడ పిండంగా పెరగడం ఆరంభిస్తుంది. సూక్ష్మంగా చెప్పుకోవాలంటే ఇదీ గర్భధారణ ప్రక్రియ. ఈ ప్రక్రియ మొత్తాన్ని రుతుక్రమంలో సమయానుకూలంగా రకరకాల హార్మోన్ల నుంచి శరీర భాగాల వరకూ ఎన్నో అంశాలు నియంత్రిస్తుంటాయి.**

చేస్తున్నారు. అవసరాన్ని బట్టి అండాలనుకానీ, శుక్రకణాలను కానీ దాతల నుంచి స్వీకరించి చికిత్సలో వాడటం ,పిండాన్ని మరో స్త్రీ గర్భాశయంలో పెంచే అవకాశం వుండటం (సరోగసి) ఇటువంటి వినూత్న విధానాలెన్నో అందుబాటులోకి వచ్చాయి. వీటిలో కొన్నింటిని గురించి తెలుసుకుందాం.

**పురుషులలో సంతానరాహిత్యం కారణాలు :-** శుక్రకణాల సంఖ్య తక్కువగా వుండటం లేదా కొంతమందిలో అస్సలు శుక్రకణాలే వుండకపోవచ్చు. ఒకవేళ వున్నా శుక్రకణాలు చురుకుగా లేకపోవటం, వాటి ఆకృతులు సరిగ్గా లేకపోవటం వంటివి సంతానరాహిత్యానికి కారణమవుతాయి. పొగ, మద్యం, తీవ్రమైన ఒత్తిడి, ఊబకాయం, మధుమేహం వంటి వాటివల్ల శుక్రకణాలు తగ్గిపోవచ్చు. వీటిని సరిదిద్దుకుంటే కొన్ని సార్లు సంతానావకాశాలు మెరుగవుతాయి. ఇక హార్మోన్ల సమస్యలు, సుఖవ్యాధులు, క్షయ వల్ల వీర్యనాళాలు మూసుకుపోవటం, జన్యుపరమైన కారణాల వల్ల క్రోమోజోములలో తేడాలుండటం తదితరాలు కూడా పురుషుల్లో సంతానరాహిత్యానికి కారణమవుతుంది. 40% మందిలో ప్రత్యేకించి కారణమేదీ లేకుండానే వీర్యంలో తేడాలుండవచ్చు. ఇటువంటి వారికి ఐయూఐ, ఐవీఎఫ్ వంటి పద్ధతులను ఆశ్రయించాల్సి వస్తుంది. అసలు వీర్యంలో శుక్రకణాలే లేని వారికి కూడా నేరుగా వృషణాల నుంచే శుక్రకణాలు తీసి, వాటితో భాగస్వామి అండాన్ని ఫలదీకరణ చెందించే అత్యాధునిక విధానాలు ఇప్పుడు అందుబాటులో వున్నాయి.

**అత్యాధునిక సంతాన సాఫల్య చికిత్సలు :**

చాలా మంది సంతానం కలగడం సహజమనీ, పిల్లలు కలుగక పోవటమన్నది ఎక్కడో నూటికో కోటికో ఒకరికి మాత్రమే ఎదురయ్యే సమస్యని భావిస్తుంటారు. ఇది పూర్తి నిజం కాదు. సంతానరాహిత్యం కూడా ఎంతో మందిలో కనబడుతున్న సమస్య. ప్రతి ఆరుజంటల్లో ఒకరికైనా ఇటువంటి సమస్య ఎదురవుతోందని అధ్యయనాలలో గుర్తించారు. పైగా ఈ సమస్య రాను రాను ఇంకా పెరుగుతోంది. జీవనశైలిలో వచ్చిన మార్పులు, లేటు వయస్సులో వివాహాలు, అధిక బరువు లాంటివి కారణాలు. ముఖ్యంగా ఊబకాయం వల్ల ఒంట్లో హార్మోన్లు అస్తవ్యస్తమై అండాలు విడుదలను ప్రభావితం చేస్తాయి. దీనితో సంతానావకాశాలు తగ్గుతాయి.

చాలా మంది సంతానం కలగడం సహజమనీ, పిల్లలు కలుగక పోవటమన్నది ఎక్కడో నూటికో కోటికో ఒకరికి మాత్రమే ఎదురయ్యే సమస్యని భావిస్తుంటారు. ఇది పూర్తి నిజం కాదు. సంతానరాహిత్యం కూడా ఎంతో మందిలో కనబడుతున్న సమస్య. ప్రతి ఆరుజంటల్లో ఒకరికైనా ఇటువంటి సమస్య ఎదురవుతోందని అధ్యయనాలలో గుర్తించారు. పైగా ఈ సమస్య రాను రాను ఇంకా పెరుగుతోంది. జీవనశైలిలో వచ్చిన మార్పులు, లేటు వయస్సులో వివాహాలు, అధిక బరువు లాంటివి కారణాలు.

**ఐ.యు.ఐ. (ఇంట్రా యుటరైన్ ఇన్‌సెమినేషన్):-** సంతానసాఫల్య చికిత్సలలో ఇది ప్రాథమికమైనదిగా చెప్పుకోవచ్చు. దీనిలో భర్తనుండి సేకరించిన వీర్యాన్ని ప్రయోగశాలలో పరీక్షించి, దానిలోని అసహజమైన కణాల వంటి వాటన్నింటినీ తొలగించి, కేవలం ఆరోగ్యకరంగా, చురుకుగా వున్న వాటినే సిద్ధం చేస్తారు. అలా సిద్ధంచేసిన వీర్యాన్ని ఒక సన్నటి మెత్తటి గొట్టంద్వారా నేరుగా స్త్రీ గర్భాశయంలోకి ప్రవేశపెడ తారు. ఎటువంటి నొప్పీలేని 5 నిముషాల్లో పూర్తయిపోయే తేలిక విధానం ఇది. స్త్రీలలో అండం విడు దల అయ్యే రోజులేవో గుర్తించి ఆ రోజుల్లోనే ఈ చికిత్స చేస్తారు. ఇదే సమయంలో స్త్రీలో మరిన్ని అండాలు పక్వమై విడుదలయ్యేందుకు మందులు కూడా ఇస్తారు. అవసరాన్ని బట్టి ఇలా 6 రుతుచక్రాల వరకూ కూడా ఐయుఐ చికిత్స చెయ్యచ్చు. ఇలా ఒక నెలలో చేస్తే సంతానావకాశాలు 15% వరకూ వుంటాయి. సాధారణంగా 3-4 ఋతు చక్రాల్లోనే గర్భం రావచ్చు. 6 ఋతుచక్రాల పాటు ఈ చికిత్సచేసినా ఫలితం లేకపోతే ఐ.వీ.ఎఫ్ వంటి పై స్థాయి చికిత్సలు సూచిస్తారు.

**ఐ.వీ.ఎఫ్ (ఇన్ విట్రో ఫెర్టిలైజేషన్):** దీన్నే టెస్ట్‌ట్యూబ్‌బేబీ విధానమని అంటారు. అంటే దీనర్థం పిల్లలను టెస్ట్‌ట్యూబుల్లో పెంచుతారని కాదు. దీనిలో ముందు స్త్రీ నుంచి పక్వమైన అండాలను బయటకు తీస్తారు. వాటిని ప్రయోగశాలలో ఒక డిష్‌లో వుంచి, పురుషుడి శుక్రకణాలతో ఫలదీకరణం చెందిస్తారు. ఇలా ఫలదీకరణం చెందగా ఏర్పడిన తొలిదశ పిండాల్లో రెండు లేదా మూడింటిని స్త్రీ గర్భాశయంలో ప్రవేశపెడతారు. అవి అక్కడ కుదురుకుని పిండంగా పెరగడం ఆరంభిస్తాయి. ఈ విధానంలో ప్రపంచంలోనే తొలిబిడ్డ 1978లో పుట్టింది. ఈ మూడున్నర దశాబ్దాల్లో ప్రపంచవ్యాప్తంగా కొన్ని లక్షల మంది బిడ్డలు ఇలా పుట్టారు. అద్భుత ఫలితాలతో సంతాన సాఫల్య చికిత్సల్లో విప్లవాత్మక మార్పులు తెచ్చిందీ విధానం. దీనితో ప్రతి దఫా 30-35% విజయావకాశాలుంటాయి.

**ఐ.సి.ఎస్.ఐ. (ఇంట్రా సైటోప్లాస్మిక్ స్పెర్మ్ ఇంజక్షన్) :-** ఇక్సీ అంటే ఐ.వీ.ఎఫ్. చికిత్సకి మరికాస్త మెరుగులు దిద్దిన విధానము. దీనిలోనూ ముందు స్త్రీనుంచి అండాలను సేకరిస్తారు. ప్రయోగశాలలో ఈ అండాల్లోకి, పురుషుడి ఒక శుక్రకణాన్ని ప్రత్యేకమైన మైక్రోమ్యానిప్యులేటర్ పరికరం సహాయంతో ప్రవేశపెట్టి ఫలదీకరణం చెందిస్తారు. అలా ఫలదీకరణం చెందిన వాటిని తిరిగి స్త్రీ గర్భాశయంలో ప్రవేశపెడతారు. ఈ విధానంతో ప్రతి దఫా విజయావకాశాలు 40% వరకూ వుంటాయి.



# రిషితేశ్వరి డైరీలో.... ఒక రోజు



ఫ్రెషర్స్ డే పార్టీ రోజు నాకు మిస్ ఫర్‌ఫెక్ట్ అవార్డు ఇచ్చారు. మిస్ ఫర్‌ఫెక్ట్ అవార్డును శ్రీనివాస్ చేతుల మీదుగా అందించారు. ఆ సమయంలో షేక్ హ్యాండ్ ఇస్తూనే అతను నా నడుం మీద చేయి వేశాడు. స్టేజి దిగి క్రిందకు వస్తుంటే జయ చరణ్ నాతో అసభ్యంగా వ్యవహరించాడు. ఆ సమయంలో జయచరణ్‌తో మాట్లాడమని హనీషా పదేపదే కోరింది కాదన్నందుకు హనీషా నన్ను ర్యాగింగ్ చేసింది. తప్పనిసరి పరిస్థితుల్లో శ్రీనివాస్‌ను కలిశాను. నన్ను చూసి హీరోయిన్‌లా ఉన్నావన్నాడు. తర్వాత రోజు నుండి శ్రీనివాస్ నాతో ఫోన్‌లో ఛాటింగ్ చేస్తున్నాడు. అతని మెసేజ్‌లన్నీ నన్ను ఇష్టపడు తున్నట్లుగానే ఉంటున్నాయి. నాకు చిరాకేస్తుంది. అతనితో చాటింగ్ చేయాలని కానీ, మాట్లాడాలని కానీ లేదు. తర్వాత కాలేజీలో అభిషేక్, ఆదిత్య పరిచమయ్యారు. వారు మంచి ఫ్రెండ్స్ అని బ్రదర్స్ అని ఫీలయ్యాను, అయితే దసరా సెలవుల సమయంలో ఆదిత్య నాకు ప్రపోజల్ చేశాడు. నేను నో అని చెప్పా. శ్రీనివాస్‌ను ఒకసారి సార్ అని పిలిస్తే.. సర్ కాదు. శ్రీను అని పిలవ మన్నాడు. శ్రీనివాస్ ఫోన్ చేస్తే ఒకసారి నా ఫ్రెండ్‌తో లేనని చెప్పించా. తర్వాత క్లాసురూమ్‌కి వచ్చి నీఫోన్ ఎక్కడుందని అడిగాడు. నా ఫ్రెండ్‌కి ఇచ్చానని చెప్తే ... అయితే తీసుకుని నాకివ్వు .. వారం తర్వాత ఇస్తానన్నాడు. శ్రీనివాస్ వేషాలను తట్టుకోలేక అతనితో గట్టిగా వాదించాను. తర్వాత అతను కొద్ది రోజులు దూరంగా ఉన్నాడు. అదే సమయంలో జయచరణ్ ఎంటర య్యాడు. నావెంట పడుతున్నాడు. నేను మంచి ఫ్రెండ్ అనుకున్న అభిషేక్ కూడా నాకు ప్రపోజల్ చేశాడు. అతనొక స్టుపిడ్. శ్రీనివాస్‌కు దూరంగా ఉంటున్నానని, అతను నా గురించి నా క్లాస్‌మేట్స్ దగ్గర ఎంక్వయిరీ చేస్తున్నాడు. ఎన్నో ఆశలు, ఆశయాలతో నాగార్జున యూనివర్శిటీలో అడుగు పెట్టా. కానీ ఇక్కడి ఆర్కిటెక్చర్ కాలేజి వరెస్ట్ కాలేజి. ఇక్కడి స్టూడెంట్స్ చాలామంది వరస్ట్ గాళ్ళే. చాలామంది అబ్బాయిలు నాకోసం ట్రై చేస్తున్నారు. నా జీవితం మీద విరక్తి కలుగు తుంది. నేను అనుకున్నదొకటి... జరుగుతున్న దొకటి అన్నీ నాన్నతో చెప్పుకునే నేను.... ఈ విషయాలు చెప్పుకోలేకపోతున్నా. ఎవరితో చెప్పుకోవాలో అర్థం కావటం లేదు. ఫ్రెషర్స్ డే పార్టీ రోజు చరణ్ ఫుల్లుగా తాగి డిన్నర్ సమయంలో తన పక్కన కూర్చో మన్నాడు. ఎలా పడితే అలా మాట్లాడుతుంటే నేను తట్టుకోలేకపోయా. అక్కడన్నుంచి ఎలా తప్పించుకోవాలా? అని ఆలోచించా. నా ఫోన్ లాక్కొని నా నెంబర్లు, ఫోటోలు, వివరాలన్నీ చూశాడు. నాకైతే చచ్చిపోవాలనిపించింది.

# ఆలయంలోనూ వివక్ష..

మహారాష్ట్రలోని శనిశింగాపూర్ దేవాలయంలో పురుషులతో పాటు స్త్రీలను కూడా పూజ చేసుకోవటానికి లోపలి చబుత్రా (మండపం)లోకి అనుమతించాలని ఆందోళన చేస్తూ జనవరి 26న తృప్తి దేశాయ్ నాయకత్వంలో 500 మంది మహిళలు చేసిన ప్రయత్నాన్ని మహారాష్ట్ర పోలీసులు బల వంతంగా సుపా అనే గ్రామం దగ్గర ఆపి అరెస్టులు చేశారు. పూనాకు చెందిన సాఫ్ట్‌వేర్ ఇంజనీర్ తృప్తిదేశాయ్ భూమాతాబ్రిగేడ్ అనే ఒక సంస్థను ఏర్పాటు చేసుకుని పని చేస్తున్నారు. శనిశింగాపూర్‌లో శనీశ్వరుడి స్థూపం ఉన్న చోటుకి మహిళలకు ప్రవేశం లేకపోవడాన్ని అనేకమంది ప్రశ్నిస్తూ వచ్చారు. ప్రముఖ హేతువాది నరేంద్ర బోల్కర్ ఈ దురాచారాన్ని నిరశిస్తూ 2000 సంవత్సరం నుండి విస్తృత ప్రచారం చేస్తూ వచ్చారు. మొదట్లో నరేంద్రబోల్కర్‌కు వ్యతిరేకంగా మాట్లాడిన శివసేన, బిజెపి పార్టీలు క్రమక్రమేణా మౌనాన్ని ఆశ్రయించారు. మహిళల ప్రవేశానికి పెరుగుతున్న ఆదరణను గమనించిన ట్రస్టీలు మగవాళ్ళు కూడా ప్రవేశించకూడదని 2011 నుంచి నిర్ణయించారు. అయితే అందుకు ఒక మినహాయింపునిచ్చారు. ఎవరైతే కానుకలు సమర్పించుకుంటారో వారిని అనుమతించాలనుకున్నారు. 2015 డిసెంబరులో ఒక మహిళ లోపలి మంటపంలోకి వెళ్ళి పూజ చేసింది. దీనితో గ్రామస్తులు, ట్రస్టీలు కలిసి శుద్ధి కార్యక్రమం నిర్వహించారు. దానితో రిపబ్లిక్‌డే సందర్భంగా తృప్తిదేశాయ్ మహిళలకు ప్రవేశం కోరుతూ కార్యక్రమాన్ని చేపట్టారు. మహిళలకు ప్రవేశాన్ని అపటాన్ని చీకటి రోజుగా భూమాతాబ్రిగేడ్ అభివర్ణించింది. దేవుడికి మాటలు వస్తే ఆయన మహిళలకు అడ్డం చెప్పేవారా అంటూ అనేకమంది ప్రశ్నిస్తున్నారు.

-మానవి డెస్క్

## దేవుడు లింగ వివక్ష చూపడు



"శని శింగనాపూర్ ఆలయంలోకి మహి ళలు ప్రవేశించరాదని ఏ దేవుడు చెప్పాడు? ఒకవేళ ఏ దేవుడైనా అలా చెప్పి ఉంటే వారి పట్ల నాకు విశ్వాసం ఉండదు. నేను నమ్మిన భగవంతుడు మాత్రం లింగ వివక్ష చూపించడు. మహిళలకు ఆలయ ప్రవే శంపై సానుకూల నిర్ణయం తీసుకో వాలని ఇప్పటికే సంబంధిత వర్గాలకు సూచిం చాను. వారు ఏం నిర్ణయం తీసుకుంటారో వేచిచూడాలి."

- ఎన్సీపీ అధినేత శరద్‌పవార్

చట్టాలు

# నిర్భయ చట్టం (క్రిమినల్ చట్టాల సవరణలు) 2013

-పొత్తూరి సురేష్ కుమార్, అడ్వకేట్

**ఏ ఆసుపత్రి అయినా వైద్యులయినా ప్రభుత్వమా, ప్రైవేట్ అని తేడా లేకుండా 376, 376ఎ, 376బి, 376సి, 376డి మరియు 376ఇ సెక్షన్‌ల ప్రకారం అత్యాచారాలకు గురైనా మహిళలకు ఉచితంగా వైద్యం వెంటనే చేయాలి. అలాగే ఈ విషయాన్ని పోలీసులకు తెలియజేయాలి. 166బి సెక్షన్ ప్రకారం ఈ విధంగా మహిళలకు ఉచిత వైద్యం చేయనట్లయితే అది నేరంగా పరిగణించబడి సంవత్సరం వరకూ జైలుశిక్ష లేదా జరిమానా లేదా రెండూ విధించవచ్చు.**

అత్యంత విచారకరమైన నిర్భయ సంఘటన తర్వాత క్రిమినల్ చట్టానికి జె.ఎస్. వర్మ కమిటీ చేసిన సిఫారసు మేరకు సవరణలు తీసుకువచ్చారు. వీటినే నిర్భయ చట్టం అని పిలుస్తున్నారు. ఈ సవరణలు ప్రధానంగా నాలుగు రకాలైన చట్టాలలో తీసుకువచ్చారు. ఈ సవరణలు కొన్ని నూతన సెక్షన్‌లు జత చేసినవి, కొన్ని పాత సెక్షన్‌లకు మార్పు లు చేసినవి. ప్రధానంగా ఈ సవరణ లు మహిళలపై హత్యాచార విషయాలలో కఠినంగా శిక్షించి, నిందితుడిని భయ పెట్టడానికి ఉపయోగపడుతాయి. ఎందు కనగా ఈ సవరణలు ద్వారా హత్యా చారాలకు పడే శిక్షను పెంచారు. అలాగే గతంలో నేరాలుగా పరిగణించని కొన్ని విష యాలను ప్రస్తుతం నేరాలుగా నిర్వచించారు.

**భారతీయ శిక్షాస్మృతికి తెచ్చిన మార్పులు:**

భారతీయ శిక్షాస్మృతిలో ఉన్న సెక్షన్ 100కు 7వ అంశాన్ని చేర్చారు. అనగా యాసిడ్ దాడులు గాని, దాడికి ప్రయత్నిం చడం గానీ, తీవ్రమైన గాయాలకు కారణమైన విధంగా ఆ చర్య ఉన్నట్లయితే అలాంటి సందర్భంలో వ్యక్తులకు ఉన్న ఆత్మరక్షణ హక్కును ఉపయోగించవచ్చును. ఆ హక్కును ఉపయోగించుకొనే సందర్భంలో నిందితుడు మరణించినప్పటికీ అది నేరంగా పరిగణించబడదు. ఈ విధంగా యాసిడ్ దాడులు గురయ్యే సందర్భంలో ఆత్మరక్షణ హక్కును ఉపయోగించుకునే హక్కును కల్పించారు.

**ఎఫ్.ఐ.ఆర్. నమోదు చేయకపోవటం:**

**166ఎ, 166బి సెక్షన్‌లు:-** 166ఎకి తీసుకువచ్చిన సవరణ ఫలితంగా మహిళలకు సంబంధించిన హత్యాచారాల విషయంలో అనగా సెక్షన్ 326ఎ, సెక్షన్326బి, సెక్షన్354, సెక్షన్354బి, సెక్షన్370, సెక్షన్ 370ఎ, సెక్షన్ 376ఎ, సెక్షన్ 376బి, సెక్షన్ 376సి, సెక్షన్ 376డి, సెక్షన్ 376ఇ మరియు 509 విషయంలో వెంటనే ఎఫ్.ఐ. ఆర్ నమోదు చేయాలి. అలా చేయనట్లయితే అది నేరంగా పరిగణించ బడుతుంది. అలాగే ఒక నేర పరిశోధన విషయంలో ఏ వ్యక్తికైనా నష్టం కలిగే విధంగా తనకు నిర్దేశించబడిన చట్టవరమైన మార్గ దర్శకాలను ఉల్లంఘించినట్లయితే అది నేరం. అలాగే నేర పరిశోధన సమయంలో లేదా ఏ ఇతర విషయంలోనైనా వ్యక్తులను తమ వద్దకు పిలిపించుకోకూడదు అని ఉన్న మార్గదర్శ కాలను ఉల్లంఘించకూడదు. ఆ విధంగా పై మూడు విషయాలలో ఏ ఉల్లంఘన జరిగినప్పటికీ దానిని నేరంగా పరిగణించబడి 6నెలల నుండి 2 సం॥ల కఠిన కారాగార శిక్ష విధించవచ్చు. జరిమానా కూడా విధించవచ్చు.

పై సవరణలు తీసుకురావటం ద్వారా పోలీసులు మహిళలపట్ల జరుగుతున్న అత్యాచారాల విషయంలో ఉదాసీనంగా ఉండటానికి గానీ, పక్షపాతంగా నిర్వహించ టానికి గానీ అవకాశం లేకుండా చేశారు. అనేక సందర్భాలలో పోలీసులు మహిళలపై జరుగుతున్న హింసపట్ల నిర్లక్ష్యం వహిస్తున్నారు అనే విమర్శలు రావటంవల్ల అలా జరగకుండా ఉండేందుకు ఈ సవరణలు తీసుకువచ్చారు.

**బాధితులకు ఉచిత వైద్యం తక్షణమే చేయాలి:**

166బి:- ఈ సెక్షన్ ప్రకారం ఏ ఆసుపత్రి అయినా వైద్యులయినా ప్రభుత్వమా, ప్రైవేట్ అని తేడా లేకుండా 376, 376ఎ, 376బి, 376సి, 376డి మరియు 376ఇ సెక్షన్‌ల ప్రకారం అత్యాచారాలకు గురైనా మహిళలకు ఉచితంగా వైద్యం వెంటనే చేయాలి. అలాగే ఈ విషయాన్ని పోలీసులకు తెలియజేయాలి. 166బి సెక్షన్ ప్రకారం ఈ విధంగా మహిళలకు ఉచిత వైద్యం చేయనట్లయితే అది నేరంగా పరిగణించబడి సంవత్సరం వరకూ జైలుశిక్ష లేదా జరిమానా లేదా రెండూ విధించవచ్చు.

**228ఎ సెక్షన్‌కు సవరణ: బాధితుల పేర్లను వెల్లడించరాదు:-** ఈ సెక్షన్ ప్రకారం కొన్ని నేరాలకు గురియైనా బాధితుల పేర్లను లేదా గుర్తింపును ప్రచురించటం కానీ, ముద్రించటం కానీ చేయరాదు. కొత్తగా వచ్చిన నేరాలను కూడా ఈ సెక్షన్‌లో చేర్చి సవరించినారు. ఫలితంగా మానభంగం మొదలైన అత్యాచారాలకు సంబంధించిన నేరాలకు గురియైనా వారి పేర్లను వెల్లడించడం నేరం.

**326, 326ఎ, 326బి నూతన సెక్షన్‌లు:-** ఈ సెక్షన్ ప్రకారం యాసిడ్ ఉపయోగించి లేదా పోసి వ్యక్తులకు శాశ్వితంగా గానీ, తాత్కాలికంగా గానీ గాయపరుచుట లేదా రూపం మార్పు చెందుట లేదా ఏదైనా శరీర భాగం నిరుపయోగంగా మారడం లాంటి తీవ్రమైన గాయాలు జరిగినట్లయితే 10 సంవత్సరాల నుంచి జీవిత ఖైదు వరకూ శిక్ష విధించవచ్చు.

జరిమానా కూడా విధించి బాధితులకు చెల్లించవలెను.

**యాసిడ్ దాడి 326బి:-** ఎవరైతే యాసిడ్‌ని పోయడానికి ప్రయత్నిస్తారో లేదా పోస్తారో అది నేరంగా పరిగణించబడుతుంది. ఈ నేరం చేసినవారు వారికి 5 సంవత్సరాలు తక్కువ కాకుండా 7సంవత్సరాల వరకూ శిక్ష విధించబడుతుంది. అలాగే జరిమానా కూడా విధించబడుతుంది.

**సెక్షన్ 354కి సవరణ:** ఈ సెక్షన్‌కి శిక్ష విధించే విషయంలో సవరణ తీసుకువచ్చారు. అనగా ఇంతకుముందు 2సం॥లు ఉన్న పరిమితిని 5 సం॥లకు పెంచారు.

**354ఎ, 354బి, 354సి, 354డి కొత్త సెక్షన్‌లు చేర్చుట.**

**354ఎ లైంగిక వేధింపులు శిక్ష:-** 354ఎ ఈ సెక్షన్ 1(1) ప్రకారం అవాంఛిత మరియు ఆహ్వానించదగని బహిరంగ లైంగిక ప్రవర్తన లేదా భౌతికంగా తాకటం లాంటి ప్రవర్తన.

1(2) ప్రకారం లైంగికపరమైన సమ్మతికోసం ప్రాధేయపడినా లేదా ఆజ్ఞాపించిన.

1(3) మహిళకు ఇష్టం లేకుండా అశ్లీల దృశ్యాలను చూపించటం.

1(4) లైంగికపరమైన వ్యాఖ్యలను చేయడం ఆపై అన్నింటిని కూడా లైంగిక వేధింపులుగా పరిగణిస్తారు. ఈ సెక్షన్ మొదటి మూడు సబ్ క్లాజ్‌లు ప్రకారం శిక్ష లేదా జరిమానా లేదారెండూ విధిస్తారు.

1(5) ప్రకారం నేరం చేస్తే ఒక సంవత్సరం వరకు జైలుశిక్ష లేదా జరిమానా లేదా రెండూ విధిస్తారు.

**సెక్షన్ 354బి: స్త్రీని వివస్త్రను చేయటకు దాడి లేదా నేరపూరిత శక్తిని ఉపయోగించుట:** స్త్రీని వివస్త్రను చేయడానికి లేదా నగ్నంగా మారమని ఒత్తిడి చేసినా లేదా ప్రోత్సహించినా లేదా దాడి చేసినా ఈ సెక్షన్ ప్రకారం నేరంగా భావించబడి 3సంవత్సరాలు తగ్గకుండా మరియు 7సం॥లు వరకూ జైలుశిక్ష లేదా జరిమానా రెండూ విధించబడవచ్చు.

**354సి: వాయురిజం:-** ఏ స్త్రీ అయినా తన వ్యక్తిగతంగా ఒంటరిగా ఎవరు ఉండని సమయంలో చేసుకునే పనులు చేస్తున్నప్పుడు ఫోటోలు తీయటంగాని లేదా గమనించటం గానీ చేయటం లేదా చేపించటం లేదా అలాంటి ఫోటోలను వ్యాప్తి చేయటం ఈ సెక్షన్ ప్రకారం నేరం. మొదటిసారి చేస్తే ఒక సంవత్సరం నుంచి 3 సంవత్సరాలు వరకూ జైలు శిక్ష మరియు జరిమానా విధించబడును. రెండోసారి అదే తప్పు చేస్తే 3 సంవత్సరాలు తగ్గకుండా మరియు 7 సంవత్సరాలు వరకూ జైలు శిక్ష విధించబడును. జరిమానా విధించవచ్చును.

**354డి: స్టాకింగ్:-** ఎవరైనా ఒక పురుషుడు స్త్రీని అనుసరించడం మరియు సంబంధం పెట్టుకోవడానికి ప్రయత్నించడం, వ్యక్తిగతంగా పరిచయం పెంచుకునే ఉద్దేశ్యంతో అనేకసార్లు ఆ స్త్రీ అయిష్టతను వ్యక్తపరచినప్పటికీ ప్రయత్నం చేయటాన్ని ఈ సెక్షన్ నేరంగా పరిగణిస్తుంది. దీనినే స్టాకింగ్ అని అంటారు.

ఒక స్త్రీ ఉపయోగించే ఇంటర్‌నెట్, ఇ-మెయిల్ లేదా ఏ ఇతర ఎలక్ట్రానిక్ సమాచారమైనా మానిటర్ చేయటాన్ని కూడా స్టాకింగ్ అనే నేరం చేయటంగా పరిగణిస్తారు. ఈ నేరం మొదటిసారిచేస్తే 3 సంవత్సరాలు వరకూ జైలుశిక్ష మరియు జరిమానా విధించవచ్చును. రెండోసారి అదే నేరం చేస్తే 5సంవత్సరాలు జైలుశిక్ష జరిమానా విధించవచ్చును.

**370 సెక్షన్‌కు ప్రత్యామ్నాయ సెక్షన్‌లు చేర్చుట:** ట్రాఫికింగ్ (వ్యభిచార వృత్తిలోకి దింపుట)

**వ్యక్తుల ట్రాఫికింగ్: 370:-** ఎవరైతే దోపిడి చేసే ఉద్దేశ్యంతో వ్యక్తులను రిక్రూట్, ట్రాన్స్‌పోర్టు, దాచియుంచుట, లేదా బదిలీ చేయుట లేదా స్వీకరించుట చేసుకొనుట ఈ క్రింది పద్ధతులు ఉపయోగించి చేయటాన్ని ట్రాఫికింగ్ అనే నేరంగా పరిగణిస్తారు.

1. బెదిరించటం, 2, దాడి లేదా ఒత్తిడి చేయటం, 3. ఎత్తుకుపోవటం, 4. మోసం చేయుట లేదా ఫ్రాడ్ చేయుట, 5. అధికార దుర్వినియోగం చేయుట, 6. ప్రేరేపించుట.

ఈ విషయంలో బాధితురాలి సమ్మతితో సంబంధం ఉండదు. అనగా బాధితురాలు ఇష్టపడే వ్యభిచార వృత్తిలోకి వచ్చింది అని చెప్పినప్పటికీ అది నేరంగా పరిగణించబడుతుంది. ఈ నేరంచేసినవాళ్ళకి 7 సం॥లు తగ్గకుండా 10సం॥ల వరకూ జైలు శిక్ష విధించబడుతుంది. ఈనేరంలో ఒకరి కంటే ఎక్కువ వ్యక్తులు ట్రాఫికింగ్ చేయబడితే, లేదా మైనర్లు ట్రాఫికింగ్ చేయబడితే 10సం॥లు తగ్గకుండా జీవిత ఖైదు వరకూ శిక్ష విధించవచ్చు. మరియు జరిమానా కూడా విధించవచ్చు.

ఈనేరంలో ఒకరు కంటే ఎక్కువమంది ట్రాఫికింగ్ చేయబడితే 14 సం॥లు తగ్గకుండా జీవిత ఖైదు వరకూ శిక్ష విధించవచ్చు. జరిమానా విధించవచ్చు. మైనర్ బాలికల్ని ట్రాఫికింగ్ చేసే విషయంలోఒకటి కంటే ఎక్కువసార్లు శిక్ష విధించబడితే జీవిత ఖైదు అనగా ఆ వ్యక్తికి సహజ మరణం సంభవించే వరకూ ఖైదు విధించబడుతుంది. మరియు జరిమానా విధించవచ్చును. ఈ నేరంలో ప్రభుత్వ ఉద్యోగి కానీ పోలీసు అధికారి కానీ భాగస్థుడుగా ఉంటే వారికి జీవిత ఖైదు అనగా ఆ వ్యక్తికి సహజ మరణం సంభవించే వరకూ ఖైదు విధించబడుతుంది.

**ట్రాఫికింగ్ చేయబడిన వ్యక్తిని దోపిడీ చేస్తే 370ఎ:-** ఎవరైతే ఒక మైనర్ బాలిక ట్రాఫికింగ్ చేయబడినది అని తెలిసి కూడా ఆ బాలికను లైంగిక దోపిడీ చేస్తే వారు 5సం॥రాలకు తగ్గకుండా 7సం॥ల వరకూ జైలుశిక్ష మరియు జరిమానా విధించబడును.

ఇదే నేరంలో మైనరు కాకుండా ఇతర వ్యక్తులు లైంగికంగా దోపిడీ చేయబడితే 3 సం॥రాలు తగ్గకుండా 5 సం॥ల వరకూ జైలుశిక్ష విధించబడును లేదా జరిమానా విధించబడును.

కథ

# మొగుడే కాలయముడు

- ఎన్.ఎస్.లక్ష్మీదేవమ్మ

ప్రభాకర్, సావిత్రి దంపతులకు ఒక్కగానొక్క బిడ్డ వరలక్ష్మి. ఎన్నో వ్రతాలు పూజలు చేస్తేగాని ఈ బిడ్డపుట్టలేదు. ఈ బిడ్డ పుట్టినప్పటి నుండి ప్రభాకర్‌కు వ్యాపారంలో బాగా కలిసొచ్చింది. వ్యాపారం మూడు పువ్వులు, ఆరుకాయలుగా సాగుతోంది ఇదంతా కూతురు పుట్టిన వేళ విశేషమనుకుంటారు. బిడ్డను అల్లారుముద్దుగా పెంచారు. చక్కని చదువు సంధ్యలు చెప్పించారు.

బిడ్డ పెరిగేకొద్దీ భార్యభర్తలకు దిగులు మొదలైంది. ఏనాటికైనా ఇంత అల్లారుముద్దుగా పెంచుకున్న బిడ్డను పరాయి ఇంటికి పంపాలిగా? ఈ ఆలోచన వచ్చినప్పుడల్లా వాళ్ళకు అన్నం సహించేది కాదు. అయినా తప్పదని మనస్సు గట్టి చేసుకునేవారు.

మెల్లిమెల్లిగా వరలక్ష్మికి సంబంధాలు చూడడం మొదలుపెట్టారు. ఒకరోజు ప్రభాకర్ స్నేహితుడు పట్నం నుండి ఒక సంబందాన్ని తెచ్చాడు. పిల్లవాడు ఇంజనీరు. లక్షల కొలది కట్నం ఇస్తున్నారు. ఒక్కత్తె కూతురు. వున్న ఆస్తి అంతా వాళ్ళ తదనంతరం కూతురుకే చెందుతుంది. పిల్లవాడు దీర్ఘాలోచనలో పడిపోయాడు. అన్ని విధాలా ఆలోచించాడు. నాకీ సంబందం నచ్చిందని తల్లి తండ్రులకు చెప్పాడు. పిల్లనచ్చిందని చెప్పగానే వెంటనే తాంబూలాలు ఇచ్చిపుచ్చుకున్నారు. పెండ్లి త్వరలోనే పెట్టుకోవాలనుకున్నారు.

ఒక్కగానొక్క బిడ్డ పెళ్ళి ఘనంగా చేయాలనుకున్నాడు. ఏర్పాట్లు మొదలైనాయి. నగ నట్రా, చీరలు షాపింగ్ మొదలైంది. చుట్టాలు, పక్కాలు రావడం మొదలైంది.

వీధి వీధి అంతా నిత్యకళ్యాణం పచ్చతోరణంలా తయారైంది. ముహూర్తం రానే వచ్చింది. వరలక్ష్మిని బంగారు బొమ్మలా తయారుచేశారు. పెళ్ళి అనుకున్నట్లు జరిగిపోయింది. వైభవంగా జరిగింది. వరలక్ష్మి అత్తవారింట్లో మెల్లిమెల్లిగా అలవాటు పడుతుంది. గొప్పింటి బిడ్డ అని అత్తింటివాళ్ళు ఏ పని చెప్పడం లేదు. వరలక్ష్మి కలుపుగోలుతనానికి అందరూ ఆశ్చర్య పోయారు. అంతదనవంతురాలైన ఏ కోశాన గర్వం లేదు. మామూలుగా తనపని తను చేసుకుని పోతుంది. అత్తా మామలను గౌరవిస్తుంది. మరదలును ప్రేమతో చూసుకుంటుంది. భర్త అంటే ఎనలేని ప్రేమ. ఇంతలోగా ఈశ్వర్‌కు ట్రాన్సుర్ అయింది. యాధృచ్ఛికంగా అత్తవారి ఊరికే ఇంజనీరుగా ట్రాన్స్‌ఫర్ అయ్యింది. ప్రభాకర్ సావిత్రమ్మల సంతోషానికి పగ్గాల్లేవు. ఇక్కడ మాత్రం ఈశ్వర్ ఇంట్లో అయ్యో ఇంతమంచి కోడలు ఇంకకొన్ని రోజులైన ఇంట్లో వుండకుండ ట్రాన్స్‌ఫర్ అయ్యిందే అని అత్తమామల దిగాలు.

ప్రభాకర్ సావిత్రమ్మలు ఈశ్వర్‌ను అడిగారు. మా ఇంట్లోనే వుండమని కానీ దీనికి ఈశ్వర్ ఒప్పుకోలేదు. మాకు మీకు దగ్గరలోనే మంచి ఇల్లు చూసిపెట్టండి అని కోరాడు. వరలక్ష్మి కూడా భర్త మాటను కాదనలేకపోయింది.

ప్రభాకర్ వాళ్ళకు దగ్గరలోనే మేడమీద ఇల్లు చూశారు. బిడ్డకు అన్ని వసతులు అమర్చారు. వీళ్ళ సంసారం చూసి ముచ్చటపడుతూవున్నారు.

ఈశ్వర్ వరలక్ష్మిని ఎంతో ప్రేమతో చూసుకునేవాడు. వరం వరం అని ప్రేమతో పిలిచేవాడు. ఒక్కొక్కసారి వరలక్ష్మిని విసుక్కునేవాడు, కసురుకునేవాడు, సంసారంలో గొడవలు మొదలయ్యాయి. వరలక్ష్మి కిమ్మనకపోయేది. తల్లితండ్రులకు చెప్పేదికాదు. జాబులో పని ఒత్తిడి అని చెప్పి బ్రతిమాలేవాడు. అలా ఎగుడు దిగుడుగా సాగుతుంది సంసారం. వరలక్ష్మిపెళ్ళిఅయిన తర్వాత మొదటి పుట్టినరోజు వచ్చింది. ఈశ్వర్ ఈ బర్త్‌డేను తనే సెలబ్రేట్ చేస్తానని, దగ్గర బంధువులను అందరిని పిలువమన్నాడు.

వచ్చిన చుట్టాలకు ఏర్పాట్లు చేయడంలో తలమునకలైంది వరలక్ష్మి. వరలక్ష్మి తల్లి తండ్రులు ఈ ఏర్పాట్లను చూసి మురిసిపోయారు. తమ అల్లుడు బిడ్డను ఎంతగా ప్రేమిస్తున్నాడో ఇది చూస్తునే తెలుస్తుంది అనుకుంటున్నారు. అందరు తృప్తిగా భోజనాలు చేసి ఎక్కడ వాళ్ళక్కడ వెళ్ళిపోయారు. అమ్మనాన్నలు కూడా శెలవు తీసుకుని వెళ్ళిపోయారు. వరలక్ష్మి ఎంతో అలసిపోయినా కూడా అన్ని సర్దుకుంటుంది.

ఈశ్వర్ మెల్లగా 'వరం' అని పిలిచాడు. 'ఏంటండీ' అంది వరం. 'మనం సెకెండ్‌షో సినిమాకి వెళ్దాం వరం' అన్నాడు

**ఈ సమయం కోసమే ఎదురుచూస్తున్న ఈశ్వర్ మెల్లిగా టేబుల్ దగ్గరనుంచి లేచివచ్చి ఆదమరచి నిద్రపోతున్న వరలక్ష్మీ ముఖంపై దిండువేసి రెండు చేతులతో అణిచిపట్టుకున్నాడు. పాపం వరలక్ష్మిఊపిరాడక గిల గిల కొట్టుకుంది. ఆ కొట్టు కోవడంలో ఆమె చేతులకున్న గాజులన్నీ పగిలిపోయి మంచం క్రింద పడ్డాయి. చూస్తుండగానే వరలక్ష్మి ప్రాణాలు అనంత వాయివుల్లో కలిసిపోయాయి.**

ప్రేమగా. భర్త అలా అడిగేసరికి వరలక్ష్మికి ఏం పాలుపోలేదు. 'నేను చాలా అలసిపోయానండి ఇంకోరోజు వెళ్దాం' అంది. ఈశ్వర్ 'నీ పుట్టినరోజు మనిద్దరం సినిమా చూడాలని వుంది వరం 'అని మళ్ళీ ప్రేమగా అడిగేసరికి కాదనలేకపోయింది వరం. సరేనని గబగబ సర్దేసి స్కూటరెక్కి సినిమాకు వెళ్ళారు. సినిమా చూస్తున్నంత సేపు వరలక్ష్మి కునికిపాట్లు పడుతూనే వుంది. ఈశ్వర్‌కు కావలసింది ఇదే తన దుష్టప్లాను సక్సెస్ చేసుకోవడానికి ఈ సెకెండ్ షో ప్లాను పెట్టాడు. వరలక్ష్మి అలిసి పోవడమే కావలసింది. సినిమా వదిలారు. ఇంటికి వచ్చారు. ఈశ్వర్ మంచినీళ్ళు త్రాగి కొంచెం ఆఫీసు వర్క్ వుందని టేబుల్‌మీద వ్రాస్తూ కుచున్నాడు. అప్పటికే బాగా అలసిపోయిన వరలక్ష్మి నేను పడుకుంటానండీ అని చెప్పి గాఢనిద్రలోకి జారుకుంది. ఈ సమయం కోసమే ఎదురు చూస్తున్న ఈశ్వర్ మెల్లిగా టేబుల్ దగ్గర నుంచి లేచివచ్చి ఆదమరచి నిద్రపోతున్న వరలక్ష్మీ ముఖంపై దిండువేసి రెండు చేతులతో అణిచిపట్టుకున్నాడు. పాపం వరలక్ష్మి ఊపిరాడక గిల గిల కొట్టుకుంది. ఆ కొట్టు కోవడంలో ఆమె చేతులకున్న గాజులన్నీ పగిలిపోయి మంచం క్రింద పడ్డాయి. చూస్తుండగానే వరలక్ష్మి ప్రాణాలు అనంత వాయివుల్లో కలిసిపోయాయి.

చనిపోయిందని నిర్ధారణకు వచ్చి గది తలుపులను లోపలి నుండి మూసినట్లే వుంచి బాత్ రూం కిటికిలోనుండి పైపులను పట్టుకొని క్రిందికి మెల్లిగా దిగాడు. వెంటనే రోడ్డుపైకి పరుగెత్తాడు. రాత్రి 2,3 గం॥ సమయంలో ఏదో లారీ వెళ్తుంటే దానిలో ఎక్కాడు. తన తల్లి తండ్రుల ఇంటికి వెళ్ళి జరిగింది చెప్పాడు. ఇది విని నిర్ఘాంత పోయిన వాళ్ళు ఎంతపని చేశావురా అని తలపట్టు కున్నారు. ఇప్పుడు ఎలాగైనా కొడుకును తప్పించాలి ఇది వాళ్ళ కర్తవ్యం అను కున్నారు. కొడుకును ఎక్కడో దాచిపెట్టి కొన్నాళ్ళకు కోర్టుకు సరండర్ చేశారు.

ఇక్కడ తెల్లవారినా తలుపులు తెరవని వరలక్ష్మిని అందరూ పిలవడం మొదలుపెట్టారు. ఎంతకూ లేవకపోయే సరికి తలుపులు బద్దలు కొట్టి చూస్తే ఇంకేముంది మంచంమీద శవమై పడుంది. వరలక్ష్మి తల్లితండ్రులొచ్చి లబోదిబో అని మొత్తుకున్నారు. మంచం క్రింద పగిలిన గాజులను చూశారు. మా బిడ్డ ఎంత పెనుగులాడిందో అని ప్రక్కనున్న దిండును చూసి ఏడ్చారు. వాళ్ళను ఓదార్చడం ఎవరివల్ల కాలేదు. 'మాబిడ్డకు పెళ్ళి చేసి చంపుకుంటిమి. మేమే చంపుకున్నాం' అని కన్నీరు మున్నీరయ్యారు.

ఇక కేసు విషయానికి వస్తే వాడికి బెయిల్ దొరికింది.... ఈ కోర్టులో కొన్నాళ్ళు కేసు నడిచింది. సాక్ష్యాలు లేవని కేసు కొట్టివేశారు. వాడు మళ్ళీ పెళ్ళి చేసుకొని ఇద్దరి బిడ్డలకు తండ్రి అయ్యాడు. సంసారం చేసుకుంటున్నాడు. ఇవండీ... మన కోర్టులు...! తప్పు చేసినవాడికి శిక్షలు పడకనే ఇవే తప్పులు మళ్ళీ మళ్ళీ జరుగుతున్నాయి. నేరగాళ్ళు కాలరెగరేసు కొని తిరుగుతున్నారు. సిగ్గుశరం లేకుండా!

మానవత్వం మంటకలసిన నాడు మొగుళ్ళే కాదు కాల యముళ్ళు మనుష లందరు యమకింకరులవుతారు. జంతువు చేత చిక్కినా ఒక్కసారే చంపి తింటుంది. కానీ మానవమృగం చేతుల్లో చిక్కకూడదు. నరకయాతన పడాల్సివస్తుంది.

●●●

# మతం మరణం మంచి జననం

జ్ఞానం కలిగిన మా దేశ సహోదరుడా
విద్యకై భాగ్యనగరమేగిన మా దేశ సహోదరుడా
నీతిని వెదికిన మా దేశ సహోదరుడా
కష్టంలో ధైర్యంగా ఉన్న మా దేశ సహోదరుడా
నిజం కోసం పోరాడిన మా దేశ సహోదరుడా
ప్రజలలో ఉండాల్సినది గుణం అనే జ్ఞానం అని
మనిషిలో ఉండాల్సినది బలం అనే స్నేహం అని
మతం కన్నా గుణం ప్రధానం అని
కులం కన్నా కష్టం ప్రధానం అని
భావి భారత ప్రజలు తెలుసుకోవాలని
తమ పద్ధతులు మార్చుకోవాలని
మనిషిలో ఉండాల్సింది మనసు అని మతం కాదని
జ్ఞానం అంటే గుర్తుకు వచ్చేది చదువు
ఆ చదువు నిర్లక్ష్యం చేయకుండా
తల్లిదండ్రుల ప్రేమను వృధా చేయకుండా
రాజకీయం అనే ఉచ్చులో చిక్కుకోకుండా
ధైర్యం, సాయం అనే గుణాలను పెంచుకొని
మనల్ని పెంచిన కన్నవారికి
జ్ఞానం ఇచ్చిన గురువులకి
ఉండాలి విశ్వాసంగా
కులాన్ని, మతాన్ని ఎంచకుండా
గుణాన్ని మంచిని ఎంచాలని
ప్రతి ఒక్కరికి ఇవ్వాల్సిన విలువ ఇవ్వాలని
ప్రతి మనిషికి సాయం చేయాలని
జీవితంలో మంచి ఖ్యాతిని పొందాలని
మనదేశంలో కులాన్ని, మతాని కన్నా
గుణాన్ని, మంచిని చూడాలని
మన దేశం పేరును నిలపాలని
మన దేశ యువతకు నా చిరుపలుకులు
దీనిని ప్రకటించి పటించాలని నా ఆశ

**- బి. మేరీ థెరిస్సా**
**9వ తరగతి,రైల్వే హైస్కూల్, విజయవాడ.**

# ఉద్యమాల బాటలో...



తూ॥గోదావరి




### కాల్‌మనీ ఘటనపై

కాల్‌మనీ పేరుతో విజయవాడ నగరంలో వివాహితలను, కుటుంబంలోని ఆడవారిని, విద్యార్థులను వేధిస్తున్న గ్యాంగ్ గుట్టు బయటకు వచ్చిన నేపథ్యంలో ఈ విధమైన కోరల్లో చిక్కుకున్న అనేక కుటుంబాలు రాష్ట్ర వ్యాప్తంగా బయటకు వచ్చాయి. కొన్ని చోట్ల ఒత్తిడిని తట్టుకోలేక కుటుంబ సమేతంగా ఆత్మహత్యలు చేసుకున్న ఘటనలు కూడా జరిగాయి. ఐద్వా కమిటీల ఆధ్వర్యంలో నెల్లూరు, ప॥గోదావరి-3 సెంటర్స్, తూర్పుగోదావరి, చిత్తూరులలో కలెక్టొరాఫీసు వద్ద ధర్నా కార్యక్రమాలు జరిగాయి. కాలమనీ రాకెట్ బయటపడ్డ విజయవాడ నగరంలో అన్ని ప్రజా సంఘాలు కలిసి కాలమనీ పోరాట వేదికగా ఏర్పడింది. రోజు రోజుకూ వెలుగులోకి వస్తున్న కాల్‌మనీ ఘోరాలను, నమోదు అవుతున్న కేసులపట్ల నిరసనను వివిధ రూపాలలో తెలియజేసేందుకు వరుస కార్యక్రమాలు జరిగాయి. దిష్టిబొమ్మ దగ్ధం, అన్ని సంఘాల బ్యానర్స్‌తో ప్రదర్శన, రాస్తారోకో తదితర కార్యక్రమాలు జరిగాయి. తూర్పుగోదావరి జిల్లా రాజమండ్రిలో ఐద్వా బాధిత కుటుంబాలతో కలిసి కలెక్టర్‌కు అర్జీలు ఇప్పించడం జరిగింది.

**'జండర్ బడ్జెట్‌పై సెమినార్:-**

కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు ప్రవేశపెట్టే బడ్జెట్‌లో స్త్రీ, శిశు సంక్షేమానికి కేటాయించే నిధులు ఆశాజనకంగా ఉండటం లేదు. అవసరానికి తగినట్లు కేటాయింపులు లేదు. పైగా కేటాయించిన

విజయవాడ




నిధులను వినియోగించక మరొక శాఖకు మళ్ళించడం జరుగుతుంది. ఈ విధంగా ఉన్న జండర్ బడ్జెట్ మీద అవగాహన కొరకు డిశంబర్ 21న 'సెమినార్ జరిగింది. కామర్స్ రిటైర్డ్ ప్రొఫెసర్, మానవహక్కుల కార్యకర్త పి.మాధవి గారు హాజరయి ఈ విషయంపై ప్రసంగించారు.

**సావిత్రి బాయి పూలే జయంతి:-**


తూ॥గోదావరి

1840లలోనే మొట్టమొదటి మహిళా పాఠశాలను ప్రారంభించి స్త్రీ విద్య కొరకు పాటుపడిన సావిత్రిబాయి పూలే జయంతి జనవరి 3 సందర్భంగా ఐద్వా రాష్ట్ర కమిటీ ఇచ్చిన పిలుపు మేరకు అనంతపురం, నెల్లూరు, చిత్తూరు, తూర్పు గోదావరి, ప్రకాశం జిల్లాల్లో విద్యార్థులకు అవగాహన కొరకు సదస్సులు జరిగాయి. సంక్షేమ హాస్టల్స్, స్కూల్స్‌లోను వ్యాసరచన పోటీలు జరిగాయి.


అనంతపురం

సం[క్రాంతి ఆటలపోటీలు:-


నెల్లూరు


ప॥గోదావరి

సం[క్రాంతి పండుగ సందర్భంగా ఈ ఏడాది రాష్ట్ర వ్యాప్తంగా "సం[క్రాంతి సంబురాలు" జరపాలని ఇచ్చిన పిలుపు మేరకు చిత్తూరు-70 వీధుల్లో ముగ్గులపోటీలు, కుటుంబాలుగా పాల్గొన్నారు. పతంగుల తయారీ పోటీల నిర్వహించారు. ప॥గోదావరి- 6 డివిజన్‌లలో, 61 [గ్రామాలలో, 24 వార్డుల్లో 131 కేం[ద్రాల్లో ఆటపోటీలు నిర్వహించగా 4255మంది పాల్గొన్నారు. నెల్లూరు జిల్లాలో 50సెంటర్స్, విశాఖజిల్లా రూరల్‌లో 16 సెంటర్స్‌లో, విశాఖ సిటీలో50 సెంటర్స్‌లో, కృష్ణాలో27, గుంటూరులో21, [ప్రకాశంలో 80, తూర్పు గోదావరిలో37,విజయవాడలో88 సెంటర్స్‌లో, కడప, అనంతపురం, కర్నూలులలో జరిగాయి.

స్థానిక సమస్యలపై:-

నెల్లూరు టౌన్‌లో కాలువకట్టపై ఇళ్ళ తొలగింపును వ్యతిరేకిస్తూ ఐద్వా ఆధ్వర్యంలో ధర్నా జరిగింది. కా॥ శారద వర్ధంతి సందర్భంగా "మహిళల సమస్యలు- కర్తవ్యాలు అన్న అంశంపై సెమినార్ జరిగింది. అంగన్‌వాడీ మహిళలపట్ల అనుచితంగా వ్యాఖ్యానించిన చింతమనేని [ప్రభాకర్ దిష్టిబొమ్మ దగ్ధం అన్ని జిల్లా కేం[ద్రాల్లో జరిగింది. నిర్భయ 'డే' సందర్భంగా కాకినాడలో ఎస్‌ఎఫ్‌ఐతో కలిసి సదస్సు జరిగింది. విజయవాడ [ప్రభుత్వ ఆసుప[త్రిలో మహిళా రోగిపట్ల అసభ్యంగా [ప్రవర్తించిన వైద్యునిపై చర్య తీసుకోవాలని ఐద్వా నగర కమిటీ ఆసుప[త్రి సూపరిండెంట్‌కు వినతిప[త్రం ఇవ్వడమైనది. ప॥గో॥జిల్లా ఆకివీడులో పేదవారు నివసిస్తున్న ఏరియాల్లో ఇళ్ళు తగలబడ్డాయి. ఐద్వా కమిటీ ఆ [ప్రాంతంలో నిత్యావసర సరుకులు, విద్యార్థులకు పుస్తకాలు పంపిణీ చేసింది.




మద్యంపై చలో విజయవాడ:-

జనం [ప్రాణాలు తీసే మద్యం పాలసీని మార్చాలనే [ప్రధాన డిమాండ్‌తో మద్యం వ్యతిరేక ఐక్య పోరాట వేదిక ఆధ్వర్యంలో జరిగింది. రాష్ట్ర సదస్సు సందర్భంగా 'చలో విజయవాడ' పిలుపుమేరకు హనుమంతరాయ [గంధాలయంలో సదస్సు అనంతరం లెనిన్ సెంటర్ వరకూ ర్యాలీ జరిగింది. ఈ సదస్సులో ఐద్వా జాతీయ ఉపాధ్యక్షులు కా॥ బృందాకరత్, ఎన్‌ఎఫ్‌ఐడబ్ల్యు నాయకులు అనీరాజా [ప్రధాన వక్తలుగా పాల్గొన్నారు. 26 సంఘాలతో ఏర్పడిన మద్యం వ్యతిరేక ఐక్య వేదిక ఆధ్వర్యంలో ఈ జరిగింది. ఈ సందర్భంగా 10,000 కరప[త్రాలు, 2,000 పోస్టర్లుతో [ప్రచారం జరిగింది. [ప్రదర్శన ఉత్తేజకరంగా జరిగింది.





International women's day wishes



# NCS Sugars Limited

Factory : Lakshmi Thirumala, Latchayyapeta - 535573, Seetanagaram (Mandal)
Via Bobbili, Vizianagaram Dist., A.P
Ph. No : 254239, 254270 Fax : 08944-255216 e-mail : ncssugars_Unit@ncsgroup.in



**Sri N. Srinivas**
Director



**Sri N. Nageswara Rao**
Managing Director

**Sri K. Surya narayana**
Chief Executive

## అంతర్జాతీయ మహిళా దినోత్సవ శుభాకాంక్షలతో..



మహిళా సాధికారిత లక్ష్యంతో పార్వతీపురం పట్టణ ప్రధమ మహిళ అయిన గౌ॥నీ॥ మున్సిపల్ ఛైర్‌పర్సన్ శ్రీమతి ద్వారపురెడ్డి శ్రీదేవి గారికి ప్రపంచ మహిళా దినోత్సవ సందర్భంగా హార్థిక శుభాకాంక్షలు తెలుపుతూ.. వారి ఆధ్వర్యంలో పార్వతీపురం పురపాలకసంఘం మెప్మా విభాగంలో మహిళా సంఘాలను అన్ని రంగాలలో బలోపేతం చేయాలని కోరుకుంటూ..

**శ్రీమతి ద్వారపురెడ్డి శ్రీదేవి**
మున్సిపల్ ఛైర్‌పర్సన్, పార్వతీపురం

49

**మెప్మా సిబ్బంది మరియు**
**పట్టణ మహిళా సమాఖ్య**
**పార్వతీపురం పురపాలక సంఘం**

# అంతర్జాతీయ మహిళా దినోత్సవ సభలు



తణుకు



విజయవాడ



గుంటూరు



విశాఖ టౌన్



అనంతపురం



విశాఖ రూరల్



కర్నూల్



యుటిఎఫ్ మహిళా టీచర్ల మహా సమ్మేళనం - కాకినాడ



Printed & Published by Mallu Swarajyam, Published at AIDWA State Office, Kalpana Prints Road, Krishna Lanka, Vijayawada. Ph. 9490098620, Printed at Prajasakti Daily Printing Press, Krishna Nagar, Tadepalli (M) Guntur Dt. Editor : D. Rama Devi

|  | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |
|---|---|

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | CMVOLA150 |
| పుస్తకం పేరు | చైతన్య, మానవి |
| తారీఖు | 21/08/2023 |
| ముందు అట్ట | Yes |
| వెనుక అట్ట | Yes |
| మొత్తం పేజీలు | 53 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Nandini |
| పేజీలు విడదీసినది | Nandini |
| స్కాన్ చేసినది | sandhya |
| పరీక్ష చేసినది | AMRUTHA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | Good |